MADRAS GOVERNMENT ORIENTAL SERIES.

Published under the authority

of the

Government of Madras.

*General Editor*

T. CHANDRASEKHARAN, M.A., L.T.,

*Curator, Government Oriental Manuscripts Library, Madras.*

No. L. Vol. III

# శ్రీ రామాయణము

కట్టావరదరాజ కృతము.

(సుందర కాండము)

TANJORE SARASWATI MAHAL SERIES No. 63.

# SRI RAMAYANAMU

BY

## KATTA VARADARAJU.

(SUNDARA KANDA)

CRITICALLY EDITED WITH INTRODUCTION

BY

**Sri N. VENKATA RAO,** M.A.,
*Senior Lecturer and Head of the Telugu Department*
*Madras University, Madras.*

Published by
Sri GOPALAN B.A., B.L.,
Hony. Secretary for the Administrative Committee.
**T. M. S. S. MAHAL LIBRARY, TANJORE.**

# PREFACE

—: o :—

This publication contains the "Sundara Kanda" of Katta Varadaraju's Dvipada Ramayanamu. This is issued in continuation of our prior publication of "Bala" "Ayodhya" "Aranya" and "Kishkindha" Kandas. We hope this publication will receive the same appreciation from the public and the press as the prior ones have had.

The subsequent kanda (yuddha) is being printed and will soon be issued.

Our thanks are due to the editor Sri N. VENKATA RAO, Head of the Department of Telugu, University of Madras for his valuable services in editing the work and to Sri A. Mahadeva Sastry and Sri V. Sundara Sarma, the Telugu Pandits of our Library for carefully going through the original and preparing a correct copy for the edition.

We are grateful to the Government of Madras for their timely grants that have enabled us to publish this and other valuable manuscripts of this Library. We must thank also the Rathnam Press, Madras, for the neatness and despatch with which they have executed the printing of this publication.

Saraswati Mahal Library,
TANJORE.
15-5-1952

**S. GOPALAN,**
***Honorary Secretary.***

# పీఠిక



మదరాసురాష్ట్రీయ ప్రభుత్వమువారి సమాదరణమున తంజావూరి శ్రీ శరభోజీ సరస్వతీ మహాలు భాండాగారమువారిచే ప్రకటితమగుచున్న కట్టావరదరాజ కవికృత ద్విపద రామాయణమున నీ వఱకు బాల అయోధ్యాకాండములుగల మొదటి సంపుటమును అరణ్య కిష్కింధా కాండములుగల రెండవ సంపుటమును వెలువడినవి. ప్రస్తుతము వెలువడినది మూఁడవ సంపుటము సుందరకాండము వెంటనే యుద్ధకాండముకూడ ప్రత్యేక సంపుటముగ వెలువడును. మొదటి రెండు సంపుటముల వలెనే యుద్ధకాండ మొక్కటియే ప్రత్యేక సంపుటము కాదగినంత పెద్ద గ్రంథమగుటచేత, సుందరకాండము దానితో కలుపుటకు వీలులేకపోయినది. మఱియును సుందరకాండ పారాయణ గ్రంథమగుటచేత ప్రత్యేకముగ నొక సంపుటముగనే ముద్రించిన నది కేవలము పండితులైన సాహిత్య విద్యోపాసకులకేగాక, భక్తులకు, స్త్రీలకు, పాఠకలోకమునకు ననుకూలముగనుండుననునభిప్రాయముతో నిట్లు కావింపఁబడినది.

వరదరాజకవినిగూర్చి ప్రథమ సంపుటము పీఠికలో విపులముగ నుండుటచేత నిచట వ్రాయలేదు. ఆతఁడు క్రీ. శ. 1630 ప్రాంతమున ప్రసిద్ధుఁడైన రాజకవి.

ఈ సుందరకాండ రచనము, తక్కిన కాండముల రచనము వలె, మూలానుసరణమై సులభగ్రాహ్యమైయున్నది. ఈసుందర

కాండ రచనా ప్రస్తావన మాత్రమే యీ పీఠికయందు చేయు చున్నాఁడను.

సుందరకాండము రామాయణమునఁ బ్రధానత్వమునుబడ యుటకనేక కారణములుగలవు. హనుమంతుఁడు సీతాసందర్శనముచేఁ గృతకృత్యుఁడయ్యెను గాన నా కాండమును పారాయణముచేసిన సర్వులుకృతకృత్యులగుదురని కొందఱి భావము. అది నిశ్చయమే. హనుమంతునంతటి భక్తునకుఁ గృతకృత్యత గల్గుటలో లోపమెంతమాత్రమునుండదు. చాలమంది యాపత్సమయముల సుందర కాండమునే పారాయణము చేయుదురు. ఇతర కాండములట్టివి కావనికాదు. ఇది యుక్తియుక్తమను వారి భావము నకు కారణముపైన వివరించినట్టులే యని యెఱుంగునది. శ్రీరామజనన సత్కథాభూషితమగు బాలకాండ మట్టిదికాదా యని ప్రశ్నింపరాదు. గతాను గతికన్యాయము మఱపునకు రాఁగూడదు. హనుమన్మంత్రములో సుందర హనుమన్మంత్రము గలదు. ఆ మంత్రము హనుమన్మంత్రములోఁ బ్రధానము. ఆ మంత్రము నుపాసించుచుఁ దత్స్వరూప చిహ్నమగు సుందర కాండమును పారాయణముచేసినచో శీఘ్ర ఫల ప్రదమని ప్రాజ్ఞులైన పెద్దల యభిప్రాయము. మంత్రాధికారము లేనివారుకూడ నీ సుందరకాండమును పారాయణము చేయుటగలదు. నిశ్చల భక్తి భావనతో నట్లు పారాయణము చేసిన యా హనుమంతుఁడే శ్రీ రామచంద్రు నానతిని సకలపురుషార్థములును సమకూర్చును.

ఇంతేకాక నీకాండమున స్వభక్త ప్రతీరూప మున స్వమహిమా ప్రదర్శన మనువదింపఁ బడినది. భక్తునకు నచంచల భావనయున్న కార్య సాఫల్యమగునని నిరూపితమైనది. కవితా

విషయమునగూడ, నీకాండము తక్కిన కాండములకన్న మనో హరముగ నుండుటచేత దీనికి సుందరకాండము అను పేరు వచ్చిన దని యభియుక్తోక్తి.

సంస్కృత మూలమునందలి పారాయణ యోగ్యతను, కవితారచనను గమనించియే తెనుగున వరదరాజు తన ద్విపద కృతినిగూడ పారాయణ యోగ్యతగలదిగాను, ప్రౌఢరచనా సమ న్వితముగాను రచియించియున్నాఁడు. అట్టి పట్టులను రెండింటి నుదాహరించుచున్నాఁడను.

సంస్కృత మూలమున నీకాండమున నరువదియెనిమిది సర్గలును, రెండువేల యెనిమిదివందల యెనిమిది శ్లోకములును గలవు. [1]తెలుగు సుందరకాండ ముద్రణములో ప్రథమ సర్గమున 157 శ్లోకమునుండి 9 శ్లోకములు ప్రక్షిప్తములని చెప్పబడినవి.

కాని వరదరాజకవి యా శ్లోకములనుగూడ తెనిగించి యున్నాఁడు. ఈ తెనిగింపుతోకూడ నీ తెనుగు సుందరకాండమున 5079 ద్విపద పంక్తులుగలవు. మూలము నీతఁ డెట్లనుసరించెనో తెలుపుటకు నుదాహరణములు.

తం ప్రయాంతం సముద్వీక్ష్య సురసా వాక్యమబ్రవీత్
బలం జిజ్ఞాసమానా వై నాగమాతా హనూమతః
ప్రవిశ్య వదనం మేఽద్య గంతవ్యం వానరోత్తమ
వరఏష పురా దత్తో మహ్యం ధాత్రేతి సత్వరా.

---

1. చూడుము వావిళ్ల ముద్రణము శ్రీచదలువాడ సుందరరామశాస్త్రి గారి తాత్పర్య సహితము పుట 58.

వ్యాదాయ విపులం వక్త్రం స్థితా సా మారుతేః పురః
ఏవముక్తస్సురసయా క్రుద్ధో వానరపుంగవః
అబ్రవీత్కురుమైవక్త్రం యేనమాం విషహిష్యసే
ఇత్యుక్త్వా సురసాక్రుద్ధా దశయోజనమాయతా.
దశయోజన విస్తారో బభూవ హనుమాంస్తదా
తం దృష్ట్వా మేఘ సంకాశం దశయోజనమాయతమ్.
చకార సురసాచాస్యం వింశద్యోజనమాయతమ్
హనుమాన్ స్తు తతః క్రుద్ధ స్త్రింశద్యోజనమాయతః
చకారసురసావక్త్రం చత్వారింశత్తథోచ్ఛ్రితం
బభూవ హనుమాన్వీరః పంశాచద్యోజనోచ్ఛ్రితః
చకారసురసావక్త్రం షష్టి యోజనమాయతం
తథైవ హనుమాన్వీర స్సప్తతీయోజనోచ్ఛ్రితః
చకారసురసావక్త్ర మశీతీయోజనాయతం
హనుమాన చలప్రఖ్యో నవతీయోజనోచ్ఛ్రితః
చకారసురసావక్త్రం శతయోజనమాయతం
తద్దృష్ట్వావాదితం త్వాస్యం వాయుపుత్ర స్సుబుద్ధిమాన్.

(ప్రథమాస్సర్గః)

వరదరాజు కాలమునాటి కీశ్లోకములు రామాయణ సుందరకాండమునందుండినట్లుగా నాతని యీ క్రింది భాషాంతరీకరణము తెలుపుచున్నది.

"యుక్తిచే నపుడు మ – హోరగమాత
సురసను బిలిచి "యో! – సురస నీవితని
విరసించి తచ్ఛక్తి – వీక్షింపు" మనిన
నాకొమ్మ దానవి – యై యడ్డగించి

"నీకింకఁ బోవచ్చు - నేవార్ధి దాఁటి ?
నినుపట్టువారి మ్రిం - గఁగ నాకునిచ్చె
వనజసంభవుఁ డొక్క - వరమట్లు గానఁ
గడవఁ జెల్లునె బ్రహ్మ - కట్టడ నిన్ను
విడువ నాయందుఁ బ్ర - వేశింపు మనుచు
వదనంబు దెఱచిన - వాయుసుతుండు
బెదరక దానిఁగో - పించి యిట్లనియె.
"శ్రీరాము నానతి - సేయంగఁ బూని
యో రాక్ష ! నే నేఁగు - చున్నాఁడ నిపుడు
మఱలి వచ్చిన నీదు - మాటచే పట్టి
తెఱచిన నీదు నో - టికి నగ్గమౌదు
నిపుడు తీరద" టన్న - యేనేల విందు ?
కపివీర ! నిన్ను మ్రిం - గక పోన" ననుచు
వదనంబుఁ దెఱచిన - వాయుసుతుండు
పదియోజనంబుల - పాటిగాఁ బెరిగె
వలుద నోరదియు ని - ర్వది యోజనముల
కొలఁదిఁ బెంచిన గాలి - కొడుకు గాత్రంబు
ముప్పది యోజనం - బులుగాఁగఁ బెంప
నప్పుడు నలువది - యామడ వెడల్పు
నాగమాతయు వద - నముఁ బెంప నతఁడు
నాఁగతి నేఁబది - యామడ బెరిగె !
అరువది యామడ - యాసురి నోరు
వఱప వాయుజుఁడు డె - బ్బది యోజనములు
బలిసి నిల్చిన యెనుఁ - బది యోజనములు

వెళపుగాఁ దననోరు - వెంచెను సురస !
అంతటఁ దొంబది - యామడ వాయు
సంతతి మై'' పెంప - శత యోజనములు
తననోరు నాగమా - తయుఁ బెంపఁ జూచి (సుం. పుట 5)

హనుమంతుఁడు సీతనుఁ జూచినపు డామెస్థితి :

" తాంస్మృతీమివ సందిగ్ధామృద్ధిం నిపతితామివ
విహతామివివ చ శ్రద్ధామాశాం ప్రతిహతామివ
సోపసర్గాం యథా సిద్ధిం బుద్ధిం సకలపామివ
అభూతేనాపవాదేన కీర్తిం నిపతితామివ.
రామోపరోధవ్యధితాం రక్షోహరణకర్శితాం
అబలాం మృగశాబాక్షీం వీక్షమాణాం తతస్తతః
బాష్పాంబు పరిపూర్ణేన కృష్ణవక్రాక్షి పక్ష్మణా
వదనేనా ప్రసన్నేన నిశ్వసంతీ పునఃపునః
మలపంకధరాం దీనాం మండనార్హామమండితాం
ప్రభాంనక్షత్ర రాజస్య కాలమేఘైరి వావృతామ్ "

(పంచదశస్సర్గః. 32-37 శ్లోకములు)

''అతివసంశయ యుక్తమగు స్మృతికరణి
నతనాభి పడిపోయిన సమృద్ధి యనఁగ
తరలలోచన విహతశ్రద్ధరీతి
అరవిందముఖి వ్యర్థమగు నాశకరణి
చెలియ వమ్మగు కార్యసిద్ధియుపోలి
పోలఁతి కలంగిన బుద్ధికైవడిని
తరుణి యుక్తాపరాధ సమాఖ్యమాడ్కి

భరతాగ్రజునిఁ బాసి పరితపించుచును
విన్నఁబాటుననుల్కి వీక్షించితాను
విన్ననై సదసద్వివేకంబులేక
యర్థివల్లింపని యాగమవిద్య
యర్థాంతరముఁ బొందునట్టివాక్యంబు
కరణిసాగాములు గననీకయున్న
ధరణితనూజ వర్తన మాలకించి ”

(పుట 60. 1418–1482పంక్తి.)

రామాయణ శ్లోకములకు ద్విపద యనువగునట్లు వేఱొక ఛందస్సు పొసగదు. మఱియును ద్విపద పాటవలె పాడుకొనుట కనువగుటచేత నీరచనమే ప్రజాసామాన్యము నాకర్షించినది. పైరీతిగ మూలము ననుసరించుచు, రచించి వరదరాజు మూలాతిక్రమణను చేసిన పట్టులయందు, కవితా చమత్కారమును చూపి, కథాకథనము కమనీయముగావించి యున్నాఁడు. ఆదికావ్యము, “పాఠ్యేగేయేచ మధురమ్” అన్నసూక్తి కాధారము గావున వరదరాజును, తనరచనను, గేయకృతి కనువుగానుండు నట్లు తెనిగించి యున్నాఁడు. ఆఘట్టము లివి.

పాల్కుఱికి సోమనాథునివలె నీకవియు సంత్యానుప్రాసలును పదమధ్యానుప్రాసలును పాటించి ద్విపదకావ్యరచనకు విశిష్టత కల్పించియున్నాఁడు. ఇందులకు రెండుదాహరణములు జూపుచున్నాను.

"రథగజహయ భటవ్రాత నిశ్శంక
పృథుగోపురాగ్ర కుంభిధ హారిణాంక
పౌలస్త్య దోర్దండ బలబిరుదాంక
సాలగుప్తినిరస్త శాత్రవాతంక
పరబలోపల శౌరి భటశౌర్యటంక
శరధి వేలావనాంచత్కలా వింక
కలధౌత సౌధ సఘటిత విటంక
లలితశృంగారా కలంక యాలంక"

(15 పుట)

"దానులనర్థినిదానుల సుపరి
ధానుల వివిధాభి ధానుల సదవ
ధానుల రుచిరోప ధానుల సావ
ధానుల జయసంవిధానుల సప్ర
ధానుల బహుయాతు ధానులం గనుచు
నావల వివిధమాయావులఁ గ్రూర
భావుల దీనసంభావుల సాను
జీవులఁ గలుషోప జీవుల మద్య
సేవులఁ గృతవీర సేవులఁగాంచి
ధీరులఁ బోషిత ధీరుల సమర
శూరుల విక్రమశూరుల సపరి
వారుల శౌర్యదుర్వారుల వరవి

చారుల దుర్గుణాపారుల నాత్త
చారుల యామినీ శౌరులఁ జూచి"

(పుట 27)

ఈగ్రంథమందే కవి మఱియొక పట్టునద్వ్యప్రాసముల నెట్లు పయోగించి రచన మనోహరము గావించెనో ఈ క్రిందియుదాహరణముబట్టి గ్రహింపవచ్చును.

"వేళంబయందందు వెదకుచు నతివి
శాలాయతన చంద్ర శాలాంతరముల
రాజితంబులును బురందర ప్రముఖ
పూజితంబులును సంపూర్ణ వస్తువుల
నూర్జితంబులును దివ్యోపధావిధ స
మార్జితంబులును మాయాసురశిల్పి
నిర్మితంబులును మాణిక్యప్రకాశ
వర్మితంబులును రావణభుజశౌర్య
పాలితంబులును నపారవిభూతి
లాలితంబులును నీలమణి ప్రవృద్ధ
నీలిమంబులును గంధిల ధూపధూమ
శాలిమంబులును రంగన్మాలికాంత
రామణీయకములు రత్నవితర్ది
కామనీయకములఁ గాంచనకుడ్య
భాగంబులును దైత్య భామాహితాను
రాగంబులును నైన రాక్షస విభుని
నడినన్న రాణివాసముల వాసములు
పుడమిపట్టినిజూచుఁ బూనికఁ జూచి"

(పుట 85)

మొదటి రెండుసంపుటముల యందును రంగనాథరామాయణ ద్విపదలకును, వరదరాజురామాయణ ద్విపదలకుగల సంవాదములనుఁ జూపితిని. అట్లే సుందరకాండమునందలి ద్విపదలను పరిశీలించితిని. కాని యందు భిన్నరచనలే కానవచ్చినవి. తక్కిన మొదటికాండములు నాల్గింటికన్న సుందరకాండముననే రచనాభేదము లెక్కువగానున్నవి. ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు ప్రకటించిన రంగనాథ రామాయణమున మొదటి యనుబంధమున 674 పుట నుండి 676 వఱకు మాత్రమే రచనాభేదముగలదు. కాని, రెండవ యనుబంధమున 724 పుటనుండి 749 పుట వఱకు రమారమి వేయి ద్విపదలుగల భాగముగలదు. ఇది ప్రత్యేకరచనయేగాని ప్రక్షిప్తముగాదు. ఈ రెండనుబంధముల లోనున్న వానికిని కొన్ని సంవాదములు గలవు. వాని నన్నింటిని చూపుటకిది యదనుగాదు. ఒక్కటిమాత్రము మచ్చునకుచూపుచున్నాను.

౧. అనుబంధము – శ్రీతర్వతో వేము శ్రీశుతో జోగి దాతతో
(575 పుట) విప్రుండు ధనికుతోఁ బేద. జాతి రత్నముతోడ
సరిగాజుపూస భూతలంబున సరిపోల్చినయట్లు

౨. అనుబంధము – శ్రీతరుతో వేము సిరితోడ లేమి
(725 పుట) బూతంబుతో నక్కపురుణించినట్లు.

ఈ దృష్టితో రంగనాథరామాయణ ప్రతులన్నింటిని పరిశీలింపఁదగియున్నది. ఈ విషయమంతయు వరదరాజురామాయణ ప్రశస్తిని యుద్ఘోషించుటయేగాక, రంగనాథరామాయణ సమీచీన సంస్కార పరిష్కరణమున కెంతయేని తోడ్పడగలదు. రంగ

నాథ రామాయణానుబంధములందలి రచనములు ప్రథమసంకీర్త నాచార్యులగు తాళ్ళపాక అన్నమయ్యగారి ద్విపద రామాయణమునందలి వని నానిశ్చితాభిప్రాయము. వరదరాజకృతివలె రంగనాథరామాయణము నవీన పరిష్కరణ విధానము ననుసరించి ముద్రించిన యపూర్వ విషయము లెన్నియేని ప్రకాశములుకాఁగలవు.

రంగనాథ రామాయణమున సుందరకాండలో 1130 ద్విపదలు గలవు. ఇందు మూలమునగల సురస, జంబుమాలి మొదలగువారి వృత్తాంతములు విడువఁబడినవి. మఱియు వరద రాజ కృతియందలి సంభాషణా నైపుణ్యముగాని, జాతివార్తా చమత్కారముఁగాని, వర్ణనాచాతుర్యముగాని రంగనాథ రామాయణమున గన్పట్టదు. నేఁటివఱకునునముద్రితముగా నడగియుండుటచేత వరదరాజకృతియందలి విశిష్టత లోకమున కెఱుకబడకుండుటయు, రంగనాథ రామాయణమే మనోహరమైనదనియు రచనాసౌందర్యముగలది యనియు, విమర్శకులను గొనుటకు గారణమైనది నేడు రెండుకృతులును హస్తగతములగుచున్నవికాన, నీ రెండింటి కవితావిమర్శనమును విబుధలోకము గావించిన యథార్థము వెల్లడియగును. వరదరాజు సుందరకాండ రచన సుందరతమముగనున్నదనుట సత్యదూరముగాదు.

శబ్దావ్యాకరణ విశేషములు,

1. చేసుక, పట్టుక మొదలగు ప్రయోగములు గలవు.

2. చేతురు అనియేకాక, 'కోయుదము' అను నుభయప్రార్థ నార్థకమున 'కోతము' అని ప్రయోగించినారు "చేతిసూరీల కోత మిప్పుడె" (2050 పంక్తి)

3. "బిగియఁ గౌఁగలించు" అనుటకు "బిగ్గకవుంగలించు" అని ప్రయోగము

(కేలుతోఁగూడ బిగ్గకవుంగలించి) (1877)

4. పరియాయశబ్ద భవము పారి.
ఒక్కపారిగా ఒక్కపరియాయము
"మీరైనకత్తుల మెడఁగోయుఁడొక్క
[1]పారిగాద్రిమ్మింగి మీపగఁ దీర్చుకొనుఁడు"

(2103-4 పంక్తి)

5. కంచెలకు కంచలియ అనురూపము
"చనుగుబ్బలందు కం - చలియలు బిగియు"

(930 పంక్తి)

6. సూళగేరులు-సూళగేరి యనుదానికి బహువచనము

(651 పంక్తి)

ఇది కన్నడపదము - వేశ్యవాటికయని దీనియర్థము

7. కలయఁజూచి యనుటకు కలెజూచి (3907)

8. ఎఱుంగక యనుటకు ఎఱంగక
రామ నీమహిమ యె - ఱంగఁగరాదు (3169)

9. ధర్మదార - యుద్ధము నిలుపుచేయుటకు సూఁధుబాశా
దనుజులో ధర్మదార వట్టుదుమొ (3534)

---

1. ఈపదము నేఁటికిని విశాఖమండలమున జానపదుల వ్యవహారమున నున్నది.

10. ఉన్నారు మొదలగువానిలో 'నా'కు వ్యంజనయతి
"నను నెదిరింపనున్నారు మీవీటి" (3533)

11. "మలచిన కంబముల్ మాటాకులెత్త" (867 పంక్తి)

12. "కన్నులఁజూచినఁ గానాదు తనువు.
పన్నలు వొగడసాఫల్యము నొందు!" (1004 పంక్తి)
పన్నలు - పరిచారకులు.

ఇంకను, గగనమహలు, (772) బురుసీనులు (1019) శ్రీరామదాసుఁడు (3634) (హనుమంతుని విశేషము) విజయవిలాసము (3358) మొదలగు పదము లీతని జాతివార్తానైపుణ్యమును బ్రకటించుచున్నవి. మఱియు

నీతంబుతోఁక వీనికి నాస్తిగాన
నిజముగాఁతోఁక వీనికి నాస్తిచేసి" 4106 - 7

అను సరసశ్లేషలును నచ్చటచ్చట గలవు.

పెరతేనియలుకుండ బుట్టు తేనియలు
కురుజ తేనియలును కొమ్మతేనియలు
బుట్టు తేనియలును బొదల తేనియలు
జుట్టుతేంటులుఁ బీల్చుచుండి తేనియలు (4670)

ఇందు పలువిధములకు తేనియలు బేర్కొనబడినవి. గణపవరపు వెంకటకవి తనప్రబంధరాజమున వీనిని గ్రహించియున్నాఁడు ఇది మూలమున లేదు.

ఇందలి రావణ వర్ణనము లంకా వర్ణనము హనుమత్సీతా సంభాషణము మున్నగు వర్ణనలుగల ఘట్టములేగాక గ్రంథమంతయు నా మూలాగ్రముగాఁ బఠింప నర్హతగలది. ద్విపద నైహికాముష్మిక హేతువు గాన, నీ సుందరకాండ ద్విపదకృతిని పారాయణమొనర్చి, యంధ్రమహాజను లైహికాముష్మిక సుఖములందెదరుగాక !

ఈ సంపుటము తంజావూరి పుస్తక భాండాగారమువారు వ్రాసిపంపిన వ్రాఁతప్రతి నాధారముగాగొని ముద్రింపఁబడినది. ఇందేమేని దోషములున్న క్షంతవ్యుఁడను. ఈ సంపుట ప్రకటనకు హేతుభూతులగు తంజావూరి పుస్తక భాండాగార గౌరవ కార్యదర్శి యస్. గోపాలనుగారికి నా కృతజ్ఞత. వ్రాఁత ప్రతినుండి సంప్రతించి ప్రూఫులు సరిజూచి, తోడ్పడిన చిరంజీవి శివసుందరేశ్వరరావునకు నా యాశీస్సులు.

ఇ తి శి వ మ్

మదరాసు
23-5-1952

నిడుదవోలు వేంకటరావు ఎమ్. ఏ
మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర
శాఖాధ్యక్షుఁడు.

---

# విషయసూచిక


హనుమంతుఁడు మహేంద్రపర్వతముపై విశ్రమించుట 1

మహేంద్రపర్వతమునుండి సముద్రమును హనుమంతుఁడు లంఘించుట 4

మైనాకుఁడు సముద్రుని యానతిని హనుమంతునకు నాతిథ్యమొసంగుట 8

దేవతలు హనుమంతుని శక్తిఁ బరీక్షించుటకు సురసను నడ్డగింపఁ బంపుట 10

హనుమంతుఁడు సురసను జయించుట 12

సింహిక హనుమంతు నడ్డగించుట, అతఁడామెనుచంపి సముద్రములోఁ బడవేయుట 13

సముద్రమునుదాఁటి హనుమంతుఁడు త్రికూటాద్రిపై మీఁదనున్న లంకనుఁ జూచుట 14

లంక యుత్తరద్వార మాతఁడుచేరుట 16

లంకనుగాచు లంకిణి హనుమంతు నడ్డగింప నతఁడామెను జయించి లంకలోఁ బ్రవేశించుట 18

హనుమంతుఁడు లంకలోని విశేషములను జూచుచు సీతను వెదకుట 20

హనుమంతుఁడు రావణుని యంతఃపురమున సీతను వెదకుట 31

హనుమంతుఁడు రావణుని రాణివాసమందిరములో సీతను వెదకుట రాణివాస స్త్రీ వర్ణనము 35

హనుమంతుఁడు నిద్రించుచున్న రావణాసురునిఁ జూచుట 43

హనుమంతుఁ డెంతవెదకినను సీతనుఁ గానక మిక్కిలి చింతిల్లుట 49

హనుమంతుఁడు సీతను గానమికి దుఃఖించి ప్రాణత్యాగముఁ జేయ నిశ్చయించుట 50

హనుమంతుఁ డశోకవనమును గనుగొనుట అశోకవన వర్ణనము 53

అశోకవనమున హనుమంతుఁడు శింశుపావృక్షచ్ఛాయను సీతను గాంచుట 58

అశోకవనమున దుఃఖితయైన సీత పరిస్థితిఁజూచి హనుమంతుఁడు విచారించుట 61

సీత గూర్చుండిన శింశుపావృక్షముపై హనుమంతుఁడు చేరుట 66

అశోకవనమునకువచ్చు రావణుని హనుమంతుఁడు చూచుట 68

రావణుఁడు సీతతో తన మనోరథముఁ దెలుపుట 71

సీత కోపముతో రావణుని మాటలకుఁ బ్రత్యుత్తరముఁ జెప్పుట 74

రావణుఁడు సీతమాటలకుఁ గోపించి యామె ప్రత్యుత్తరమున కరువది దినములు గడువు నిచ్చుట 76

తనచుట్టునున్న రాక్షసస్త్రీలు సీతను రావణునికోర్కె నెఱవేర్పుమని నయభయముల బోధించుట 80

సీత వారిమాటలకుఁ బ్రత్యుత్తరమిచ్చుట 83

రావణుని ప్రేరణచే సీతచుట్టును గాఁపున్న రాక్షసస్త్రీలామెను రావణుని ప్రేమింపకున్న చంపెదమని బయపెట్టుట 84

సీత వారిమాటలకు శోకించుట 87

సీత రాక్షసాంగనలతో తన మనోనిశ్చయముఁ దెలుపుట 89

త్రిజట తన స్వప్నవృత్తాంతమునుఁ జెప్పుట 91

సీత తనకు మరణముకన్న వేఱు మార్గములేదని యురిపోసికొన నిశ్చయించుట 95

హనుమంతుఁడు సీతతో మాటాడుట కిది మంచిసమయమని తెలిసికొని ముందువెనుక లాలోచించుట 97

సీత వినునట్లుగా హనుమంతుఁడు రామ ప్రశంస చేయుట 99

సీత యామాటలనువిని వితర్కించుట 100

హనుమంతుఁడు సీతకు నమస్కరించి మాట్లాడుట 102

సీత హనుమంతునితో సంభాషించుట 104

హనుమత్సీతా సంభాషణము 105

శ్రీరామ రూపవర్ణనము 110

హనుమంతుని మాటలకు సీత సంతోషించుట 117

హనుమంతుఁడు సీతకు రామునిముద్దుటుంగరము నానవాలుగానిచ్చుట 118

శ్రీరాముని ముద్దుటుంగరమునుచూచి యానందభరితయై సీత హనుమంతుని ప్రశంసించుట 119

శ్రీరాముఁడు తన్నెప్పుడు చెఱనుండి విడిపించునా యని సందేహ
ముతో సీత యడుగుట 120

హనుమంతుఁడు తానీవృత్తాంతము తెలిపిన తక్షణమే శ్రీరాముఁడు
రావణుని సంహరించి యామెను విడిపించునని ధైర్యము చెప్పుట 121

సీత యామాటలకు ధైర్యముఁ జెందుట 123

హనుమంతుఁడు సీతను రామునికడకుఁ గొనిపోవుదునని విన్నవించుట 126

సీత హనుమంతుని బలము సందేహించుట 127

హనుమంతుఁడు తన నిజస్వరూపమునుఁ జూపుట 128

సీత హనుమంతునకు సమాధానముఁ జెప్పుట 129

సీత హనుమంతునితో రామునకుఁ గొన్ని గుఱుతులు చెప్పుమనుట 132

కాకాసుర వృత్తాంతము ,,

సీత హనుమంతునితో శ్రీరామునికిఁ జెప్పఁదగిన సంవాదమునఁ జెప్పి
శిరోమణినిచ్చుట 135

సీత హనుమంతు నాశీర్వదించి పంపుట 140

హనుమంతుఁడు రావణుని శక్తిని పరీక్షించుటకు నశోకవనమును
పాడుచేయుట. 142

సీతవద్ద కాపున్న రాక్షసస్త్రీలు రావణునితో అశోకవన భగ్న
వృత్తాంతముఁ దెలుపుట 144

రావణుఁడు పదివేలమంది రాక్షసవీరులను హనుమంతునిపైఁబంపుట 146

హనుమంతుఁడు వారినందఱిని సంహరించుట 147

రావణుఁడు జంబుమాలిని హనుమంతునిపైకి బంపుట 148

జంబుమాలి యుద్ధము - హనుమంతుఁడు జంబుమాలినిఁ జంపుట 150

రావణుఁడు మంత్రితనయుల నేడుగురిని హనుమంతునిపైకిఁ బంపుట
అతఁడు వారినిఁ దునుముట 151

తనమంత్రు లైదుగురిని రావణుఁడు పంపుట 153

హనుమంతుఁడు వారితో యుద్ధముచేయుట - వారి నైదుగురిని
సంహరించుట 154

రావణుఁడు యక్షకుమారునిఁ బంపుట 155
హనుమంత యక్షకుమారుల యుద్ధము 156
యక్షకుమారుని మరణము 158
రావణుఁ డింద్రజిత్తును హనుమంతునిపైకి పంపుట 159
హనుమదింద్రజిత్తుల యుద్ధము 160
ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రప్రయోగమున హనుమంతునిఁ గట్టివైచుట 161
హనుమంతుని రావణుని సమక్షమునకుఁ దీసికొనిపోవుట 162
హనుమంతుఁడు రావణుని రాజసమును వైభవముఁ జూచుట 164
ప్రహస్తుఁడు హనుమంతుని బ్రశ్నించుట 167
హనుమంతుని ప్రత్యుత్తరము. తాను రామకార్యార్థమై దూతగావచ్చిన
సంగతి నెఱుక పఱచుట ,,
హనుమంతుని మాటలనువిని యాతనిఁ జంపుట కాజ్ఞయిచ్చిన రావ
ణుని విభీషణుఁడు నివారించుట 172
రావణుఁడు హనుమంతుని తోఁక కాల్చుట కాజ్ఞయొసంగుట 174
సీతకు హనుమంతుని వృత్తాంతముదెలిపి యాతనికగ్నియంటక చల్లఁగా
నుండునట్లామె వర మొసంగుట 175
హనుమంతుఁడు లంకనుఁ గాల్చుట 177
హనుమంతుఁడు సీత యగ్నిలో దగ్ధమైనదని చింతించుట 183
దేవతలవలన సీత సురక్షితముగానున్నదని యెఱిఁగి యామెవద్ద
సెలవుఁ గైకొనుట 186
హనుమంతుఁ డరిష్టకాద్రిని దాఁటుట 187
హనుమంతుఁడు సముద్రము దాఁటుట 188
సముద్రతీరమున హనుమంతునిరాక కెదురుచూచుచున్న వానరు
లాతనిరాకకు సంతోషించుట సీతవృత్తాంతము నెఱుకపఱచుట 189
సీతవార్తకై వానరులు సంతోషమును వెలిబుచ్చుట 190
జాంబవంతునికో హనుమంతుఁడు తనవృత్తాంతమెల్ల సవిస్తరముగా
వినిపించుట 191

వానరులు హనుమంతునితోఁగూడి సీత వృత్తాంతమును రామునకు నివేదింప నరుగుట 197
దారిలో మధువనమునందలి ఫలములను గ్రహించుట ,,
వనపాలకుఁడగు దధిముఖుఁడు వానరులనాజ్ఞ పెట్టుట 198
వానరులు తనమాటలను వినకపోవుటచేత దధిముఖుఁడు సుగ్రీవునితో వనము పాడుచేసిన వృత్తాంతముఁ దెలుపుట 199
సుగ్రీవుఁడు దధిముఖుండు చెప్పినదివిని యందలి యథార్థము గ్రహించి యావానరులను తనవద్దకుఁ దోడ్కొని రమ్మనుట 202
హనుమదాదులగు వానరులు సుగ్రీవునివద్దకు వచ్చుట 203
రాముఁడు సుగ్రీవునితో సీతవృత్తాంతము దెలియవేదని చింతించుచు నడుగుట 204
సుగ్రీవుఁడు రామునకుఁ గార్యసాఫల్యమగునని ధైర్యము చెప్పుట ,,
హనుమంతుఁడు సీతనుఁ జూచితి నని శ్రీరామునితోఁ జెప్పుట 205
సీతయిచ్చిన శిరోమణిని శ్రీరామున కొసంగుట 206
హనుమంతుఁడు చెప్పిన సీత వృత్తాంతమువిని శ్రీరాముఁడానందము నొందుట 210
కాండాంతగద్య 214

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 80 | బలికి | బలికె |
| 5 | 86 | మను | మును |
| 6 | 113 | చమర | చరమ |
| ,, | 116 | గీట్వఱ | గీడ్వఱ |
| 10 | 221 | నీవితని | సీ వితని |
| 13 | 277 | యోాడ | నోక్ష |
| 14 | 297 | గంథర్వ | గంధర్వ |
| 16 | 346 | నిఘ్న | నిమ్న |
| 21 | 479 | గాలు | గోలు |
| 27 | 611 | మెచ్చ | మెచ్చక |
| 39 | 914 | నడిన | వడిన |
| 45 | 1060 | ఒనమా | బవమాన |
| 55 | 1288 | గయుర | గయు రజః |
| 78 | 1840 | దింకి | దింక |
| 80 | 1906 | నేతురే | సేతురే |
| 81 | 1929 | ఇందరీవరేక్షణ | ఇందీవరేక్షణ |
| 92 | 2177 | ధామము | దామము |
| 115 | 2730 | అఁదల | అందల |
| 125 | 2956 | బిమ్మట | బిమ్మటి |
| 131 | 3106 | నిమ్న | నిమ్ను |
| 141 | 3328 | హారితో | హారితో |
| 147 | 3474 | వేటాడి | వేఁటాడి |
| 165 | 3888 | పావాడ | పావడి |
| 170 | 4004 | నలంబు | నాలంబు |

శ్రీ ర స్తు.

కట్టా వరదరాజకృతమగు

# శ్రీ రా మా య ణ ము

( ద్విపదకావ్యము )

—:o:—

## సుందరకాండము

శ్రీరాజితశుభాంగ ! - స్థిరగుణి సంగ
హరి కృపాపాంగ ! - యలమేలు మంగ
భావుక ! శతకోటి - భానుసంకాశ !
సేవకాత్మనివేశ ! - శ్రీవేంకటేశ !
అవధారు కుశలవు - లారామచంద్రుఁ
డవధరింపంగ రా - మాయణంబిట్లు
వినుపించు తత్కథా - వృత్తాంతమెల్లఁ
గనుపించు నవ్వాలి - కథ యెట్లులనిన.

—: హనుమంతుఁడు మహేంద్రపర్వతముపై విశ్రమించుట :—

తరువాత వాయునం - దనుఁడు మహేంద్ర
గిరిశిఖరం బెక్కి - కేళియపోలి
జలరాశి చూచి ద - శగ్రీవుఁ డెందు
నిలసుత డాఁచెనో - యాలంక ననుచు

నేరిచే దీఱని - యింతటికార్య
భారమంతయుఁ దృణ- ప్రాయంబుగాఁగఁ
దలఁపుచు వినువీథి - దాఁట నూహించి
నలుదిక్కులునుఁ జూచి - నగముపై నున్న
పచ్చిక తిన్నెల - పై విశ్రమించి
యచ్చోటి మృగపక్షు - లన్నియుఁ జెదరఁ
బంచవర్ణంబులఁ - బరగిన ధాతు
సంచయంబులను ని - ర్ఝర సమూహములఁ
గామ రూపంబులుఁ - గల యనుచరులఁ
గామినీమణులను - గలసి చరించు
సురకుమారకులఁ గు - సుమితవిశేష
తరువుల రత్నకం - దరముల దివ్య
ఫలములఁ జూచుచుఁ - బద్మాకరమునఁ
దులకించు గంధసిం - ధురము చందమున
నటునిటు నడయాడి - యాగట్టుచట్టు
దిటముచూచుక నిల్చి - దివిజులు మింటఁ
గెలన వానరులు నం - కింపుచుఁ జూడ
జలనిధి దాఁట ను - త్సాహమొందుచును
కమలజు నింద్రుని - ఖరకరు ననలు
హిమకరు ఖగరాజు - నెల్ల వేలుపులఁ
బంచభూతంబుల - భావించి మ్రొక్కి
పంచాస్యుఁ దనతండ్రిఁ - బవమానుఁ దలఁచి
పదములు కరములు - పర్వతాగ్రమునఁ
బదిలంబుగానుంచి - పర్వకాలముల
జలధి పొంగినరీతిఁ - జదలు తారకలు

మొలపూసలుగ సర్వ - మును నాక్రమించి
యతిమాత్ర దేహుఁడై - యట్టిట్టు నూప
నతనిచేఁ జదిసి య - య్యచలరాజంబు
దొనల నీరందిందుఁ - దొలుచుక వెడలి
మునుపు వారెడు ఝురం - బులఁ బ్రోదిసేయ
మానటీఁడై తాను - మదధారలొలుక
భాసిల్లు కరినీఁగా - భావించె గిరిని ;
బందికానికిఁ జిక్కి - పాదఘట్టనలఁ
గందువులను బూడ్చు - కలధనంబెల్లఁ
బూడికలెత్తి చూ - పుగృహస్థురీతిఁ
బీడితంబైన యా - పృథివీధరంబు
అతిగుప్త కార్తస్వ - రాది ధాతువులు
క్షితిమీఁద వెలువరిం - చెను బెట్టుజడిసి ;
చరులందుఁ దరులందు - జంతుజాలంబు
లిరకటంబులఁ జిక్కి - యెల్లెడ మొరసె ;
నగము మేనులు రాల - సంధులఁ జిక్కి
మొగము లార్చుచు విషం - బులు గ్రక్కుకొనుచు
గండూఫలంబులఁ - గఱచుచు వ్రాలి
యుండె నందందు మ - హోరగశ్రేణి ;
ఉర్వీధరంబుపై - నున్న యోషధులు
దర్వీకర విషంబు - తమరు హరింపఁ
జాలక కలపెంపు - సడలిపోవుటను
వ్రీలెఁ బన్నగదష్ట - వివిధోపలములు ;
అమరుల సుమవృష్టి - యనఁగ భూమీరు
హములుర్విపైఁబడి - యలరులు రాల్చె ;

ఇది యేమి యుత్పాత - మిపుడని యచట
మొదలక దేవతా - మిథునముల్ చనియె ;
ఆవనాంతమున వి - ద్యాధరావళులు
పానభూములు డించి - పాయసంబులును
నాసవమాంస శ - రాస ఖడ్గములు
వేసినచోఁ బడ - వేసి బిట్టులికి
వ్యోమయానములపై - నుడు వీథికెగసి
యామట పొడవున - నట నిల్చిచూచి
'యదిరయ్య !' యీకొండ - నడఁగఁగఁ బొక్కె
నిదియొక్క పెనుభూత - మిపుడంచుఁ బాఱ
నొడలు జాడించి మ - హోరగేంద్రంబుఁ
గడకతోఁ గబళించి - గరుడుఁడు మింట
నాడించుగతి వాల - మార్చి కర్ణములు
జోడుగా రిక్కించి - చూపులు మింట
సాగించి గళము చాఁ - చక కుదియించి
యోగికై వడిఁ జాల - నూర్పులు నిలిపి
యెగుర నుంకించి తా - నెల్ల వానరుల
మొగములు జూచి స - ముద్ధతిఁ బలికె.

—: మహేంద్ర పర్వతమునుండి సముద్రమును
హనుమంతుఁడు లంఘించుట :—

" ఇదె చూడుఁడెగసెద ! - నీలంకలోన
వెదకి జానకిఁ జూచి - వేగంబె యిటకు
మఱలెద రాముని - మగువ లేదేని
సురలోకమున కేఁగి - చూచెద నచట

నందును లేదేని - యా దశాననుని
ముందల పట్టుక - మను కాలఁదన్ని
యీడుచుకొనితెచ్చి - యిపుడె నిల్పుదును !
పాడుసేయుదు వాని - పట్టణంబెల్ల"
ననుచు ఱివ్వున నుర - గారాతి కరణి
వినువీథి కెగసి యా - వీరాగ్రయాయి
పోవుచో వెంటనే - భూరుహశ్రేణి
యీవలావలఁ బోక - మెగిసి మింటికిని
పోరాని చుట్టంబు - పోవుచోఁ గొంత
దూరంబు వచ్చు బం - ధువులను బోలి
విహగస్వనములతో - వెనువెంట వచ్చి
రహి మాని నీరాక - రంబులోఁ బడియె !
నడుగు వెట్టిన పట్ల - నవనీధరంబు
పిడుగు కొట్టినయట్ల - పెళపెళ విఱియఁ
గేలుమోపిన పట్ల - గిరిశిఖరంబు
కీలువాపినయట్లు - క్షితిమీఁద ద్రొల్లఁ
బోవుచో దివి మెఱు - పులతోడి మబ్బు
కై వడి నాత్మీయ - గాత్రసంజనిత
పవనాప హృతతరు - ప్రసవముల్ మేన
రవణంబుగా నవి - రాలిచి దాన
నల వారినిధికి పు - ష్పాంజలి చేసి
యలరించి పొడవుగా - హస్తంబులెత్తి
పంచాననాహులు - పజ్జలవచ్చు
సంచునన్ గరభుజా - స్తంభముల్నెఱియఁ

గాఱుచిచ్చుల రెంటఁ - గరమొప్పు నగము
తీఱున లోచన - దీప్తులుప్పొంగ
జతగాఁగ నుదయించు - చంద్రార్కులనఁగ
నతిశోణరుచివర్త - లాక్షులు దనర
చమరసంధ్యారాగ - సంవృతుండైన
తరణియోయనఁగ వ - క్త్రము శోభిలంగ
నొక్కచాయఁ జక్కనై - యొప్పువాలంబు
చకచక లింద్రధ్వ - జంబు గీల్వాఱఁ
దనుచుట్టుఁ గనుపట్టు - తఱిఁ బరివేష
మినమండలము చుట్టు - నెన్నికఁదోఁప
వరధాతు రుచులఁ బ - ర్వతనితంబంబు
సరణిఁ గటీప్రదే - శంబు రాణింప
దూరి బల్పంక సం - దులఁ బోవుగాడ్పు
ఘోరున నురుముల - వోలిక మొరయఁ
జదలు పైఁజను బుఱు - సాజూలుతోడి
మదదంతియనఁగ రో - మములుమై నిండ
నోడవోయిన యట్లు - నుదధిలోఁ దనదు
నీడ దక్షిణముగా - నీటిపైఁ దేలఁ
గేలార్వ జలధిలోఁ - గెల్లుబ్బు నూర్మి
మాలికల్ తనరాక - మగుడఁ బొరల్ప
సుడివడి జలధి యి - చ్చోఁ జాలభ్రమసి
బెడిదంపు ప్రోఁతతో - బిట్టు ఘూర్ణిల్ల
గగనమంతయుఁ దాన - కబళించి మ్రింగు
తగవుగాఁ దెఱచిన - తనముఖం బమర

వలుద రొమ్మునఁ గొట్టు - వడు తరంగంబు
లలమి మింటికి శార - దాభ్రముల్ గాఁగ
జలరాశిలోఁ దోఁచు - జంతుజాలంబు
వలువమాటు దొలంగు - వైఖరినుండ
వడిసేఁగుచో నీరు - వాయలై వార్ధి
నడుమ సందిచ్చి ని - మ్నస్థలిఁ దోఁపఁ
బరవశంబున నీడ - పదియోజనముల
పరపును పొడవు ము - ప్పదియును గాఁగ
తెక్కలతోడి య - ద్రియుఁ బోల మింటి
చక్కి దివ్యులకు నా - శ్రయబుద్ధి నొడమ
కరడులలో సమ - గతి నూర్ధ్వగతిని
శరదంబులను బోవ - జలదాగమమునఁ
గనిపించి యొకచోట - గనిపించకున్న
వనజవిరోధిభా - వము గోచరింప
నలరువానలు దేవ - తావళి ముంప
వలిమీర దక్షిణ - వాయువుల్ విసర
వెన్నెలగతి నర - వింద బాంధవుఁడు
తిన్నసి యెండలా - తెరపునఁ గాయ
నరుగుచో, 'సగరాన్వ - యమున జనించు
ధరణిజా రమణు దూ - త సమీరసుతుఁడు
హితము సేయుదుగాక - యేను సాగరుఁడ
నితనికి నని' తన - యిచ్చలోఁ దలఁచి
మైనాకుఁ బిలిచి "యో - క్ష్మాధరాధీశ!

—: మైనాకుఁడు సముద్రుని యానతిని హనుమంతునకు నాతిథ్య మొసగుట :—

ఈనగచర వీరుఁ - డిపుడు పూజ్యుండు.
పాతాళమున నున్న - భయద రాక్షసుల
భీతిచే వారలు - పెరిగి రాకుండ
నా రసాతల బి - లాయతనంబునందు
నేరుపాటుగ నిన్ను - నిడియె నింద్రుండు.
అది మాని వచ్చిన - యట్టినేరంబు
మదినెన్నక సహించు - మఘవుఁడు నిన్ను.
కామరూపకుఁడవు - గావుననెగసి
యామర్కటాధీశు - నర్థించి తెచ్చి
తీయని ఫలములఁ - దృప్తునిఁ జేసి
నీయందుగల స్వాదు - నీరంబు లిచ్చి
యుపచరింపు మటన్న - నుదధివాక్యంబు
లపుడాలకించి మ - హాశైలరాజు
సరసులతో నికుం - జవనాళితోడ
సురసిద్ధచారణ - స్తోమంబుతోడఁ
గాంచనదివ్య శృం - గములతో గోచ
రించిన యాకేస - రి కుమారకుండు
"నిదియేమి విపరీత - మీవార్ధి నడుమ
నుదయించె నీకొండ - యుప్పరంబెగయ !
ఏమిగాఁగలదియో ? - యిఁక రామకార్య
మేమైన నగుగాక - యెంతలేద"నుచు
మోరతోపున వచ్చి - మొగ్గరంబైన
బోరతోఁపున శృంగ - మును గూలఁదాకి

తిరుగుడువడఁ జేయఁ - దెరలకా గట్టు
దొర చెంతనొకవేల్పు - దొరఁబోలి నిలిచి
"ఓయి! వానరవీర! - యుదధినాయకుఁడు
నీయత్నమెఱిఁగి మ - న్నించి నాచేత
బహుమాన మొనరింపఁ - బనిచె నిచ్చోట
విహరింపు మాఁకటి - వేళకు వలయు
ఫలములు సేవింపు - బడలిక దీఱ
వలయు తావునకుఁ బో - వఁగ సమ్మతింపు"
మన విని "జలధి రా - జాడినమాట
తనమౌళి నున్నదిం - తటివాఁడవీవు
ఆతిథ్యమొనరింప - నది ద్రోఁచిపోవ
నీతియే శ్రీరాము - నికి బంటనగుట ?
అతని కార్యమునకై - యరిగెద నిపుడు
హితముగా దాహార - మేమియు నాకు
మఱలుచో నిను బహు - మానించి యవల
నరిగెదఁ గాదని - యనరాదు నీకు
ననుమతింపు" మటంచు - నాయద్రి మీఁదఁ
దన కేలు చేర్చి సాం - త్వనములు వలుక
నొడఁబడి కాదన - నోడి శైలంబుఁ
గడలియుఁ బ్లవగపుం - గవుని దీవించి
"పోయిరమ్మిపుడు - నీ పూనిన కార్య
మోయన్న! చేకూడి - యొకనాఁడు నీవు
తలపువ్వు వాడక - తపన వంశంబు
నిలువరింపు" మటన్న - నింగిపై నెగయు
పవనజుఁ గాంచి సు - పర్వులు మింట

పువ్వులువానల జల్లు - భోరున గురియ
శతమఘుఁడటఁ జేరి - శైలేంద్రుఁ జూచి
"హితము చేసితివి నా - కెల్ల వేల్పులకుఁ
గావున నిన్ను నే - గాచితి మఱలి
పోఁపల దీవాయు - పుత్రుఁడు మాకు
మాననీయుఁడు గాన - మాకు నీరాక
యానందకరమయ్యె - నభయ మిచ్చితిని
నిలువు మిచ్చట" నని - నిర్జరులెల్లఁ
గొలువ నింద్రుఁడు వోవఁ - గొండ యచ్చోట
నమరుల కాధార - మై మిన్ను మోచి
కమలా కరంబులోఁ - గదలకయుండె.

—: దేవతలు హనుమంతునిశక్తిఁ బరీక్షించుటకు సురసను నడ్డగింపఁ బంపుట :—

పవమానతనయుఁ డం - బరమున కెగసి
జవమున నేఁగ ని - ర్జరులాత్మఁ దలఁచి
'యనితరసాధ్యమై - నట్టి యీకార్య
మునకు నేఁగెడు గాడ్పు - ముద్దుల కొడుకు
శక్తి చూతముగాక - చనుచోట నేఁడు'
యుక్తిచే నపుడు మ - హోరగమాత
సురసను బిలిచి "యో! - సురస నీవితని
విరసించి తచ్ఛక్తి - వీక్షింపు" మనిన
నాకొమ్మ దానవి - యై యడ్డగించి
"నీకింకఁ బోవచ్చు - నే వార్ధి దాఁటి?
కనుపట్టువారి గ్రొం - గఁగ నాకు నిచ్చె

వనజసంభవుఁ డొక్క - వరమట్లు గానఁ
గడవఁ జెల్లునె బ్రహ్మ - కట్టడ నిన్ను
విడువ నాయందుఁ బ్ర - వేశింపు మనుచు
వదనంబు దెఱచిన - వాయుసుతుండు
బెదరక దానిఁ గో - పించి యిట్లనియె.
"శ్రీరాము నానతి - సేయంగఁ బూని
యో రామ! నేనేఁగు - చున్నాఁడ నిపుడు
మఱలి వచ్చిన నీదు - మాటచే పట్టి
తెఱచిన నీదు వా - తికి నగ్గమౌదు
నిపుడు తీరద" టన్న - "యేనేల విందు ?
కపివీర! నిన్ను మ్రిం - గక మాన" ననుచు
వదనంబుఁ దెఱచిన - వాయుసుతుండు
పది యోజనంబుల - పాటిగాఁ బెరిగె
వలుద నోరదియు ని - ర్వది యోజనముల
కొలదిఁ బెంచిన గాలి - కొడుకు గాత్రంబు
ముప్పది యోజనం - బులుగాఁగఁ బెంప
నప్పుడు నలువది - యామడ వెళుపు
నాగమాతయు వద - నముఁ బెంప నతఁడు
నాఁగతి నేఁబది - యామడ బెరిగె!
అఱువది యామడ - యాసురి నోరు
వఱప వాయుజుఁడు డె - బ్బది యోజనములు
బలిసి నిల్చిన యెనుఁ - బది యోజనములు
వెళపుగాఁ దననోరు - వెంచెను సురస!

అంతటఁ దొంబది - యామడ వాయు
సంతతి మైపెంప - శత యోజనములు
తననోరు నాగమా - తయుఁ బెంపఁ జూచి

—: హనుమంతుఁడు సురసను జయించుట :—

యనిల సంభవుఁడు సూ - క్ష్మాకృతిఁ దాల్చి
గ్రక్కున దాని మో - గంబులోఁ దుమికి
యక్కడ నిల్వక - యావల వెడలి
"శరణు జొచ్చితిని దా - క్షాయణి నీకు
కరుణించిమాట ని - క్కముగాఁగ నిలువు
వదనంబుఁ జొరక పో - వలదంటి గాన
నదియుఁ జేసితి నన్ను - నడ్డగింపకుము !
అమ్మ ! నాకీవు సా - హాయ్య కారిణివి
గమ్మ శ్రీరాముని - కార్య మీడేర్పు
మన" విని యాయింతి - హనుమంతుఁ జూచి
మనసులో మెచ్చి స - మ్మతముతోఁ బలికె
"పోవన్న పవనజ ! - బుద్ధిమంతుఁడవు
లావును ధైర్యబ - లంబు నీసొమ్ము
సీతను గనుఁగొని - శ్రీరాముపాలి
కేతెమ్ము మరల నీ - కెసఁగు మంగళము
సురలెల్ల నీశక్తి - చూడఁగ నన్ను
పురికొల్ప వచ్చితి - భుజగమాతృకను
జయమందు" మనఁబోవఁ - జయ్యన నెగసి
రయమునందు ఖగేశ్వ - రసమానుఁడగుచు

—: సింహిక హనుమంతునడ్డగించుట - అతఁడామెను చంపి సముద్రములోఁ బడవేయుట :—

నరుగుచో సింహిక - యనునది నీడఁ
దరల నీయక పట్టి - తనునరికట్టి
నిలుప ఛాయాగ్రాహి - నిగ్రహశక్తిఁ
దొలఁగ నేరక తన - తో రవిసుతుఁడు
చెప్పినమాటలు - చిత్తంబులోన
నప్పుడు సరివచ్చె - నని జీనివేయు
యోడకై వడి నిల్చి - యొడలుజాడించి
చూడఁ జూడంగఁ బెం - చుటయు నద్దనుజి
తన నోరు వెంచినఁ - దానూత్మరూప
మున వచ్చి దానవి - మొగములోఁ జొచ్చి
కడుపులోనికిఁ దన - కరములు చాఁచి
పిడికిళ్ళచే దాని - ప్రేవులు పట్టి
పెకలించి వధియించి - పెన్నీటవైచి
సకియును జంపఁ దో - షము వచ్చుననక
యాకాశమున నేఁగు - ననిల నందనుఁడు
లోకులకెల్ల నా - లోకింపఁ దగియె !
వాలంబు వాలంబు - వటువుగా నాంత్ర
జాలంబుఁ దనకరాం - చలమునఁ బట్టి
చనుచోట నవి సూత్ర - సంగతి మెఱయ
వనధికుమారుఁడు - వడిఁ బట్టి యాడు
హనుమంతు ప్రతిమకో - యనఁ బోయి పోయి
వినువీథి నట్టింటి - వేడెంబు వెట్టి
నాలుగు గెలుపులు - నాకులు మెచ్చ

గాలిబిడ్డఁడు తన - కరములనున్న
ప్రేగులు జలధి క - ర్పించి తా మెఱపు
తీగకై వడి మింటి - దెసవచ్చు నపుడు
నొకచోట గంధర్వు - లొకయెడ సిద్ధు
లొకట విద్యాధరు - లొకమేర సురలు
నొకక్రేవ మానులు - నొకతరి యక్షు
లొకచక్కిఁ బన్నగు - లొకవంక మునులు
సేవింప రంభోర్వ - శీమేనకాది
దేవతాభామినుల్ - తెరువులు గట్ట
సకల దిక్పాలకుల్ - సముఖంబునందు
నొకరొకళ్ళను జేరి - యోలగింపంగఁ
దనుఁజూచి విరివాన - దట్టంబుగాఁగ
వినువీథిఁ గురియించు - విబుధ నాయకుని
గనుఁగొని యవ్వల - గడచి దక్షిణపు
వనరాశిగట్టు పా - వని విలోకించి
యుత్తరగాములై - యుదధినాయకుని
పొత్తుఁగూడిన యట్టి - పుణ్యవాహినులఁ
గనుఁగొని జంబీర - ఖర్జూరచూత
పనస బిల్వతమాల - పాటల వకుళ
నారికేళాదికా - ననముల గుట్టు
మీరు త్రికూటాద్రి - మీఁద నున్నట్టి

—: సముద్రముదాఁటి హనుమంతుఁడు త్రికూటాద్రి మీఁదనున్న లంకనుఁ జూచుట :—

లంకవీక్షించి మె - ల్లన చెంతప్రావాల
శంకించి యిట్టి వే - షము చూచిరేని

జగడింతు రిచటి రా – క్షసులని కొంచ
మగునట్టి మేనితో – నలయిక లేక
కదలిఁ బువ్వులతోఁటఁ – గాలువ దాఁటు
వడువుగా మైశ్రమ – వారి గన్పడఁగ
నిట్టూర్పు లూర్చక – నెళవుల నున్న
యట్టి మృగంబుల – ట్టట్టైకలంగ
మెల్ల మెల్లనవచ్చి – మిహిరమండలము
చల్లఁబాఱిన వేళ – శైలశృంగమున
ప్రోలు కాదిది దివం – బుననుండి యప్పుడు
వ్రాలినిల్చిన యమ – రావతి యనఁగ
రథగజ హయభట – వ్రాతనిశ్శంక
పృథుగోపురాగ్రకుం – భితహరిణాంక
పౌలస్త్యదోర్దండ – బలబిరుదాంక
సాలగుప్తి నిరస్త – శాత్రవాతంక
పరబలోపల శారి – భటశౌర్యటంక
శరధి వేలావనాం – చత్కలావింక
కలధౌత సౌధస – ఘటిత విటంక
లలితశృంగారాక – లంక యాలంక
పసిఁడి కోటలు మేల్మి – బారి దల్పులును
రసవర్గములు రస్తు – రాజవీథులును
రంగమంటపముల్ బి – రంగులు జబురు
జంగులు నట్టిళ్లు – సావళ్లుగుళ్లు
రాక్షసప్రభువు లా – రక్షులు నగర
రక్షకుల్ గణికాప – రంపరల్ గలిగి

యగడితయై చుట్టు - నంబుధియుండఁ
బొగడొందు గిరిదుర్గ - ముల రాజనంగఁ
బ్రాకారజఘనయై - పర్వతశిఖర
కోకస్తనాగ్రయై - గుఱుతరాట్టాల
మస్తకయై యంత్ర - మాలికాచికుర
శస్తయై నిమ్నకా - సారగభీర
నాభియై భువనాభి - నందమాణిక్య
శోభయై మానిని - చూపట్టు కరణి

—: లంక యుత్తరద్వార మాతఁడు చేరుట :—

నొప్పు లంకాపురి - యుత్తరద్వార
మప్పుడ మేధావి - యంజక చేరి
మును విశ్వకర్మ యా - మొదట నిర్మింప
ధనదునిచేఁ బాలి - తంబయి వెనక
రావణుఁడేలు కా - రణమున దనుజు
లీవిధిఁ జూచిన - " హేతిత్రికూట
సాధనకఱులై యె - సంగు నీపురము
సాధింపఁ గలఁడెని - ర్జర నాథుఁడైన ?
కపులేమి సేతురు ? - కాకుత్స్థ వంశ
నృపులేమి సేతురే - నేమి సేయుదును ?
చేనగునే కపి - శ్రేణి కిచ్చటికి
రానగునే సము - ద్రమువిూఁద నెగసి
తాను వాలిసుతుండు - తరణి నందనుఁడు
నానీలుఁడును దక్క - నన్యు లిచ్చటికి
రాలేరు వచ్చిన - రావణుఁ డెనకి

పోలేరు మఱల నో - పుదు నేనొకండ
సీతను వెదకి చూ - చిన తరువాత
చూత మామిఁడటి - చోఁద నేఁడేల ?
కారాదు వానరా - కారంబు పగలు
వోరాదు చీకటి - ప్రొద్దునగాని
కడలకుఁ గనుపించి - కనుపించనట్టి
యొడలు దాలిచి పిల్లి - యోయనుకొనఁగఁ
జొరవలె నీవీడు - చొరరానియట్టి
తరివలె నుచితమా - దారిఁగైకొనఁగ
బుద్ధిలేనట్టి పం - పులవారి వలన
సిద్ధింప నేరవు - చేకూరు పనులు
కావున రాక్షసా - కారంబుతోడ
నీవీడు చొత్తునో - యెఱిఁగిన యపుడె
హాని వచ్చును తన - కందుచేఁ గార్య
హానియౌ మఱి తీర - దన్యులచేత
నెప్పుడు గ్రుంకునో - యినుఁడంచు " నెంచ
నప్పుడ యస్తాద్రి - నర్కుఁడు చేరె
కొనచీకటిని చొచ్చి - కొండెపుమేన
హనుమంతుఁ డొక్క హ - ట్టాగ్రంబుఁ బ్రాకి
యాకొత్తడంబుపై - నాసీనుఁడై వి
లోకింపఁ దెరలుజ - ల్లులు నుప్పరిగెలు
మేరువుల్ కురుఁజులు - మేలుకట్టులును
తోరణంబులును వీ - థులుఁ జప్పరములు
దొంతరమేడలు - తూర్య ఘోషములు
దంతులు రథము లు - త్తమతురంగములు

నగరులు దనుజ సై - న్యము నెడలేని
నగరంబులో దశా - ననుబెంపుఁ జూచి
యుబ్బుర మందుచో - నజ్జారి పొడవు
గుబ్బలిపై దోఁచె - గోరగింపుచును
కోరిక లబ్బ చ - కోరంబులకును
జారులకెల్ల వి - చారముల్ ముదిరె
కవలెడవాసి జ - క్కవలు చింతిల్లె
రవణంబు దొరఁగె నా - రసవనంబులకు
కలకల నవ్వెను - కైరవపాళి
జలజల జాలెత్తె - చంద్రకాంతములు
విరిసెఁ జీకటి దిశా - వీథులయందుఁ
గురిసెను బన్నీరు - గొజ్జంగిపొదల
నిండెను బండు వె - న్నెల లుర్విమీఁద
పండె ముచ్చటలు దం - పతులకెల్లెడల
ఘుమఘుమమని పొంగి - ఘోషించె జలధి
కమనులకెల్ల రా - గంబులు హెచ్చె.
ఆవేళ బహుదీపి - కాయతనంబు
రావణు నగరంబు - రాముని దూత
చొచ్చెదనని పోవు - చోట లంకాఖ్య

—: లంకనుగాచు లంకిణి హనుమంతు నడ్డగింప నతఁడామెను జయించి లంకలోఁ బ్రవేశించుట :—

నచ్చోట గాచు పు - రాధిదైవతము
అట్టహాసము చేసి - యరికట్టి గాలి
పట్టిఁ బోనీక " నా - పట్టణంబెట్లు

చోరవచ్చు? నిలుమ"న్నఁ - "జొచ్చిననేమి?
తెరువిమ్ము తల"మన్నఁ - "దెరువేలయిత్తు?
నెవ్వఁడ? నీ"వన్న - "యేరాముబంట
నెవ్వతె? వీ"వన్న - "యే నీపురంబుఁ
గాచు దేవతను లం - కా నామధేయ
నీచాయ రా గతం - బేమి? నీ క"నిన
"వేడుకపుట్టి యీ - వీటి చందంబుఁ
జూడవచ్చితి"నన్నఁ - "జూడుము మొదట
నాతోడి రణమ"న్న - "నాతి! నేమఱల
నేతెంతుఁ బని కల - దిపుడు పోవలయుఁ
దీఱదిప్పటికన్న" - "తీఱనే నన్ను
మీఱి పోవఁగ?" నని - మిణుగురుల్ చెదర
నతివజ్రసారమౌ - నంజనాదేవి
సుతుని పేరెదను గా - జులు వగులంగ
రక్కసి గ్రుద్దిన - రాముని బంటుఁ
గ్రక్కునఁ దనవామ - కరముపై నెత్తి
రొడ్డవెట్టుగ వ్రేయ - రొమ్ముపైఁదాకి
పడ్డపాటెఱుఁగక - పైచీర మఱచి
తలవీడ నోట ర - క్తము గ్రక్కికొనుచు
ములుఁగుచు గడసేపు - మూర్ఛిల్లి తెలిసి
మిడిగ్రుడ్లు తెఱచి యే - మియుఁ జేయలేక
తడవున కదిలేచి - తలఁచుక పలికె.
"హామ్మ! నీయిచ్చఁగాఁ - బురములోపలికిఁ
గ్రమ్మఱు మెంచిన - కార్యంబుఁ దీర్చి
యజుఁడు నాకిచ్చిన - యట్టివరంబు

నిజమయ్యె 'నీలంక - నీవు రక్షింప
వానరుఁ డొక్కండు - వచ్చి నీపురము
పూని తాఁబిడికిట - పోటుచేఁ బొడిచి
గెలుచు నెన్నఁడు నాఁటి - కీలంక చెడును
తలఁచుకొమ్మని' పల్కె - తనుగెల్చితీవు
జయముఁ గైకొనిరమ్ము - చనుమన్న దానిఁ
జెయిగాచి మన్ననఁ - జేసి యాలంక
దీవెనలంది యా - దిత్యులు బొగడ
పావని లంకలో - పలఁ బ్రవేశించె.

—: హనుమంతుఁడు లంకలోని విశేషములను జూచుచు సీతను వెదకుట :—

ఆలంబుగాఁగఁ దా - నాలంబుగెలిచి
సాలంబు వాకిట - చాయగాఁ జనక
చాయగా లంఘించి - సామీరి మీఁటి
దాయమస్తకముపైఁ - దానిల్చి నటులఁ
దన వామచరణప - ద్మము మున్నుగాఁగ
దనుజనాయకురాజ - ధానిలోఁజొచ్చి
చుట్టు కొల్లారముల్ - సోరనగండ్లు
తొట్టి కట్టులు సర్వ - తోభద్రకములు
స్వస్తికాగారముల్ - చతురంగకములు
హస్తి శాలలు మంద - రావాసములును
కలధౌతసౌధరే - ఖలు సుధాధౌత
కలధౌతమణిమయా - గారముల్ గనుచు
నందందు మంద్రమ - ధ్యమతారకములఁ

చందనగంధులు - షడ్జనిషాద
ధైవతరిషభగాం - ధారపంచమప
రీవాహ సుస్వర - రీతులచేత
గౌళకన్నడనాట - కాంభోదిపాటి
మాళవిభైరవి - మలహారి బౌళి
సావేరి యాహిరి - శంకరాభరణ
మావేళలకుఁ దగి - నట్టి రాగములు
రంగరక్తులుగ జం - త్రములు గాత్రములు
సంగతంబులుగాఁగ - సంగీతమపుడు
వినిపించు చోటులు - వెదకుచు నవలఁ
జనునెడ దశకంఠ - జయబిరుదాంక
వినుతగాథాశతా - న్వితపద్యగుల
నని గెల్చు విజయంబు - లన్నియుఁ గూర్చి
ప్రత్యుత్తబాహాట - పాంచాలనటన
లత్యంతమును మీఱు - నట్టి శయ్యలను
చదువు రాక్షసభట - జాలంబు రవళి
యదిరా! యనుచు వీను - లానించి మెచ్చి
దత్తిళభరత మ - తంగాదులైన
నృత్తశాస్త్రంబుల - నిపుణత మెఱయు
నాటలపాటల - నందంబులైన
నాటకశాలల - నట్టువలైన
దనుజుల కొనుకోలు - తత్తకారములు
మనసొగ్గి విని పవ - మానబాలకుఁడు
మేడలమీఁదికి - మెట్టికల్ మెట్టి
జోడుగూడుక యెక్కు - చో వధూమణుల

మొలనూలి గంటల - మ్రోఁత యందియల
ఝుళఝుళధ్వనులు మ - జ్జావుట్టఁ జేయఁ
గడచి పోవఁగ సామ - గానంబులొక్క
కడ ఋగ్యజుషపాఠ - కవ్రాతమొకట
పాడి పదక్రమ - ఫణితి నధ్యయన
మీదు వారలతోడ - మెలుఁగులురాయ
చదివెడి బ్రహ్మరా - క్షసుల ఘోషంబు
మదిమెచ్చి యవ్వలి - మాళిఁ గేలందు
పువ్వుల పూఁతల - భోగభాగ్యముల
జవ్వనులను గూడి - జలజాంబకునకు
బొమ్మలఁ గట్టిన - పొలదిండి వంగ
డమ్ము రాచకుమాళ్ళ - డాయకఁ దొలఁగి
సాదనలను మల్ల - చఱపుచుఁ బలల
ఖాదులై తగుహరాంత - కారులనెల్ల
సామిచ్చి బేతాళు - సయిదోడులైన
భీమరాక్షసమల్ల - బృందంబు వోరలు
గఱుడు లాలోకించి - ఖండాలు వూని
మెఱుఁగు కోఱలతోడ - మిడి గ్రుడ్లతోడఁ
గాటుకకొండల - గతినొప్పు సుభట
కోటి వీరాలాప - కోలాహలంబు
లట్టహాసములు గో - రంతయు మదినిఁ
బెట్టక యంజనా - ప్రియనందనుండు
దీక్షితాసురుల మాం - త్రికులను వైద్య
రాక్షసావళిని ద - ర్భపవిత్రకరుల
ముండితశిరుల దు - ర్ముఖుల గోచర్మ

ఖండో_త్తరీయులఁ - గాపాలికులను
హోమపువాటికలను - హోతల నూర్ధ్వ
రోముల నేకనే - త్రుల వక్రముఖుల
భయదలంబ_స్తన - భామల రుధిర
నయనుల తిర్యగా - ననుల శిరోధి
లోచనాలోకుల - లూనమ_స్తకుల
గోచి వెట్టక తిరు - గు దిగంబరులను
పొడువాటి దనుజుల - పొట్టిదానవుల
బడుగుల ముక్కుల - పై నోటివారి
కరములు క్రిందును - గాళ్లు మీఁదగుచుఁ
బరువులె_త్తెడి వారిఁ - బాషండమతులఁ
బులితోళ్లు బూడిదె - పూఁతలు జడల
తలముళ్లు రుద్రాక్ష - దామముల్ మెడల
దేవళ్లు చెవులఁ బ - _త్తిరి త్రిపుండ్రములు
చేవాఁడి శూలముల్ - శివజపంబులును
గలవారి లోహిత - గాత్రుల రెండు
తలలవారిని మూఁడు - తలల రాక్షసుల
వికృతాంగుల వికార - వేషధారులను
వికలగాత్రులను భా - వించి యవ్వలికిఁ
బోవుచోఁ బరిమళం - బులు మేనఁబూసి
గోవజవ్వాది చె - క్కులవెంట జార
తమయురసి గల మం - దారదామముల
ఘుమఘుమ ల్దిశలనా - గుబ్బుకొనంగ
నడపముల్గట్టు తొ - య్యాలులచే యాకు
మడపులకై కేలు - మలచు భోగులును

ననువు మిటారుల - నాలిచేష్టలకు
మనసొగ్గి మంచుదు - మారంబు నెనయు
వలిపె దుప్పటి వలె - వాటులతోడఁ
జలువ వెన్నెల బైటి - చప్పరంబులను
మెలఁగెడు విటుల యె - మ్మెలువిలోకించి,
వెలలందుఁ బువ్వులా - వికల యంగళ్లు
కనుఁగొని శూలము - ద్గర భిండివాల
ధనురస్త్రకుంతగ - దాశక్తిముసల
పట్టెస తోమర - ప్రాసముల్దాల్చి
ఘోట్టాణహాయదంతి - కోటులతోడ
జత్త్రాయతముగ ల - తులకొలఁదికిని
మ త్తిల్లు దనుజ కు - మారవర్గంబు
బలకరంబుగ నుండ - బంగరుకోట
తళుకుచుక్కలు వోవు - దారిఁ దప్పించి
యగణితంబైన ద - శానను నగరి
మొగశాలఁ జొచ్చి రా - మునిబంటు చనుచు
రెండవకక్ష్య రా - త్రించరనాథ
మండలియును, దద - మాత్యవర్గంబు
మణిరథంబులను, వి - మానముల్ కొలువు
గణికాజనంబు బం - గరు రథంబులును
చౌదంతులును సింధు - జములైన హరులు
సాదులు జోదులు - సైన్యనాయకులు
మానితచ్ఛత్రచా - మర కేతనములఁ
బూనెడువారును - బూమెలవారు
నందలంబులు చతు - రంతయానములు

సందడిగానుండఁ - జని కనుఁగొనుచు
నవలి యంతరమున - హరిణాది విపిన
వివిధమృగంబులు - వీణామృదంగ
కాహళవేణుధ - క్కానినాదోద్ధత స
మూహంబు దశకంఠ - మూలబలంబు
శారికాకీరపం - జరములు కేకి
పారావత మరాళ - పక్షిజాతంబు
వేరువేరుగఁ జూచి - వేడుకనవలి
ద్వారంబుఁ దూరి మీఁ - దటి యుత్తరమున
నవరత్నరాసులు - నాకేశముఖ్య
వివిధోపధావస్తు - విమలాంబరములు
సాంకవమృగమద - చందనచంద్ర
రాంకవకల్పక - ప్రసవమాలికలు
కాశికాగరుధూప - కనకకరండ
కాశికార్పిత హేమ - కలశమధ్యములు
చంద్రహాసాదిమ - శస్త్రప్రకాశ
చంద్రికాయతనముల్ - చాలమెచ్చుచును
గనుఁగొంచు వచ్చి యా - కడ నంతిపురము
వనితలు మెలఁగు తా - వలననియెంచి
పజ్జ నున్నట్టి యు - ప్పరిగెకుఁ బ్రాకి
సజ్జికమ్మగు నొక్క - చవికలో నిలిచి
నెలఁజూచి పందువె - న్నెలఁజూచి కెలన
జలజల ప్రవహించు - చంద్రకాంతముల
లోవలు జూచి యా - లోచనఁ జేసి
“దేవి యాసీత యే - దెసను నున్నదియొ?”

అనుచు నాలోకింప - నాకాశవీథి
వనజారి యుడుపశు - వ్రాతంబులోనఁ
బాయఁ జాలని వృష - భమురీతి తనదు
రేయెండచే నల - రించె విశ్వంబు!
కవ్వపు కొండకుఁ - గలిగిన శోభ
యవ్వారినిధిని పా - యక యున్నలక్ష్మి
జలములఁ గలుగు పు - ష్కర విలాసంబు
నలరినగతి మించె న - జ్జారి చెలువు!
వెండిపంజరములో - వెలయు రాయంచ
కొండబిలంబు నె - క్కొన్న సింహంబు
మదసింధురంబుపై - మావంతుఁడనఁగఁ
బొదలె నజ్జారి న - భోమండలమున!
రెండుశృంగములొప్పు - వృషభంబు రీతి
వెండికొమ్ములతోడి - వెలి దంతికరణి
కవశిఖరములతోఁ - గైలాసమనఁగఁ
బ్రవిమలశృంగ సం - పదఁగాంచె విధుఁడు!
భానుకరంబులో - పలఁ బ్రవేశించి
దానవపంకము బోవఁ - దమముహరించి
తన ప్రకాశంబుచే - తను నిగళంబుఁ
గననీక చంద్రరే - ఖ దివంబు వ్రాఁకె!
ఆసమయంబున - నఖిలదానవులు
నాసవ సేవాప - రాయణులగుచు
గురు వెట్టుచును మేని - కోకలు మఱచి
పొరలుచుండఁగఁ గాంచెఁ - బురవీథులందు.
బొబ్బలు వెట్టుచుఁ - బొలఁతుల గబ్బి

గుబ్బల నొరిగిరై - కొను శరాసములు
నెక్కులు వెట్టి యా - యిక్క నల్గడల
నుక్కున జరియింపు - చున్న దానవుల
నొండొరు మెచ్చ - యురుభుజాదండ
చండిమంబులతోడఁ - జదరులాడుచును
జరియించు వారల - సతులతోఁ గూడి
పరమానురాగ సం - పద నోలలాడి
క్రీడించువారలఁ - గిన్నరుల్ మీటి
పాడుచునున్న బిం - బఫలాధరలను
కాఁగిళులందు నం - కములందుఁ జేర్చి
లోఁగి శయ్యాశయా - ళువులైనవారి
పొలయల్క మరుమొగం - బులువెట్టి మగలు
బిలిచినఁ బలుకక - బిగువులనుండి
మల్లాడు పతులకు - మనసీని యటులఁ
జెల్లుగాఁ బెనఁగు రా - జీవలోచనల
నిపుణతఁ గింకిణీ - నిక్వాణం బమర
నుపరతి క్రీడల - నోలలాడుచును
గులుకు తెలుంగులఁ - గూజిత మధుర
కలరావముల వల - కారి చిన్నెలనుఁ
బతులను గరఁగించి - పరవశలగుచు
జతఁగూడి యురముల - చక్కటివ్రాలఁ
గదియించి రమియించు - కామశాస్త్రార్థ
విదులైనవారల - వేర్వేరఁ గనుచు
దానుల నర్థిని - దానుల సుపరి
ధానుల వివిధాభి - ధానుల సదప

దానుల రుచిరోప - ధానుల సావ
ధానుల జయసంవి - ధానుల సప్ర
ధానుల బహుయాతు - ధానులఁ గనుచు
నావల వివిధమా - యావులఁ గ్రూర
భావుల దీనసం - భావుల సాను
జీవులఁ గలుషోప - జీవుల మద్య
సేవులఁ గృతవీర - సేవులఁగాంచి
ధీరులఁ బోషిత - ధీరుల సమర
శూరుల విక్రమ - శూరుల సపరి
వారుల శౌర్యదు - ర్వారుల వరవి
చారుల దుర్గుణా - పారుల నాత్త
చారుల యామినీ - శౌరులఁ జూచి
వెంటాడు విటులను - వెతలను బెట్టి
నంటువాసి తొలంగు - నాలి తొయ్యలులఁ
గడగేలు వట్టిన - గాజులు మొరయ
విడిపించుకొనిపోవ - వెనువెంటనంటి
జడలువట్టుక నిల్పి - చరణపద్మములఁ
బడి యడిగినవిచ్చి - బ్రతిమాలుచున్న
వారలఁ దనయిరు - వంకల నూళ
గేరులలోన నె - గ్గించి చూచుచును
కొప్పులోఁ దురిమిన - క్రొవ్విరిదండఁ
దప్పుపై మోపి చెం - తల సఖీమణులు
వలదన్న మానక - వరులఁ దమించుఁ
వలకారికొమ్మల - వళుకులు వినుచు
జెలులు దార్చినఁ బోక - శిబ్బితిపడుచు

నిలుచుచు దలవాంచి - నెయ్యముల్ దాఁచి
పడకయిండ్లను దమ - పతులున్న యెడకుఁ
గడుప్రయత్నమున రాఁ - గన్న పాయంపుఁ
జెలులఁ గరంబుల - చేపట్టి దిగిచి
తల్పంబులను జేర్చి - తఱితీపు వెనిచి
కసిగాటు పెనుకువన్ - గలయు నాయకుల
రసికత్వముల భ్రమ - రంబు వీక్షించి
తొడలపై నిదిరించు - తొయ్యలి నొయ్యఁ
దొడ నెచ్చరించు కం - దువ మాటలాడి
నగుమోముతోడ పు - నారతంబులకు
నెగపోయు రమణుల - యిక్కువల్ చూచి
విటులకై దండ ను - వీథుల వెంటఁ
బటువుగుబ్బలమీఁది - పయ్యదల్ జాఱ
ఘుమ్మన మృగనాభి - కమ్మనెత్తావి
తెమ్మెర లవలి వీ - థికిఁ దావిఁగట్ట
జడలఁ జుట్టిన పారి - జాతంపు విరుల
ముడి పువ్వుటెత్తులు - మురిపంబు నెరప
ఘలుఘల్లుమన పాద - కటకముల్ మొరయ
వెలువడు వెలజాతి - వెలఁదులఁ జూచి
చలువ వెన్నెలబైటి - చప్పరంబులను
కలపముల్ పూసి కో - కలు కడవైచి
సారాయి మబ్బుల - సతులును బతులు
నూరక నిదురింపు - చునికి భావించి

యొకవిరిపాన్పుపై - నొంటి నిద్రించు
నొక యిందుముఖి మొకం - బొకమేడ మీఁదఁ
గనుఁగొని చెంతఁ జ - క్కల రాజుతోడ
నెనవచ్చునని చూచి - యెంతయు మెచ్చి
“ యీయమ్మ సీతయో ? - యిటులేలయుండు
నాయకుఁ బాసి చిం - తలనొందు సాధ్వి ?
ఉత్తలంబున నెందు - నున్నదో ? యకట !
ఉత్తమ కులజాత - యూర్జితశీల
తనమది రాముని - తా రఘువీరు
మనసులోఁ బాయని - మానిత చరిత
మైలచేల ధరించి - మౌనంబుతోడఁ
దాలిమి లేక సం - తాప మొందుచును
గన్నీట దోఁగు మొ - గంబుతోఁ జాల
ఖిన్నయై వలకుఁ జి - క్కిన లేడి కరణి
చదలఁ గన్నట్టి రే - శశిరేఖరీతి
పొదఁ జిక్కువడి నెమ్మి - పొలఁతి యున్నట్లు
కగ్గువారిన పైఁడి - కమ్మి పోలికను
వెగ్గలంబగు గాలి - వీవఁ జలించు
జలదమాలికమాడ్కి - చాలనెత్తురుల
కళమాయు బాణరే - ఖయుఁబోలి సకల
మానినీ లక్షణ - మహనీయమైన
మానవతీ శిరో - మణి మహీపుత్రి
యెచట నున్నదియకొ ? - యెప్పుడు చూతు ?
నిచటనిల్చి విచార - మేల నాక ?” నుచు
“ నగరిలో నున్న సం - దడి యోసడిల్లె

సగము రాతిరియయ్యె - జానకీదేవి
యెందునున్నదియకో ! - యీరాచనగరి
సందులు గొందులుఁ - జని చూడవలయు."

—: హనుమంతుఁడు రావణుని యంతఃపురమున
సీతను వెదకుట :—

అని సింగములుగాచు - నడవి చందమున
దనుజాన్వయంబు పె - ద్దలు వసియించు
సావిడి మీఱి కాం - చన దంతి దంత
దేవయానములున్న - దిక్కులు చూచి
కొల్లారు బండులు - గుజరాతి కెంపు
పల్లకీలును రత్న - భద్రాసనములుఁ
గనుఁగొని యాఱవ - కత్య నెగళ్ళ
వనితల కలకల - స్వనము లాలించి
తీరిన మాణిక్య - దీపికా స్తంభ
వారంబు క్రీనీడ - వచ్చి యాకెలనఁ
గుందేళ్లు తేళ్లు త - గుర్లనుఁ గోళ్లు
పందు లేదులును జా - పలునుఁ దాఁబేళ్లు
నుడుములు షడ్రస - వ్యూహంబు సయిఁద
మడవి పిట్టల బుట్లు - నమరించియున్న
పాకశాలలు చెంత - పానశాలలును
వాకిళ్ళఁ బొంచి స - ర్వముఁ దేఱిచూచి
బోనపుటింటి క - పోతపాలికల
పైనిచ్చి కాంచనో - పకరణావళుల
హోమశాలలు నగ్ని - హోత్రముల్ దీప్య

ధామముల్ చూచి సౌ - ధముమీఁది కెగసి
కొలకొలమను వధూ - కోటులతోడ
నలరు రావణుని గే - హము చొరరాక
యందుండి మిన్నుల - నంటినప్రహరి
కుందనంపుంగోడ - కుప్పించిదాఁటి
తొలుదొల్త నలప్రహ - స్తుని యిల్లుజొచ్చి
కలయంగఁ జూచి చెం - గట మహాపార్శ్వ
నిలయంబు వెదకి దా - నికెలంకు నందు
కలిమి మించిన కుంభ - కర్ణుని నగరు
జతగూడుకొను విభీ - షణుని గేహంబు
వెతకి మహోదరు - విడిచి శోధించి
యా చక్కటిని విరూ - పాక్షుని యిల్లు
చూచి విద్యున్మాలి - చొరరాని యిల్లు
చొచ్చి విద్యుజిహ్వ - సారణగండ్ల
మచ్చుపైకెగసి వెం -. బడి వజ్రదంష్ట్రు
నాలయంబరసి ధూ - మ్రాక్షు వాసంబు
గాలించి సంపాతి - కనక గేహంబు
కాంచి విద్యుద్రూప - ఘనభీమ విఘన
కాంచనాగార రే - ఖలు విలోకించి
శుకశారణుల యిండ్లు - చూచి సంపదలఁ
దుకమైన యింద్రజి - త్తుని గీము వెదకి
తోడన రస్మికే - తుని యిల్లు నందు
తోడాయు సూర్యశ - త్రుని యిల్లుఁ జూచి
మాలి యిల్లును జంబు - మాలి గేహమును
మాలివాసము ప్రాలు - మాలిక యరసి

శుకనాభశతవజ్ర - సుందరాలయము
లకుఁ బోయి వికటునా - లయము వీక్షించి
రోమశహ్రస్వక - ర్ణులయిండ్లు దంష్ట్రి
ధామంబు మత్తస - ద్మము విలోకించి
యవలన యింద్ర జి - హ్వాధ్వజగ్రీవ
భవన యుద్ధోన్మత్త - భవనముల్ వెదకి
అమ్మాలను కరాళ - హస్తిముఖాల
యమ్మాలావల పిశా - చాసురు నిల్లు
నరసి ముంగల శోణి - తాక్షు మందిరము
దరిసి యిందజి సంప - దలు విలోకించి
ప్రతి యామములకును - ప్రహరులు తిరుగు
నలివల వెలిగోడ - యంచులఁ దిరుగు
చతురంగ బలమున - సవరణల్ మెచ్చి
క్షితితనూజాతఁ జూ - చినవాఁడు కాక
యొకమేడపై నుండి - యుప్పరం బెగసి
చకచకలీను వ - జ్రప్రకాశముల
రావణు తేజః ప - రంపర చేత
నేవల మణిదీప - హేతులవలన
ధిగధిగలీను దై - తేయేంద్రు నగరి
గగనముహాలుమీఁది - కక్ష్యకు దాఁటి
యంత్రవైఖరిఁ బవ - నాహతిఁ బలుకు
తంత్రులపాటల - తానవైఖరిని
జతఁగూడి రత్నపాం - చాలికాశ్రేణి
ద్రుతవిలంబితముల - తోడి కయ్యాడలు
కని యొక్కయెడ ఘటి - కా ఘంటికాళి

నినదముల్ విని యామి - నీవేళలరసి
యారావణుని శయ - నాగారమునకుఁ
జేరి యందు వినోద - చిత్రవైఖరులఁ
దేటగాఁ జతురరీ - తి విశేషబంధ
పాటవ లిఖిత దం - పతులఁ గన్గొనుచు
సకినల పసిఁడి మం - చములును సరము
బకదారులును రత్న - పంజరంబులను
వీర రావణకథా - వినుతులుసేయు
కీరశారికలును - కేకి మరాళ
కోలాహలంబును - గోడిగల కడల
ప్రాలంబముక్తాస - రంబుల మేల్మి
పట్టు కుడారముల్ - పరిమళధూమ
దట్టంబు పారిజా - తలతాంతదామ
రచితవితానముల్ - రంగవల్లికలు
ఖచితంబులైన చె - క్కడపు రత్నములఁ
బచ్చరాల నివాళి - పళ్లెరంబులును
ముచ్చటలాడుచు - ముఱియుచు నడుచు
రమణుల నూపురా - రావంబుఁజూడ
రమణీయమైన యా - రావణు నగర
ధ్వజపటి పల్లవో - ద్ధతఝుటాత్కృతుల
నిజసమాగమనంబు - నిండినవూవు
చప్పరంబులు మాట - సద్దుగానీక
నెప్పులన్నియుఁ జూచి - నెమకుచు వచ్చి
జాలంబు సందుల - జగతిపై యువతి
జాలంబుఁ గనుచు కే - సరి కుమారకుఁడు

వేళంబ యందందు - వెదకుచు నతివి
శాలాయతన చంద్ర - శాలాంతరముల
రాజితంబులును బు - రందర ప్రముఖ
పూజితంబులును సం - పూర్ణ వస్తువుల
నూర్జితంబులును ది - వ్యోపధావిధస
మార్జితంబులును మా - యాసుర శిల్పి
నిర్మితంబులును మా - ణిక్య ప్రకాశ
వర్ణితంబులును రా - వణ భుజాశౌర్య
పాలితంబులును న - పార విభూతి
లాలితంబులును నీ - లమణి ప్రవృద్ధ
నీలిమంబులును గం - ధిల ధూపధూమ
* కాళిమంబులును రం - గన్మాలికాంత
రామణీయకములు - రత్నవితర్ది
కామనీయకములుఁ - గాంచనకుడ్య
భాగంబులును దైత్య - భామాహితాను
రాగంబులును నైన - రాక్షస విభుని
సడిసన్న రాణివా - సముల వాసములు
పుడమిపట్టిని జూచుఁ - బూనికఁజూచి

—: హనుమంతుఁడు రావణుని రాణివాసమందిరములో సీతను వెదకుట - రాణివాసస్త్రీ వర్ణనము :—

కైలాసమో యిది - కనకాచలంబొ
భూలోకమున వ్రాలు - పురుహూతుపురమొ
యన మబ్బున మెఱుంగు - లమరినరీతి
తనమీఁద దేవతా - తరుణులు వెలుఁగ

బహుచిత్ర కేతన - పాళితో దివ్య
మహిమతో చిత్రస - మాజంబు తోడఁ
బురములో నెన్నియ - బ్బురములో దానఁ
దిరముగా నన్నియుఁ - దీఱిచి నిలుప
వైడూర్య భుజగముల్ - వజ్రప్రకాశ
నీడజంబులును మ - ణీ పుత్రికలును
చతురంగ బలముల - సామజమధ్య
శతపత్ర వాసలు - జతకట్టియున్న
పరమ కల్యాణ పు - ష్పక విమానంబు
హరిశేఖరుఁడు చూచి - యబ్బురమంది
యందుపై జానకి - నరసి లేకున్న
డెందంబులోని క - డింది ఖేదమున
" నెచ్చోట వెదకుదు ! - నేమి సేయుదును !
వచ్చియుఁ గననైతి - వసుమతీ సుతను "
అని మున్ను చూచుచు - నాపుష్పకంబు
వినువీథి దేవతా - విభుల యానముల
మీఱి యపారమై - మిన్నెల్ల నిండి
యేరిచేతఁ గొలంది - యేర్పడనేని
కందువలను విశ్వ - కర్మ నిర్మింప
నందమై యునికిఁదా - నచటికి మఱలి
తపముచే నతుల ప్ర - తాపంబు చేత
నపరిమితంబౌ మ - హాను భావమున
సాధించి యింట పూ - జలు సేయు దనుజ
యూథపుని విమాన - మొయ్యనఁ జొచ్చి

వచ్చినచోటికి - వచ్చు వెండియును
జొచ్చినచోటికిఁ - జొచ్చు తదీయ
మహిమంబులకు మెచ్చు - మణి గవాక్షముల
విహరించు సీతను - వెదకు నీయెడల
పావనమై పుణ్య - భవనంబు రీతి
శ్రీవెలయింపుచుఁ - జింతితార్థములు
స్వామికి నొసఁగుచుఁ - జనియెడి చోట
నేమేరఁ దలఁచని - యెడల కేఁగుచును
నిలువఁ దలంచుచో - నిలుచుచు లోక
ములు మూఁడును ముహూర్త - మునఁ జూచి మఱల
సాధకంబై రణ - స్థలముల నిర్జి
రోధకంబయి భాను - రోచుల నమరి
బహుల కేతనముల - బహుకోణములను
బహుకలశంబుల - భావ చిత్రముల
రాక్షస ప్రతిమాధు - రంధరత్వముల
వీక్షింపఁదగి చూడ - వేఱొక్క యెడలఁ
జేసిన ప్రతిమలు - చిఱునవ్వు నవ్వ
వ్రాసిన లతికలే - వలఁ బువ్వులీన
మలచిన కంబముల్ - మాఱాకులెత్త
నిలిచిన పుత్రికల్ - నిలిపి మాటాడఁ
గఱువులఁ బక్షులు - కలకలఁ బలుకఁ
బఱచు పుల్గులు చిత్ర - భావముల్ దాల్పఁ
జేతనావళియు న - చేతనశ్రేణి
యీ తెఱంగిదియని - యేర్పడనీక
బయలంచుఁబోఁ గుడ్య - భాగంబులగుచు

బయలౌచు మణికుడ్య - భాగముల్ దోఁచి
వేడ్కసేయు విమాన - విభవముల్ తనదు
చూడ్కుల కరిది మె - చ్చులు పాదుకొల్ప
యోజనాయత మర్థ - యోజన విస్తృ
తాజిరమునునైన - యాదశాననుని
శయన గేహమునకుఁ - జని నిశితాసి
శయనులై ధీరరా - క్షస భామినులను
నలుగడ మూఁడును - నాలుగుదంత
ములతోడి భద్రేభ - ములవిలోకించి
జలజంతువుల మీఱు - జలధియుఁ బోలి
కొలఁదిమీఱిన వధూ - కోటులచేత
నలబలంబగు శయ - నాగారమెల్లఁ
గలయఁ గన్గొనుచు రా - ఘవ కింకరుండు
నచ్చటి భక్ష్యభో - జ్యాది వస్తువుల
మెచ్చులఁ జూడ్కికా - మెతలు సేయంగ
నందులఁ దడసిన - యనిలుఁడు సుతుని
విందునకై పిల్చు - విధమునఁ దనకు
నచ్చటి వస్తువు - లాఘ్రాణమునకు
నచ్చవు వేడ్కసే - యఁగ డాయనేఁగి
యావిమానములోని - యరల చెల్వంబు
లావాడ లివియవి - యనరాక యుండ
మిగుల వేడుక సేయ - మెట్టైకమణుల
దిగదిగ వెలుఁగ జో - తికి నడ్డమైన
కడల నిల్చిన మర - కతపుటేనుఁగల

కడనున్న నీలాల - కంబముల్ చేరి
యాభవంతిని చుట్టి - యందుకు నడుమ
నీభవంతము గాన - మెచ్చోట? ననఁగ
నెగయుచున్నదొ! మింటి - కెగసి తావచ్చి
జగతిఁ వ్రాలెనో! పైఁడి - జగతి సనంగఁ
బదియారు వన్నియు - పసిఁడి కంబములు
పదియారు కలిగి తా - పనమగటాల
చీర్ణ దంతమునను - జిక్కినపంచ
వర్ణ రత్నములరు - వారంపువెల్ల
జల్లుల నునుబురు - సాచందువాలఁ
జల్లని పువ్వుల - చప్పరంబులను
పలకకప్పురపు ఘూ - పకరండకముల
మోఁగెడు పెంపుడు - మోకములు గలిగి
యొప్పుల కుప్పయా - నొకపెండ్లి చవికె
దెప్పవేయక భళీ - రే! యంచుఁ జూచి
యచ్చట జూజంబు - లాడి యోడినను
రిచ్చలు నడిన య - క్షకుమాళ్ళ వోలి
కదలని మణిదీపి - కాస్తంభములకు
నెదమెచ్చి యాపడ - కింటిలోపలను
మదిరాగృహముఁ జూచి - మధుపానమత్త
మదవతీ మణులందు - మ్రాన్గన్ను వెట్టి
యాచెంత నిదురింప - నందఱుఁ దేఱి
చూచి మృగాంకుండు - చుక్కలలోన
విలసిల్లుగతి నర - విరి విరిశయ్య
తలగడమీఁద ని - ద్రారతుండైన

రావణుఁ గొంత దూ - రంబునఁ జూచి
యీవలావలివార - లెఱుఁగక యుండ
మెల్లమెల్లనె వచ్చి - మింటిపై నుండి
త్రెళ్లిపోవని చుక్క - తెఱవలో యనఁగ
నడుగులఁ దొడిగిన - యందియల్ వీడ
జడలఁ జుట్టిన పారి - జాతముల్ జాఱ
మొనయు నిట్టూర్పులు - ముసుఁగులు గదల
చనుగుబ్బలందు కం - చలియలు బిగియ
చెక్కుల మకరికా - చిత్రముల్ చెదర
ముక్కులేఁ జమరులు - మొగములఁ గమ్మ
కమ్మలు తలగడ - కడలంకు వెలుఁగఁ
దమ్ములవంటి కం - దళుకులు మొగుడఁ
బచ్చికస్తురి పూఁత - పఱపుల నంట
గచ్చుమోవులు వీటి - కాసక్తిఁ జిటుల
పొరలి మణిసరం - బులు చిక్కువడఁగ
నెరికలూడిన జాతి - నీవులు వదల
కరవలికాసూత్ర - కలితచాంపేయ
సరములరీతి కాం - చన తనూలతలు
మెఱయంగ నిదురించు - మెలఁతలచాలు
దరియంగఁ జేరి యం - దఱఁ జూచునపుడు
హాలారసోన్మత్త - లగుటచే మేని
చేల లెఱుంగక - శిబ్బితి లేక
గరుడకిన్నర యక్ష - గంధర్వఖచర
సురసిద్ధచారణ - సుందరీమణులు
రావణుధైర్య శౌ - ర్య విలాసగతులు

భావించి వలరాజు - బారికిఁ దగిలి
వలచి చేకొనుమని - వచ్చినవారు
కలన నోడినవారి - కన్యలనెల్లఁ
జెఱలుగాఁ బట్టి తె - చ్చినవారు చెలుల
యొఱపులు విని కని - యును జగత్త్రయిని
వలెనంచుఁ దెచ్చిన - వారును దనదు
కులములోఁగల పెండ్లి - కూఁతులౌవారు
దేవతల్ కప్పముల్ - దెచ్చి చేకానుకఁ
గావించువారు లం - కాపురిలోన
నగరికిఁ దగిన సౌం - దర్యముల్ గలుగు
మగువలు బవళించి - మత్తాయిఁ గొనుచు
దశకంధరుండని - దండనున్నట్టి
శశిముఖిఁ గౌఁగలిం - చఁగ నున్నవారు
నొకతె బింబాధరం - బొకయింతి గమిచి
సకినలరీతిఁ గొం - చక పల్కువారు
" రావణ ! దక్కితి - రా ! నీకు " ననుచు
నావలి చెలి రతు - లాసించువారు
కలవరింతలఁ బొంటి - కాముకశ్రేణిఁ
దలఁపుచు బెదరి చెం - తలు చూచువారు
యుపరతి నొకతెపై - నొకకొమ్మ గదిసి
నిపుణత మరుకేళి - నిఁ బెనంగువారుఁ
దన చన్నులని పయ్యె - ద చెఱంగు చెంత
వనితగుబ్బలమీఁద - వైచినవారుఁ
దలగడయని యొక - తరుణిపై దమదు
తలలుంచి యురక ని - ద్రలు పోవువారు

నొకతెపై నిదురవుసు - నొకతెపై నేవు
రొకయంతఁ బవళించి - యుండెడివారు
"తెచ్చి సీతఁడు రాము - దేవేరి మనల
నిచ్చలో గైకొనఁ - డిఁక" ననువారు
నొకతె వల్కిన మాట - యొకచెలి నేత్ర
యొకయుత్తర మొసఁగ - నూకొనువారు
నై యుండఁ జూచుచు - హనుమంతుఁ డవల
చాయఁ బోవఁగ నొక్క - చక్కటియందు
నెడలేక శయనించు - నిందఱు సతులు
గడమైన దశకంఠుఁ - గానకయున్న
నిలుపోవలేక వా - నికె దక్కసీత
వెలిగాఁగ వలపులు - వెదఁజల్లుచున్న
వారలఁజూచి రా - వణుఁదేటి చూచి
"యూరార! యింతభా - గ్యముఁ గల్గియుండి
చెడుబుద్ధియేల వ - చ్చెను? దశాననుఁడు
పుడమి పట్టిని రఘు - పుంగవుఁజేరి
యొప్పగించిన వీని యొ - చ్చంబులెల్లఁ
గప్పఁగా! యంత భా - గ్యము సేయునేమొ!
సీతనుదెచ్చి యి - చ్చిన వీనిపుణ్య
మీతెఱంగని పల్క - నెంతవాఁడోపు?
కృతకృత్యుఁడైన సు - గ్రీవునికీర్తి
యతిశయంబగు సుకృ - తార్థుఁడౌ నతఁడు
నదియేల నేఁజేసి - నట్టితపంబు
తుదిముట్ట యేను జెం - దుదు మహోన్నతులు!
కాదేని నాస్వామి - కమలాప్త సుతుఁడు

వైదేహిఁదెచ్చు రా - వణునికి బదులు.
ఈ నిదురించు నే - నింటిలో సతుల
వానరావళిచేత - వడి విడిపించి
చెఱలు వట్టించిన - చేసిన ప్రతిన
యరిదియా సతనికి - నట్టివేడుకలు
కన్నులఁ జూచినఁ - గా నాదు తనువు
పన్నలు వొగడ సా - ఫల్యమ్ము నొందు !
అక్కట ! యిట్టి మ - హానుభావుండు
చక్కని యిటువంటి - సతుల గడించి
సీతయొక్కతెకునై - చెడఁగోరినాఁడు
ధాత వ్రాసిన వ్రాఁత - తప్పు రాకునికి ! ”

—:హనుమంతుఁడు నిద్రించుచున్న రావణాసురునిఁజూచుట:—

ననుచు మౌక్తిక ధవ - ళాతపత్రంబుఁ
గనకచామరయుగ్మ - కము వానినడుమ
నవరత్న సింహాస - నంబు నశోక
నవమల్లికా ప్రసూ - న స్రగన్వితముఁ
బట్టెమంచము పువ్వుఁ - బానుపు మెఱుఁగు
పట్టుతలాడయు - బటువు బిల్లలును
పానుపు మీఁదటఁ - బవళించి నిదుర
చేనున్న రావణుఁ - జేరి వీక్షించి
యుడిగపు బిత్తరు - లోలగింపంగఁ
గడల గద్దియలును - గంబళంబులును
బురునీసులుంజూచి - పూర్ణేందు వదన
లిరువురు చామర - లిరుగడ వీవఁ

గడమంచమున నుండి - గాజులు మొరయఁ
దొడరెడు నలఁతి ని - ద్దురల సోలుచును
కళుకుఁ గమ్మల డాలు - గల్ల పాళికలు
జలపోతవోయు కాం - చన కంకణములు
గలుఘల్లుమనఁగ గ్రేఁ - కపుఁ జన్నుదోయిఁ
గలపముల్ చెదరంగఁ - గదలికఁ దెలుపఁ
గొప్పులఁ దురిమిన - కుసుమముల్ జాఱఁ
జప్పుడుగాఁ దాళ - సంగతుల్ మొరసి
తొడలు జోకొట్ట ని - ద్దుర వోవుచున్న
నొడయుని దనుజకు - లోత్తంసుఁ గాంచి
పదియడుగుల మేర - పాటికి వెనుక
కొదుగుచు వచ్చి తా - నొకచెంత నిలిచి
యైరావతము కొమ్ము - లానిన నాల్గు
జీర లురంబుపైఁ - జెలువొందువాని
నగవైరి వజ్రంబు - నాఁటుగాయంబు
నెగుభుజంబుల మీఁద - నెసఁగెడువాని
హరిచక్రహతిఁ జిన్కు - లైన కంధరను
పరిమళంబులు పూని - పవళించువానిఁ
దలకిరీటముచెంతఁ - దలగడ నుంచి
యలరు దండలు చుట్టి - యలరెడువాని
మధుపానవాసనా - మహిమంబుఁ దెలుపు
నధికంబులగు నూర్పు - లడరెడు వానిఁ
పంచాననములొప్పు - ఫణిరాజులనఁగఁ
గాంచనాంగదభుజా - ర్గళములవానిఁ
గుంకుమగంధంబు - ఘుమ్మన మైన

లంకారముగ దుకూ - లము వైచువాని
దేవాసురాదులు - దృష్టింపరాని
లావును శౌర్యలీ - లయుఁ గల్గువాని
నిద్రచే నిసుము ది - న్నియమీఁద నున్న
భద్రేభమనఁగఁ జూ - పట్టినవానిఁ
దనచుట్టు గాంచన - స్తంభదీపములు
కనఁగన వెలుఁగఁ బ్ర - కాశించువానిఁ
జరణభాగంబుల - శయనించి మేను
లెఱుఁగని యుడిగంపు - టింతులవాని
రక్కస జాతిని - రాజైననేమి
చక్కదనంబున - సరిలేనివాని
నల్లనివానిఁ బ్రా - ణంబులఁ గడవఁ
బల్లవాధరలెల్లఁ - బాటించువాని
జగదేకవీరు నై - శ్రవణునిఁ జూచి
పొగడుచుఁ బవమా - పుత్రుఁడాచెంతఁ
బడక కైదువలఁ గం - బములతో నొరిగి
యొడలెఱుఁగక కూర్కు - చున్నకామినులు
నాటల పాటల - నడవడియున్న
నాటకశాలల - నాళీకముఖుల
మగలపై నురికిన - మాడ్కి మద్దెలలు
తగఁ గౌఁగలించి ని - ద్రలు వోవువారి
నురముల వీణియ - లునిచి కుడ్యముల
నొరిగి బయల్ మీటు - చున్నకామినులు
తప్పెటల్ తమభుజాం - తరములఁ బొదివి
చెప్పలు మూయు నా - రీశిరోమణులు

నడుగులు తొడలపై - నసుచుక తూఁగి
పడుచున్న బిరుదుల - పడుచు గుంపులును
తాళముల్ దప్పంగ - తంబురాల్ మీటి
యాళతుల్ మఱచు శ - యాళుభామినుల
విటుల వాతెఱలాను - విధమున సంకు
లటువట్టి యురకున్న - యలిసీల కచలఁ
గిన్నరల్ చన్నులఁ - గీలించి చెంత
కన్నెలపై వ్రాలు - గాయనీమణుల
సారాయిమబ్బుల - జతఁగూడి పొరలి
తారుమారైన చి - త్తరి బిత్తరులను
దమ చనుఁగవ తామె - తమితోడఁబట్టి
రమణహస్తములంచు - రాగిల్లు చెలుల
కొనగోరి చిరుతసోఁ - కులు మెడలందు
నునుపుచుఁ గొసరుచు - నున్నతొయ్యలులఁ
జూచుచో నెచ్చెలుల్ - చుట్టి నిద్రింప
మేచాయ పసిఁడి క - మ్మికి వన్నెలిడఁగఁ
గబరికాభరములోఁ - గల్పకదామ
నిబిరీసగంధ మ - న్నిటి నిండికొనఁగఁ
గమ్మకస్తురిబొట్టుఁ - గలనగుమోము
తుమ్మెదజవరాలి - తోఁ దమ్మినెనయఁ
దొడిగిన నెమ్మని - తొడవులకెల్లఁ
దొడవైన యవయవ - ద్యుతులు రాణింప
రంగైన కుంకుమ - రసము పయ్యెదకుఁ
గంగుల రవికె సిం - గారంబుగాఁగ
హత్తి తంబూలర - సారుణిమంబు

లత్తుక కెమ్మోవి - లచ్చనసేయ
నడుగులొత్తుచునున్న - యడపంపుఁబోఁడి
తొడలపై నందెల - తో నంఘ్రులమర
లంకామహారాజ్య - లక్ష్మియుఁబోలి
పంకజాస్త్రునిపూజ - బాణమోయనఁగ
రావణు పట్టపు - రాణివాసంబు
దేవి మండోదరి - దృష్టియానంగిఁ
గనిపించుటయుఁ "గంటి! - కంటి! జానకిని!
మనఁగంటి!" ననుచు సు - మాళించి యెగసి
గంతులువైచి తోఁ - క ధరిత్రినార్చి
దంతెల కెగఁబ్రాకి - దాఁటి యట్టిట్టు
లానందపారవ - శ్యముచేతఁ దనదు
వానరత్వంబు స - ర్వముఁ దేటపఱచి
యంతటఁ దెలివొంది - హనుమంతుఁ "డేల
యింతమాత్రంబు నే - నెఱుఁగలేనైతి?
తలఁపవచ్చునె యిట్టి - తలఁపరానట్టి
తలఁపు నాబుద్ధికెం - తయు మోసమయ్యె!
ఇంద్రుఁ డాసించిన - నేఁటికి రామ
చంద్రుని దేవేరి - సమ్మతమొందు?
చూచితిఁ గొంచెపుఁ - జూపు వానరుఁడ
చూచి నేభ్రమసిన - చో నేరమేమి?
ఇది రావణాసురు - నింతిగానోపు!
వెదకియు సీత నే - వీక్షింపనైతి
నక్కట! వీరెల్ల - నభిమానవతులు
చొక్కుల నిదురింపు - చోఁ బాపమనక

చూడరానివి యెల్లఁ - జూచితి మదిని
వ్రీడ యించుక లేక - వ్రీడావతులను
కపిసేను వీతరా - గ విశారమతినిఁ
గపటంబుతో వీరిఁ - గనఁగోరి యేను
రాలేదు వీనింట - రాముని దేవి
బాలిక లున్నట్టి - పట్టునఁగాని
యుండ దొక్కెడ నన్న - యూహ చేసినంత
చండించి సతులతోఁ - జరియింప వలసె! ”
అనుచు రావణు మనో - జాహవ కేళి
జనితశ్రమాలస - స్వాంతయు నుదిత
హాలారసావశ - తాంగియునైన
యాలేమ నెడవాసి - యవ్వలి కరిగి
మీనమేషము లెంచ - మేరగాదనుచు
మీనమేషాదిమా - మేయ మాంసములు
బూజగుండల నించి - పూన్చిన మధువు
రాజులకైన సా - రాయి తత్తైరలు
బహుమద్యములుగల్గు - పానమందిరము
విహితవైఖరిఁ జేరి - వెలితి గిన్నెలును
నిండు సారాయి గి - న్నెలు గొంతద్రావి
యుండిన మధువుతో - నున్న పళ్లెములు
నంజిడించినయట్టి - నంజుడుల్ తాటి
ముంజెలు విరిసి బ - ల్ముద్దలు పైఁడి
కొప్పెఱలును తంబు - గులు నెళసీళ్లు
కప్పుర భాగముల్ - గంధసారములు

గల దిక్కు లన్నియుఁ - గలయంగఁ జూచి
కలగన్నగతి నిర్వి - కారుఁడై యలరి

—: హనుమంతుఁ డెంత వెదకినను సీతనుఁ గానక
మిక్కిలి చింతిల్లుట :—

"యెందుఁ జూచియుఁ గాన - నిచ్చోట సీత
యెందు నున్నదియొకో - యీపీటిలోన ?
కాననేనని పోవఁ - గానెటు వచ్చు
భానుజుచే నాజ్ఞ - పడ సమ్మతించి
యిన్ని పగ్గలు వల్కి - యేవాలిసుతుని
కన్నుల యెదుటికేఁ - గతిఁ జేరనేర్తు ?
పరువునఁ బోయి జాం - బవదాదులైన
దొరలకేమని పల్కు - దును మోముచూచి
హనుమంతుఁడాడిన - యట్టులో నిజమొ
యనక యుందురె రాజు - లనుచరావళిని ?
ఏల ముద్రిక రాముఁ - డిచ్చె ? సుగ్రీవుఁ
డేల నాతోడ ము - న్నేకాంతమాడె ?
ఏనేల వచ్చితి - నీవార్ధి దాఁటి ?
వానరులకు తల - వంపు సేయంగ !
జనకజ మృతినొందె - చావక యున్నఁ
గనిపించకున్నె లం - కాపట్టణమున ?
తనదు పాతివ్రత్య - ధర్మంబుఁ దలఁచి
మనసీక యున్న దు - ర్మానంబుచేత
నీరావణుఁడు చంపె - నేమొ ? కాదేని
ఘోరరాక్షస వధూ - కోటులఁ జూచి

దిగులుచే నెవ్వరు - దిక్కు లేకున్నఁ
దెగియెనో లేదొ? సం - దియమేల యిచట
నింకఁ జూచెదఁగాక - యే"నని యెంచి
లంకలో మఱుఁగులె - ల్లను జూచి బుద్ధి
శ్రీకిని కార్యార్థ - సిద్ధికి ధైర్య
మే కారణముఁగా న - మేధమేధావి
మఱియుఁ జూచినగృహ - మాలికలెల్లఁ
దిరిగి రావణుని మం - దిరముశోధించి
సేయ నేమియులేక - చిత్తంబు గలఁగఁ
బ్రయోపవేశంబె - బాగని తలఁచి
యడియాసఁ గ్రమ్మఱ - నందిందు వెదకి
సుడిసి పోరానట్టి - చోటులఁజూచి
నిచ్చెన లెగఁబ్రాకి - నెళవరిఁవోలి
మచ్చులపై నెక్కి - మాళిగల్ దూరి
తనతండ్రి చూపిన - దారులఁ దాను
జనుచు కాంచనగవా - క్షములందుఁ జొచ్చి
కోటలు వీథులు - గొలఁకులు వెదకి
వీటిలో బెత్తెడు - వెళవుచోటైన

—: హనుమంతుఁడు సీతనుఁగానమికి దుఃఖించి ప్రాణ
త్యాగముఁజేయ నిశ్చయించుట:—

చూడని యెడలేక - చూచిన యట్టి
వాడలు క్రమ్మఱ - వచ్చి కన్గొనుచు
" అందఱిఁ జూచినాఁ - డను నింతెకాని
యెందును జానకి - నీక్షింపనైతి!"

సురగరుడోరగ - సుందరీమణులఁ
జెఱఁ జిక్కువారిఁ జూ - చి క్రమక్రమమున
" కన్నులు తనకును - గలిగిన ఫలము
లన్నియుఁ గనుఁగొంటి" - ననుచుఁ దలంచి
" ఏఁటికి తనువింక ? - నెత్తంగ రాము
బోఁటిఁ గానని నను - బోఁటికి !" ననుచు
మోదంబు ఖేదంబు - ముప్పిరి గొనఁగ
నాదశాననుని గే - హముచుట్టి వెదకి
దురుసునఁ గోటపైఁ - దొలకరి మెఱుపు
మెఱచినగతి నెక్కి - మీఁదులుచూచి
మేదిని వీక్షించి - మేను జాడించి
" లేదెందు రాముని - లేమ యీవీట !
నేజనకజఁ గంటి - యీవీట ననుచు
నాజటాయువు నన్న - యనియె నాతోడ.
ఈ దశాస్యుఁడు సీత - నెత్తుక రాఁగఁ
జేదప్పి పడియెనో - క్షితి నెందునైన ?
జలనిధిఁ గాంచి వి - షాదంబుతోడఁ
గలఁగుచుఁ దలక్రిందు - గాఁ ద్రెళ్లెనొక్కొ ?
దిగులుచేఁ జచ్చెనో ! - తినియెనో విఱిచి
పగవాని వీఁడు కో - పమునైఁపలేక ?
శారిక యరచి పం - జరములోఁ జిక్కు
మేర వీనింటిలో - మృతి నొందెనొక్కొ ?
సీతఁగాన నటంచు - శ్రీరాముతోడ
నే తెఱున వచింతు - నేమేనితోడ ?
చెప్పిన యీవార్త - చెవికొంత సోఁకి

నప్పుడే రఘుపతి - ప్రాణముల్ విడుచు!
చెప్పకయున్నచోఁ - జెందు ద్రోహంబు!
తప్పెఁ గార్యము ప్రయ - త్నము వ్యర్థమయ్యె!
అట్టి రామునిమాట - యాలించి కైక
పట్టి సౌమిత్రులు - బ్రదుకమి నిజము!
వారల తల్లులు - వారితో వారు
వారికి మునుపుగా - వాలినందనుఁడు
భానుతనూజుఁడు - బ్రదుకరు దాన
వానరులకునెల్ల - వచ్చును హాని
ననువంటి వానర - నాథులందఱును
వెనుక ప్రాఁకుఁ నురి - వెట్టుకయైన
బుడిబుడి తమశిరం - బులు రాలతోఁడఁ
బొడుచుకయైన ను - ప్పొంగువారధిని
నందఱుఁ బడియైన - ప్రాణముల్ వాతు
రిందఱి హానికి - నేనె కారణము!
కావున నేల య - క్కడి కేను బోదు?
దావాగ్నిఁబడి మేను - దరికొల్పుటొకటి
కడలిలోపలి మహా - గ్రాహసంతతికిఁ
గడివోని మేను గ్రాసం - గఁగ నిచ్చుటొకటి
పండనై ప్రాణాశఁ - బాల్మాలియున్న
కందమూలాదులు - గైకొని యిచట
మునివృత్తితోడ రా - ముని దలఁపుచును
వనములఁ జరియించు - వాఁడనై యొకటి
గాని వేరొక జాడ - గాననే" యనుచు

మానసంబునఁ బలు - మారు చింతించి
వంచిన తలయెత్తి - వానరోత్తముఁడు

—: హనుమంతుఁ డశోకవనమునుఁ గనుగొనుట :—

—: అశోకవన వర్ణనము :—

కాంచెఁ జెంగట నశో - కమహావనంబు!
కని "యిందులో వెదు - కఁగ లేదు సీత"
నని యష్టవసువుల - నాత్మలోఁదలఁచి
"యీ వనంబున రాము - నిల్లాలిఁజూచి
కావరించు నిశాట - గణముల నోర్చి
చిరతపోనిధి తప - స్సిద్ధియుఁ బోలి
ధరణినందనఁ గూడు - దశరథాత్మజుని
సేవించుకొనియుండఁ - జేయుఁడీ!" యనుచు
కేవలమైన భ - క్తినమస్కరించి
రాముని రమణిని - రామసుగ్రీవ
సౌమిత్రులను వాయు - శంకరార్కులను
భావించి సేవించి - "పాకశాసనుఁడు
దేవత లిచట వై - దేహినిఁ జూపి
యందఱు ననుకూలు - లై శుభదృష్టి
నుందురు గాత నా - కూరట సేయ
నుండునొకో యిందు - నొకచోట చంద్ర
మండలాననయైన - మాతల్లి సీత?
కనుఁ గొందునో చేరి - కమలపత్రములఁ
జెనకు కన్నులు గల్గు - శ్రీరామసతిని!"

అని కోటకొమ్మల - నడుగులు మోపి
తన కరంబులు నీటఁ - దా నీఁదు కరణి
యడ్డంబుగాఁ జాఁచి - యల్లెతోఁ బాసి
కడ్డివేసిన సాయ - కము వారినటుల
నా వాయునందనుఁ - డావనభూమి
యావరణము మీఱి - యావలఁ దాఁటి
నారికేళాశోక - నాగపున్నాగ
పారిజాతరసాల - పాటల వకుళ
పనస జంబూచూత - బదరీలవంగ
తినిస చందనసాల - తిందుకక్రముక
మాధవీకురువక - మాకందకుంద
యాదిశా ముఖతరు - వ్యూహంబులెల్ల
నన్నియుఁ గనకమ - యంబులై ఖగము
లన్నియు మణికాంచ - నాగంబులగుచు
నందనవనములో - ననుచైత్రరథము
నందులోఁ గల వింత - లన్నియుఁ గలిగి
తనమేనఁ బుట్టు ను - ద్ధత మారుతముల
వనపక్షులెగయు ను - ర్వడిచేత రాలు
పువ్వులు మేనఁ గ - ప్పుకయుండ నతఁడు
పువ్వుల కొండతోఁ - బురుడు వహించి
యవి ధరిత్రిని రాల్ప - నారామసీమ
యువతి తాఁగ్రై సేసి - యున్నట్టులుండె!
అలరు పర్ణంబులు - నన్నియు రాలి
చులుకనై తరువులు - జూదంబులాఁడి
వోడి యన్నియుఁబోయి - యున్నమానవుల

జాడనుండియు సొంపు - సడలకయుండె!
చెదరు పూఁదేనియ - చెమటగాఁ గడల
రొదచేసి చనుమత్త - రోలంబచయము
వీడు వేనలిగాఁగ - వీడిన చేల
జాడగా నెగయుర - జఃపుంజ మెల్లఁ
గలకలాయిత విహం - గమ విరావంబు
కలకూజితంబుగాఁ - గపివీరచరణ
విన్యాసపీడిత - విపినధరిత్రి
కన్యారతిశ్రమా - కారంబవోలె
గాలిమేఘంబులఁ - గడకోసరించు
పోలిక శాఖలు - ప్రోవఁ బ్రోలుచును
దనతండ్రి యున్నాళ్లు - తనయుఁడు నచటి
పనికి రాఁడను నప - వాదంబు దీఱఁ
దడలేక తనవచ్చు - దారి వృషభముఁ
బడద్రోయుచును బాల - భానుసంకాశ
తపనీయ గుల్మల - తాతతుల్ గనుచుఁ
గపికులాగ్రణి విశృం - ఖలమదేభంబు
బాగుగా మగఱాల - పలక మెట్టికల
జాగరూకత నేఁగ - జను సరోవరముఁ
గనుఁగొని దాని బం - గారు తామరల
తనివోని తావి సే - దలువోవఁ జేయ
నావల జగతి నా - మాచలేంద్రంబు
రావణునకు విహా - రప్రదేశంబు
కాంచి కేళీదీర్ఘి - కా సహస్రంబు
మించి యాగిరిని జ - న్మించిరాఁజూచి

యడుసెల్ల నపరంజి - యందలి యిసుము
పొడిమెల్లఁ జాఱుకుఁ గెం - పులు ప్రవహించు
నీరెల్లఁ దేట ప - న్నీరు తజ్జంతు
వారంబు నవరత్న - వర్ణనీయంబు
గాఁగ నన్నదులలోఁ - గడల జొంపములు
వీఁగి వ్రేలఁగ దరి - విరళభూజములు
నలిగిన యట్టి తొ - య్యాలిపిండు మచ్చి
కిల వేడికొను భు - జంగశ్రేణిఁ బోలె!
ఆ భూమిరుహసమూ - హంబుల కనక
శోభాపికాళల - క్ష్ములు తనుముంప
బాలాతపశ్రీలఁ - బరగిన హేమ
శైలమో యనఁగ కే - సరి పుత్రుఁడలరె!
ఆ పర్వతంబుపై - నపరంజి తరులఁ
జూపట్టు నొకయేరు - సుందరి మగని
తొడలపై మురియుచుఁ - దులఁదూగియున్న
వదువునఁ గననయ్యె - వామభాగమున
నపరంజి దీర్చిన - యరుగుతో విరుల
నెపమున చుక్కలు - నిలిచినవనెడు
పొడవుతో నదిరి పు - ప్పొడి రాశితోడఁ
గడనాడు నీల భృం - గశ్రేణితోడ!
పచ్చనిఱెక్కలు - బలుగెంపు ముక్కు-
లచ్చమౌ గోమేధి - కాక్షులు సోఁగ
పవడంపు గాళ్లును - బరగిన కీర
నివహంబుతో రాయు - ణీయకంబైన
నొక శింశుపావృక్ష - ముత్తుంగ భుజుఁడు

నికటభూమిని గాంచి - నీడకుఁ జేరి
యాచాయఁ జెట్టుచా - యనె ప్రకాశించు
మేచాయతో నందు - మీఁదికి నెగసి
యాకులత దొలంగి - యాకులచాటు
గైకొని "యిది యశో - కవనంబుగాని
యిదియ శోకవనంబ - కేని నామనసు
కుదురుపాటునఁ జెలం - గునె?" యంచుఁ బొంచి
"లేదకో యిచట మా - లిమిఁ జరియింప?
రాదొకో పనిగల్గి - రాముని దేవి?
వచ్చునిచ్చటికి న - వశ్యంబుఁ గాఁగ!
నెచ్చట రావణుఁ - డిదిమాని యునుచు?
నడురేయి మీఱె! ప్రా - ణములతో నున్న
పుడమికానుపు రాక - పోవదిచ్చటికి!"
అని నలుదిక్కులు - నటునిటు జూడఁ
గనులొప్పు రోహణ - గ్రావమో యనఁగ
వెండియుఁ బైఁడియు - వెదజల్లు రుచుల
వెండికొండయె తెచ్చి - విడియించిరనఁగ
వెలలేని మగఱాల - వేయుగంబములఁ
దళతళ ద్యుతుల చం - ద్రప్రభలీన
నవి యాక్రమించి మ - హాంధకారంబుఁ
గవియ నీలపు వేది - కలు వాదుకొనఁగ
నదిమీఱి రానీక - యరికట్టి కోణిగ
ముదురుఁ గెంపులు పాళ - ముగ నెండఁగాయ
దాని లోఁగొని మర - కత కుట్టిమములు
లేని పచ్చికలు గ - ల్పించి పోషింప

నాచాయఁ గడఁద్రోచి - యాణిముత్తియపు
వాచూరు జల్లులు - ర్వార ముగ్గులిడఁగఁ
బగడంపు దంతెలా - పైఁ జెందిరంపు
నిగనిగల్ చల్లుచు - నెరజాజు నింప
నన్నియుఁ బైకొని - యపరంజిగోడ
మిన్నభవంతిముల్ - మిరిమిట్లు గొలుప
నామీఁదఁ జాలఁగా - యత్నప్రకాశి
గోమేధికముల ని - గ్గులు వలనైన
దానిలోఁ దగులకఁ - దారు మాణిక్య
నానా విహంగాభి - నయములుఁ దోఁప
నవి యుంట విండ్లచే - నందరంట నేయఁ
దివురు రత్నకుమార - దీప్తులు వెలుఁగ
ఛత్రసింహాసన - చామర హేమ
పుత్రికావినియోగ - ములు విరాజిల్లఁ
గలశంబుమీఁది చె - క్కడపు రత్నంబు
పొలుపున దినమణి - పోవుచో నిలుచు
పొడవు గల్గినయట్టి - భూరిసౌధంబు
గడసేపు చూచి రా - ఘవ కింకరుండు

—: అశోకవనమున హనుమంతుఁడు శింశుపావృక్ష ఛాయను సీతనుఁ గాంచుట :—

నందు చెంగట మాన - వాంగనఁ జూచి
“సందియం బేఁటికి ? - జానకిఁ గంటి !”
అని రాక్షసాంగన - లాచుట్టునుండ
తనదిక్కు లేమికై - తలఁగెడుదాని,

మాసిన తనయొంటి - మైలతో మిగుల
గాసిల్లి యూరటఁ - గాననిదాని
కన్నీట దోఁగు మొ - గంబునఁ జాల
చెన్ను దొఱంగి వాఁ - చిన తలదాని
యుపవాసములఁ జిక్కి - యురగవధూటి
నుపమింపఁ దగిన ని - ట్టూర్పులదాని
మేనంత డస్సిన - మిగుల సౌందర్య
మానిత లక్ష్మిఁ దా - మానిన దాని
మినుమినుకను పాడ్య - మీచంద్రుఁ బోలి
తనచెల్వ మంతయుఁ - దరిగినదాని
నిగురు గప్పినయట్టి - నిప్పును బోలి
మిగుల మైసొబగు లే - మియు లేనిదాని
సారసంబులు లేని - జలజాకరంబు
మేర మైతొడవుల - మెఱయనిదాని
భీకరాంగారక - పీడిత రోహి
ణీకాంత కైవడి - నెగులొందు దాని
కుక్కల నడుమ ద - గుల్వడు లేడి
పెక్కువ రక్కసుల్ - పీడించుదాని
వనరేఖ నొప్పు ను - ర్వరఁ బోలి తొడలఁ
గనుపట్టు జడసోయ - గము మించుదానిఁ
గనుఁగొని ఋష్యమూ - కమునందు మొదట
దనుజ నాథుఁడు తెచ్చు - తరిఁ జూచియున్న
మెఱుకచేఁ నొకకొంత - యిట్లుండు సీత
మఱవకుమను రాము - మాటచేఁ గొంత
మొదట తాఁగనిన సొ - మ్ములమూట చెఱఁగు

ముదితచేలయు నేక - ముగనున్కి కొంత
యచటఁ జూపినయట్టి - యాభరణంబు
లిచట గానమిఁ గొంత - యితరాంగకములు
సొమ్ములన్నియుఁ దీసి - సూరెల చుట్టు
కొమ్మల నునుపఁ గ - న్గొని యొకకొంత
యనుమానములు దీఱి - 'యానొకో ? కాదో ?
యను చింతలేక పం - చాయుధురాణి
కైవడిఁ గనుపించుఁ - గల్యాణి పరమ
పావనిఁ బావని - పరికించి చూచి
" ఈసాధ్వి సీతగా - దే! తనుకాంతిఁ
జేసె మొలాము దాఁ - జెంత మేడకును
ఇతర మానవతుల - కేడది యిట్టి
ప్రతిలేనికాంతి ? త - ప్పదు సీతయగుట !"
అతివ సంశయయుక్త - మగు స్మృతి కరణి
నతనాభి పడిపోయి - న సమృద్ధి యనఁగ
తరళలోచన విహ - తశ్రద్ధ రీతి
అరవిందముఖి వ్యర్థ - మగు నాశకరణి
చెలియ వమ్మగుఁగార్య - సిద్ధియ పోలి
పొలంతి కలంగిన - బుద్ధికైవడిని
తరుణి యుక్తాపరా - ధసమాఖ్యమాడ్కి
భరతాగ్రజుని బాసి - పరితపించుచును
విన్నబాటున నుల్కి - వీక్షించి తాను
విన్ననై సదసద్వి - వేకంబు లేక
యర్థి వల్లింపని - యాగమవిద్య
యర్థాంతరముఁ బొందు - నట్టివాక్యంబు

కరణి నొఁగాములుఁ - గనసీక యున్న
ధరణితనూజ వ - ర్తన మాలకించి
"కమ్మలు గాజులు - కడియముల్ దాల్చి
సొమ్ములు చూచియుఁ - జూడని వెల్ల
నచట నిచట నుక్కి - యనుమానమేల?
యచలాతనూజ యా" - నని నిశ్చయించి

—: అశోకవనమున దుఃఖితయైన సీత పరిస్థితిఁ జూచి హనుమంతుఁడు విచారించుట :—

" ఈయమ్మ కొఱకునై - యెన్ని దుఃఖముల
రాయిడిఁ బడుచు శ్రీ - రాముఁడున్నాఁడు?
వనితగా యనుచు భా - వనసేయుఁ గరుణఁ
దనవెంట వచ్చెగ - దాయన్న వగపు
చక్కని యిల్లాలి - క్షణమైన బాసి
యొక్కఁడు నిలునోప - కున్నట్టి వలపు
వలరాజుచేత ని - ల్వఁగరామి యెన్ని
యలమటలకు నోర్చు - నకట రాఘవుఁడు!
అటువంటి ప్రాణనా - యకు నెడవాసి
యిటువంటి ప్రాణనా - యిక నెడవాసి
ప్రాణముల్ వీరలు - వట్టుక యున్నఁ
ద్రాణలకును మెచ్చఁ - దగుగాక యిట్లు
పలువరించుటలు చె - ప్పఁగనేల యిట్టి
చెలువముల్ గలవె? రా - జీవనేత్రులకు!
ఈరామ నెడవాసి - యిన్నాళ్లు బ్రదుకు
నారామునిదియె ధై - ర్యము మఱికలదె?"

అని తలయూఁచి తా - నాత్మలోఁ బొగడి
జనకతనూజఁ బ్ర - శంసించి " యిట్టి
పరమపతివ్రతా - భరణమిట్లైన
నొరులు కాలముఁ నోర్చు - నుపమ నేరుతురె ?
ఆదిగర్భేశ్వరి - యైనట్టి సీత
యీదుఃఖ జలరాశి - నిందుఁ బాలయ్యె !
కులముల రూపుల - గుణముల వీరు
తులఁదూఁగఁ గల దంప - తులుగాన ధాత
యోర్వక యిట్టి వి - యోగంబుచేత
నిర్వహింతురె వీరు - నిమిషంబు బాసి !"
అనికొంతసేపు తా - నాత్మఁ జింతించి
హనుమంతుఁ డాసాధ్వి - యాలింపఁ బలికె
" ఈ సీతకై రాముఁ - డెందఱిఁ జంపె !
ఈసుతోడ విరాధుఁ - డీల్గె నందఱను
తునిసిపోయిరి ఖర - దూషణత్రిశిరు
లనిలోన వాలి యొ - క్కమ్మునఁ గూలె !
చాయనున్నాఁడు రా - క్షస చక్రవర్తి
రావణాసురుఁ డపా - రబలంబుతోడ
ఈ యమ్మచేఁ గల్గె - నినకుమారునకుఁ
బోయిన రాజ్యంబుఁ - బొలఁతియు మఱల
నుదధి యీరమణికై - యొంటిగా దాఁటి
వెదకితి నీరాత్రి - వీడెల్లఁ గలయ
నీపుణ్యసాధ్వికై - యెల్లలోకములు
కోపించి వరసతోఁ - గూల్చిన నేమి ?
వనువంటి వారిచే - నాలుగుదిక్కు

లినసాతి వెదకించు - లేమి యబ్బురము ?
తనవెంట నేతెంచి - దండకారణ్య
వనముల నిత్యోప - వాసముల్ చేసి
కందమూలముల నాఁ - కలి దీఱి క్రియల
నిందు నేమఱకున్న - యనుకూల సతిని
యీరావణుఁడు దెచ్చి - యిచ్చోట నుంప
శ్రీరామవిభుఁడోర్చి - చింతిల్లుటరుదె ?
దశకంధరుఁడు దెచ్చు - తరుణి నెమ్మొగము
దశరథరాజనం - దనుఁడు చూచినను
యెండకాఁకలఁ బడి - యెఱు వాఁడు చెంత
నుండిన ప్రపఁజూచి - యుత్సాహ మొందు
ననువున నేక్రియ - నలరుచో నాఁటి
యనుపమానంద మెం - తనవచ్చుఁ దనకు ?
పగవారిచేతఁ జే - పడిన రాజ్యంబు
మగుడఁ గైకొనిన స - మర్థుని కరణి
సీత క్రమ్మఱఁ జేర - శ్రీరామవిభుని
చేతోవికాస ల - క్ష్మికి మేర యెద్ది !
రామలక్ష్మణుల మే - రలు హృదయములు
సీమానవతి చూచి - యెఱిఁగిన దగుట
నమ్మికచేతఁ బ్రా - ణముఁ దాల్చెఁగాక
నమ్మనేడవి జీవ - నమున కన్యములు !
ఆసాసలను దన - ప్రాణ వల్లభుఁడు
'వాసవాదుల గెల్చు - వాఁడు గావునను
వననిధి యింకించి - వచ్చి రావణునిఁ
దునిమి క్రమ్మఱఁ దన్నుఁ - దోకొనిపోవు'

ననియెంచి యున్నదీ - యసమలావణ్య
ఖనియైన కాంచన - గాత్రి భూపుత్రి
మానవతులకెల్ల - మగఁడె భూషణముఁ
గాన వన్నెఁ దొలఁగి - గాసిలె మిగుల!
ఈ మనోహారిణి- నెడవాసి యెట్లు
రాముఁడు బ్రదుకు? నే - రని మాటగాక!
ఏను చూచినయంత - నింతటి చింత
నానరాని విషాద - మందితినిపుడు!
తననాయకుఁడు గావఁ - దాఁబ్రమోదించు
జనకతనూజ రా - క్షససతుల్ గావ
నున్నది జనయిత్రి - యోరువు తాను
గన్నది తల్లి యే - గతి నుంటివమ్మ?
వనిత! యీరేయి నీ - వలె మంచుచేత
వనజినీలక్ష్మి చె - ల్వము చాలమాసె!
నీకయివడిఁ గాంతు - నెడవాసి చక్ర
వాకి యీకియలార్చి - పగలపాలయె!
ఈ యశోకము నీకు - నింతశోకంబు
సేయునే యిదివిధి - చెయిదంబుఁ గాదె!"
అని పల్కుచును జుట్టు - నసిలతల్ దాల్చి
కినిసి కోపించి జం - కింపుచు నున్న
యేకకర్ణ వికర్ణ - యేకాక్షి చండి
కాకాస్య లంబోష్ఠి - గజకర్ణ హ్రస్వ
కర్ణలంబోదరి - గజపాద ధూమ
కర్ణ లంబస్తని - కాలినీజటిల
యజముఖి మహిషాస్య - హరివక్త్రి శునికి

గజముఖ నిటలాక్షి - గర్దభరోమ
లంబనాస పిశాచి - లంబాస్య ధూమ్ర
లంబకర్ణ ప్రలంబి - లంబనితంబి
యేకపాద త్రిపాద - హేమకకేశి
ఘూకాక్షి గోకర్ణ - గోష్పద త్రిజట
యనువారు మధురుధి - రాపూపమాంస
కనదురు కరపుటి - కాంస్య పాత్రికలఁ
ద్రావుచు కాయలు - తలుపును గలుగఁ
ద్రేవు తంత్రులు గట్టి - పెద్ద యెమ్ములను
నొళవు లేర్పఱచి చి - ట్టురువడి వీణె
వెలిమీటుచును బాడు - వెకలి రక్కసులు
తందనానలు పాడి - తప్పుతాళములఁ
జిందులు ద్రొక్కుచుఁ - జెలరేఁగువారు
బెదరించువారు పే - ర్పెడు కల్లుద్రావి
నిదురించువారు నా - నిర్జరాహితుల
నెలఁతలఁ గనుఁగొని - నిజపుణ్యభరము
తలఁగిపోయినఁ దోఁచు - తారచందమునఁ
గమలాప్తముఖ బహు - గ్రహములలోన
హిమధాముఁ బాసి రో - హిణి యున్నకరణి
నీరద మాలికా - న్వితశోభయైన
శారద యామినీ - శశిరేఖ రీతి
పంకసంకలితమై - పరగు మృణాళి
పొంకంబుతో మైల - పుత్తడి సరిగ
చేలఁ గట్టుక తన - చెలువెల్లమాని
కేలుదమ్ములను చె - క్కిటిమీఁదఁ జేర్చి

బెదరి కిరాతుని - పెనువలఁ జిక్కు
కొదమ లేడనఁగఁ జూ - డ్కులు చంచలింప
జానకి శింశుప - చ్ఛాయ వసింప
మానసంబున హను - మంతుఁ డుప్పొంగి

—: సీత గూర్చుండిన శింశుపా వృక్షముపై
హనుమంతుఁడు చేరుట :—

ఆచెట్టుకొమ్మపై - నాకులచాటు
చూచుక తానిల్చి - సుగ్రీవునకును
రామలక్ష్మణులకుఁ - బ్రణమిల్లి మదిని
సేమంబు గాంచి వ - సించి యున్నంత 1560
వేకువ జామయ్యె - విఱియంగఁ బాఱెఁ
జీకటి కుక్కుట - శ్రేణులు మొఱసె
వీదులలోఁ బది - వెదు దైత్యవటుల
వేదఘోషంబులు - వినవచ్చె నపుడు
గాయక మంగళ - గాన ఘోషముల
నాయత ప్రణవతూ - ర్యధ్వానములను
రావణాసురుఁడు ని - ద్రఁ దొలంగి లేచి
దీవించు బ్రాహ్మణ - ద్వితయంబుఁజూచి
జాఱినసిగఁ బారి - జాతంబు సరుల
పూరాలుఁ పని పసు - పు రుమాలు తోడఁ 1570
బానుపుపై నంటి - పలుచనై చెదరు
మేనఁ బూసిన పచ్చి - మృగనాభితోడ
వలెవాటు జిలుగు కు - వ్వాలువ జీరాడి
యిలరాయఁ జేఁదాల్చు - నెలనాఁగతోడ

నడిప నొక్కతె తేర - నడపంబు గట్టు
నుడిగంపు చెలిమీఁది - నొక కేలు తోడ
ముదురు కెంపులరవల్ - మొఱయంగఁ దొడుగు
పదముల దంతపు - పావాలతోడ
" స్వామి భూమాన మె - చ్చరిక " యటంచు
నామున్న వలుకు తొ - య్యాలి జోడుతోడ
మదనరాగంబున - మతిఁ గన్నుదోయి
తుదిఁ గెంపుఁ దేఱు ని - ద్దురమంపుతోడఁ
దనకు లోఁగాదను - దమియు మచ్చరము
తను పెడరేఁచు కాం - తాళంబుతోడ
నవరత్నభాసమా - న విచిత్ర కేళి
భవనతోరణ మంట - ప వితర్దికలను
నందమై తగునశో - కారామమునకు
సందడిమాని రా - సదనంబులోనఁ
దడఁ బాటువడుచు ని - ద్రలుమాని లేచి
పడఁతులు కుంకుమ - పయ్యెదల్ జాఱ
గలుగల్లుమన హ - స్త కటకముల్ మొఱయ
నలువు దొరఁగి వే - నలులు జాఱంగఁ
బూసిన కుంకుమ - పూఁతలు చిటుల
నాసవ మదశోణి - తాక్షులు సోల
నందియల్ గోరంకి - యరపులు గులుకఁ
జెందక హారముల్ - చిక్కువడంగ
" నోయమ్మలార ! మం - డోదరీ ప్రాణ
నాయకుఁ డెచట ను - న్నాఁడెందు వోయె ?"

అని "సీతపై విర - హమునశోక
వనమున కేఁగె నె - వ్వరిఁ బిల్వ లేదు!
అమ్మక చెల్ల! రం - డాలస్య మేల?
అమ్మలార! యొకఁడు - నరిగె నాయకుఁడు."
అనుచుఁ గాళాంజియు - నడపంబు గిండి
కనకపల్లకియు ము - క్తాచామరములు
ధవళాతపత్రంబుఁ - దావి సారాయి
గవిశనతోడి బం - గరు కలశమును
గైకొని కరదీపి - కా సహస్రములఁ
గోక స్తనులఁ గూడి - కునుకుఁ బర్వాలును
మేళంపు చెలుల స - మేళంబుతోడ
నేలిక గూడిరా - నిండఱితోడ
వచ్చుచున్న రా - వణుని యైశ్వర్య
మచ్చెరవుగఁ జూచి - యాంజనేయుండు

—: అశోకవనమునకు వచ్చు రావణుని
హనుమంతుఁడు చూచుట :—

కలకల వెలుఁగు చు - క్కలలోనఁ బోలుచు
కలువలరాజు బిం - కము మించువాని
చెఱకు సింగాణి పూ - సెలగోల లవలఁ
దొలఁగించి వచ్చు కం - తునివంటివాని
వనమెల్ల నలరింప - వచ్చు వసంతుఁ
డనఁగ నొప్పె మః లేని - యందంబువాని
జాతి దువ్వాలువు హ - స్తవిభూషణాగ్ర
హీరాంకురములాన - నెసఁగెడువాని

నగుమోము లోచనా - నందంబుగాఁగ
మగువలకును జొక్కు - మందైనవానిఁ
దనుఁ జూచు కన్నులు - తడవులకైన
జనులకు నవ్వాలఁ - జననీనివాని
సకల విభూషణో - జ్జ్వలుఁ బీనవక్షు
నకళంకుఁ దేజస్వి - నాజానుబాహు
జలధరవర్ణుని - శతపత్రనయను
వలమానవిభవు రా - వణుఁ జూచునంత
నాయశోకముక్రింద - నవనీతనూజ
చాయనే వచ్చు రా - క్షసనాథుఁజూచి
యదరుపాటునఁ బవ - నాహతిచలిత
కదళినీకాశయై - గజగజ వడఁకి
యురమూరువుల నున్న - తోరోజయుగళిఁ
గరముల నేమ్మేను - గప్పుఁ బయ్యెదను
మరుపెట్టి తలవాంచి - మానంబుతోడ
మరుఁగు చుండఁగ రాగ - మదవికారముల
నల్లంత రాఘవా - యల్లకతాప
హాల్లోహల స్వాంత - యై యున్నదాని
కోరిక లనియెడు - ఘోటకంబుల ము
నోరథంబపుడు మి - న్నులఁ బఱపించి
రామునికడకుఁ జే - రఁగనాత్మలోన
నేమించె ననెడు పూ - నిక నున్నదాని
మలచి భోగము మణి - మంత్రౌషధములఁ
గలఁగెడు పన్నగాం - గన బోలుదాని
అతిభీమరాహుగ్ర - హాగ్రస్తయగుచు

వెతనొందు రోహిణి - వీడ్వడుదానిఁ
గులవతియై హీన - కులజుని యింటి
పొలఁతియౌ సతిఁబోలి - పొక్కుడుదాని
నపవాదమును బొంది - యణఁగిన కీర్తి
నుపమింపఁదగి చింత - నొందెడుదానిఁ
జెడిన యాజ్ఞయుఁ మఱ - చిన వేదవిద్య
యుడుగు ప్రజ్ఞయుఁబోలి - యున్నట్టిదాని
మొన మావసులు వడ్డ - మూఁకతోఁ గలఁగు
వనజినితో సాటి - వచ్చినదానిఁ
నరులాక్రమించిన - యజ్ఞవేదికను
దరలని చీకటిఁ - దవిలిన ప్రభను
నారియుండిన పావ - కార్చిని చంద్రుఁ
జేరని యామిని - సింధురేంద్రంబు
కరమునఁ జిక్కిన - కమలమాలికను
సరివోల్పఁ దగి సొంపు - చాలనిదానిఁ
మజ్జనభోజన - మాల్యవస్త్రాదు
లుజ్జగించిన దాని - నొకమైలఁగట్టి
యొక కబళము ప్రాణ - మునుప భుజించి
యొక నిమిషము తన - కొకయేఁడు గాఁగఁ
జెదరక యేప్రొద్దు - శ్రీరామచంద్ర
పదపద్మయుగళముల్ - భావనచేసి
తనకు మృత్యువుఁబోలి - తరివేచియున్న
జనకజఁ గదియంగఁ - జనిరావణుండు
చావునకొడిగట్టి - సదసద్వివేక
మావలఁ దొలఁగించి - యాస నిట్లనియె.

—: రావణుఁడు సీతతో తనమనోరథముఁ దెలుపుట :—

''కొమ్మ ! నీవేల చె - క్కుటనఁ జేయిచేర్చి
కమ్మకొల్కుల వెంట - కన్నీరురాల
నిలమీఁద వసియించి - యీమైలఁ గట్టి
తలవాంచి మాల్యగం - ధవిభూషణములు
కైకోక భాగ్యంబు - కడకుఁ ద్రోచెదవు ?
నాకులకాంతవై - నాకులచేతఁ
బూజలొందుచు నిత్య - భోగభాగ్యముల
రాజిల్లు ! మావిచా - రమునీకు నేల ?
రావణు నంతటి - రాక్షసరాజు
కావలెనని కోరఁ - గావలె గాక !
కాదనవచ్చునే ? - కడకంటి చూపు
వైదేహి ! పాలింప - వలసి వచ్చితిని !
రసభంగ మానని - రమణి ! నేనిన్నుఁ
బొసఁగఁ బల్కకబల్మి - భోగింపనొల్ల !
పరకామినులు బల్మిఁ - బట్టుక తెచ్చు
సరసిజాక్షులఁను మా - జాతివారలకుఁ
గామింపఁ దగువాఁడు - కంటి నేనొకఁడ
నీమేరఁ బ్రతిమాలి - యిచ్చఁబోనిచ్చి
యిచ్చకమ్ములు వల్కి - యేమన్నఁ దాళి
పచ్చవిల్తునిబారిఁ - బడి కలంగెదను !
శరణు చొచ్చితి నీదు - చరణాబ్జములకు
బరిరంభణము చేసి - భయము వారింపు !
నినుఁగోరి యున్నవా - నికి గుట్టువెట్టి
మననీని పాపక - ర్మంబుచేఁగాదె ?

తల జడగట్ట నీ - తరువు క్రీనీడ
బలవంతమగు చింత - పాలైతివీవు
కానవింతియకాక - కలదె యెందైన?
ఏ నిలుచుండ నీ - విటు గూరుచుండి
మాఱుమాటాడక - మౌనంబుఁదాల్చి
యూరకే యుండఁగ - నుచితమే నీకు?
వెఱవక మనురూప - వేషంబుఁదాల్చి
యరవిందముఖి! నిన్ను - నలరింపనేర్తు!
కాదన్న నాకిను - కకు నిర్గ్రహింప
రాదెవ్వరికి జగ - త్త్రయిని నెన్నటికి!
వలనేల నీదు జ - వ్వనము వ్యర్థముగ
వలపెఱుంగ కశోక - వనికి నిచ్చెదవు?
పోయిన నదుల యం - బువులు క్రమ్మఱని
చాయ రానేరదు - చనిన ప్రాణంబు.
చేసె యపూర్వసృ - ష్టి విరించి నిన్ను
నాస లీడేరె నా - కబ్బితి వీవు
నీయంగకములందు - నిలిచిన చూడ్కి-
పాయ దవ్వలికి నీ - పాదంబులాన!
ఈ యింతులకునెల్ల - యేలికసాని
వైయుండు మేల యీ - యవివేకచింత!
నాసొమ్ము నీలంకె - నా శరీరంబు
నీసొమ్ము నన్ను మ - న్నించితీవేని.
జనకుఁడైనట్టి మీ - జనకుని కేను
తనరాజ్యమునసిత్తు - తగఁబంచి సగము.

నిన్ను శృంగారించి - నీచక్కఁదనము
కన్నియ! మఱి చూడఁ - గాఁ దలంచితిని.
ఓడ నెవ్వరికి నా - కోడనివానిఁ
జూడ సురాసుర - స్తోమంబునందు?
నను నీవు బ్రదికించి - నాచేతనీదు
మనసువచ్చినవారి - మనువులీడేర్తు.
రాముఁడు నారచీ - రలు గట్టి యడవి
భూమిపై నిడుమలఁ - బొరలెడు వాఁడు
నిన్నుఁ గైకొన నేర్చు - నే? వానికొఱకు
నెన్నివేడబముల - నీవు వొల్లెదవు?
కలభాషిణి! హిరణ్య - కశిపుఁడు మున్ను
బలిమి నింద్రుఁడు తన - పట్టాన దేవిఁ
గొనిపోవ మఱలఁ గై - కొన్నట్టు నిన్ను
ననుగెల్చి చేపట్టు - నా? రఘూద్వహుఁడు!
గరుడుఁడు కాలాహిఁ - గబళించినట్లు
తరుణి వేకొంటి వీ - తరి నామనంబు
నలకువతోడ ను - న్నను నిన్నుఁజూచి
తలఁపుఁ ద్రిప్పఁగ నేరఁ - దరుణులయందు.
హరిరాణిఁ గొల్చిన - యచ్చరలట్ల
తరుణి! నీసేవ నా - తరుణులుండుదురు.
బలపరాక్రమధైర్య - పదవులఁ దనకుఁ
దులవచ్చు రాఁడని - తోఁచదుగాక
రాముని దలఁచి క - రంగుటేకాక
యేమిసేయుదు? వేల - యేలవు నన్ను?"

అని కర్ణకటువు లి - ట్లాడిన వానిఁ
గనుఁగొని సీత యా - గ్రహముతోఁ బలికె.

—: సీతకోపముతో రావణుని మాటలకుఁ బ్రత్యుత్తరముఁ
జెప్పుట :—

" ఏల నీకిటులాడ - హీనోక్తు ? లింకఁ
జాలింపు వలవదీ - జాలి యేమిటికి ?
నీకులకాంతను - నీవు రమించి
కైకొమ్ము చెడని సౌ - ఖ్యము లిచ్చగించి.
ఏను పతివ్రత - నీమాటలాడ
నౌన ? యాసించి నీ - యంతవానికిని " 1750
అని కేలఁ దృణమంది - యాగ్రహశోక
జనకమౌ బుద్ధిచే - జనకజపల్కె.
" నినుగూడి యేవేళ - నీవు మన్నించు
వనితలకైవడి - వారి వారికిని
మగలును గల రభి - మానముల్ గలవు
తగవును గలదని - తలఁపు ముల్లమునఁ
బరభామినుల గోర - భంగంబు వేల్పు
దొరకైన వచ్చు నీ - దు విభుత్వ మెంత ?
చెడుబుద్ధియేల ? నీ - చేటుచే లంక
చెడనున్నయది ! మేలు - చెప్పెదనీకు. 1760
కులమేల చెఱచెదు - కొంచెపుఁ దలఁపు
తలఁచి ? దీర్ఘవిచార - తను బ్రవర్తిలుము.
కలిమి బల్మిలు నాకుఁ - గనుపించి నీదు
తలవ్రాఁతచేత వ్య - ర్థముగఁ బల్కెదవు !

భానునితోఁ బ్రభ - వాయునే ? రాము
నేనేల మఱతు ? నీ - వెఱుఁగవుగాక
విప్రునకును వేద - విద్యనే పోలి
యప్రతిమప్రతా - పాధికుండైన
శ్రీరామవిభున క - ర్పింపుము నన్ను.
నేరముల్ చూడక - నిన్ను రక్షించు
శరణాగతత్రాణ - సద్ధర్మపరుఁడు
భరతాగ్రజుండు నా - ప్రాణవల్లభుఁడు !
బ్రదుకాస కలదేని - పరమకారుణ్య
సదనాత్ముఁడౌ రామ - చరణంబెదిక్కు !
రాముఁడు వింట న - స్త్రము పూనెనేని
నీ మాటమాత్రలో - నింద్రాదులైన
సురలతో భువనముల్ - చూర్ణంబు సేయు !
పరిహరింపఁగలేరు - బ్రహ్మాదులైన !
రామలక్ష్మణుల నా - రాచముల్ భుజగ
భీమంబులై లంకఁ - బెకలించి కూల్చి
దానవాన్వయమెల్ల - దహియించి నీదు
మేను వ్రయ్యలు జేసి - మేదినిఁ గూల్చి
తరువాత నను దత్ప - దద్వయ శోణ
సరసిజంబులఁ జేర్ప - జాలు నిక్కముగ !
శునకంబు బెబ్బులుల్ - చూచినరీతి
ననిలోన నినుఁజూచి - నవుడు రాఘవులు
దిగిరేసి వారల - దృష్టింప గలరె
నగవైరి నగచాప - నలినసంభవులు ?

ఎందుఁ జొచ్చెద వపు - డీవిట్లుగాక
ముందుగా రాముని - ముందర నన్ను
నపరాధినని యుంచి - నప్పుడె నిన్నుఁ
గృపఁజూచి రక్షించుఁ - గీడొంద వీవు!
కాకున్న భానుని - కరములు కొంచ
మై కనిపించిన - యంబువుల్ గ్రోలు
క్రమమున రఘువీర - కనక పుంఖాస్త్ర
సమితి నీరక్తముల్ - చవిచూడఁ గలదు !”
అను మాటలాలించి - యవనిజఁ గాంచి
దనుజనాయకుఁడు క్రో - ధమున నిట్లనియె.

—: రావణుఁడు సీత మాటలకుఁ గోపించి యామె ప్రత్యుత్తరమున కరువది దినములు గడువిచ్చుట :—

మగువలక్కై ప్రాలు - మాలి విరాళి
మగవారు చల్లని - మాటలాడినను
నంతంత బిగియుదు - రదివారి ప్రకృతి
ఇంతయు నీతల - నే వేగినది యె
మరుఁడు నీకతన నా - మది విరహాగ్ని
దరికొల్పఁ బుట్టదు - తాలిమి యింక !
సారథి విడివడు - జవతురంగముల
నేరుపుతోఁ బట్టి - నిలిపినయట్లు
కోరిక లెఱిఁగి చే - కూడనియట్టి
నారుల మీఁది మ - న్ననఁ దప్పువారి
వలరాజు తెగనీక - వారల మఱల
నలకలు దీర్చి మో - హములు గల్పించుఁ

గావున నామాట - గాదని యెన్ని
యేవలు పుట్టంగ - నీవు వల్కినను
దెగజాల నరువది - దినముల దనుక
మగువ! యీరెన్నెల్ల - మనసీయకున్న
నీవేళనాఁటికి - నిద్దుర లేచి
కావలెనన్న నా - కట్టడచేతఁ
జవులు మీఱఁగ బాన - సపు విరిఁబోఁడు
లువిద! వండుక తెచ్చి - యునుతురు నిన్ను
పొమ్మని" యప్పుడే - బోనకత్తియల
రమ్మని తనయుంగ - రము చేతికొసఁగ
వలదని కేల్వట్టి - వారించి చనవు
గలయట్టి దేవతా - కామిను లెల్ల
మండాడుటయు వారి - మనవి యాలించి
కొండంత కోపంబు - కొనుగుచుఁ దాళి
తలఁడని మఱల సీ - త మొగంబుఁ జూచి
వలవంత నున్న రా - వణుని యాగ్రహముఁ
గనుఁగొని చీరికిఁ - గైకోక మఱలఁ
గినుక పుట్టఁగ జాన - కీదేవి వలికె.
"ఏల? రావణ! నీకు - నింత చలంబు?
చాలింపు మింద్రుని - సతిఁ బట్టినట్లు
రామచంద్రుని గూర్మి - రాణివాసంబుఁ
గామించువానికిఁ - గలుగునే బ్రదుకు?
ఏనుఁగు ముందఱ - నెదురు కుందేలు
పోనోపునే గెల్చి? - భుజశౌర్య నిధినిఁ
గాలకంధర భీమ - కార్ముకభంగ

శీలుని వికచరా - జీవలోచనునిఁ
గోదండపాణి ర - ఘుశ్రేష్ఠు నెదిరి
యేదండఁ జేరెద ? - వెఱుఁగ వేమియను !
కామించి ననుఁ జూచు - కన్నుల నీకు
రామునిచే నీళ్లు - రాఁగల దింకి
జనకతనూజఁ గౌ - సల్యకోడలిని
మునిచర్య మెలఁగు రా - మునిదేవి నన్ను
నీమాట లాడిన - నిపుడె నీనాల్క
సీమవారలు చూడఁ - జీటి పోకున్న
ప్రియుఁడైన శ్రీరాము - పెంపుఁ దలంచి
నియమ భంగమునకు - నిలిచితిఁ గాక
నీవారితోడుత - నీలంకతోడ
రావణ ! నిమిషమా - త్రంబులో నిన్ను
శపథంబువల్కి భ - స్మము సేయఁగలను !
శపియించునది నాకుఁ - జనదని కాక
రాఘవుఁ బాపి చో - రప్రచారమున
లాఘవమ్మునకు నా - లయమైన నీవు
కాలంబు పెడరేఁప - గా నన్నుఁ దెచ్చి
ప్రేలెద విపుడు ద - ప్పినదేమి నీకు ?
కాకుత్‌స్థ తిలకులుఁ - గనరైరి కాక
పోకుండ నొక్కతూ - పున నీదు శిరము
ఖండించి నీవారు - ఖరదూషణాదు
లుండెడి యమపురి - నునుపరే నిన్ను !
తెలియక కాలచో - దితుఁడవై నీకు
నలవి కానివి పల్క - నగునె" యిట్లనిన

నాలించి సతులలో - నలరులు దివియ
లాలితంబైన క - ల్పక శాఖ యనఁగ
నపరంజి మొలత్రాట - నహిరాజుఁ జుట్టి
నపుడుండు మంథాద్రి - యందంబుఁ దోఁప
సొమ్ములు దాల్చియుఁ - జూడ భయంక
రమ్మయి సీత కా - రావణుమేను
కాచి పూచి ఫలించి - కడవాలు చేర
నోచని చోటీయ - నోహాకం బనఁగ
చాల నాగ్రహమునఁ - " జంపుడు దీని
మేలంబు చాలు నీ - మేలునుఁ జాలు
తవకు లోఁగాని నీ - తఁ బ్రభాతసంధ్య
నినుఁడు తేజముమాన్ప - నెన్నికమీఱ
రాముని మీఁది పో - రామిచే నన్ను
సామాన్యగా నెంచు - చలపాది నిపుడె
తెగవేతు " నని పల్కి - దిగదిగ వెలుఁగు
సగమొరఁ దిగిచిన - చంద్రహాసంబుఁ
గేలుతోఁ గూడ బి - గ్గ కవుంగలించి
మాలిమితో ధాన్య - మాలిని పలికె
" ఏలయ్య ! ప్రాణేశ ! - యీ సీతనీకు ?
చాలరే నీకు నీ - చంద్రాస్యలెల్ల !
వారేల ? నినుఁగూడి - వలరాచకేళిఁ
గోరికలెల్లఁ జే - కూర్పనే యేను !
జానకి మాత్రంబు - చక్కనిదానఁ
గానేమి ? మరులచేఁ - గనలేవుగాక !
త్రుంపుదునో పొందె - దో నన్ను ’ ననుచుఁ

దెంపుసేయుదురె ప - తివ్రతలందుఁ
దన్నునొల్లనిదానిఁ - దాఁ బైకొనంగ
నిన్నువంటి రసజ్ఞు - నికిఁ దగునయ్య ?
వల" దని హేతి నా - వలి యూడిగంపు
చెలియచేతికిఁ దన - చేఁదీసి యిచ్చి
తొలఁగఁ ద్రోచిన నవ్వు - తోఁ దనవెంటఁ
దలిరుఁ బాయపు దేవ - దానవ స్త్రీలుఁ
గొలువ నావలి కేఁగఁ - గోపంబుతోడఁ

—: తనచుట్టునున్న రాక్షస స్త్రీలు సీతను రావణుని కోర్కె నెఱవేర్చుమని నయభయముల బోధించుట :—

జలపాదియగు నేక - జట యిట్టులనియె.
" కలకంఠి ! బ్రహ్మకు - కశ్యపబ్రహ్మ
తొలిచూలు యలపుల - స్త్యుండు తత్సుతుని
సూనుఁడు విశ్రవ - సుండు విరించి
కా నయనిధి కగ్గె - నట్టి రావణునిఁ
జులకనగాఁగ నెం - చుట నీదు బుద్ధి
వెలితిగా కతనికి - వెలితిగాదెందు "
అనుమాట వెంబడి - హరిజట చేరి
తనవంతు కలియ సీ - తకు నిట్టులనియె.
" తనమాటలో జగ - త్త్రయమును మెలఁగఁ
బనిఁగొను దేవతా - ప్రభుల నితండు !
ఆరావణుఁడు నిన్ను - నాసించి చెంతఁ
జేరిన నొల్లమి - సేతురే ? నీవు
మదిలో వివేకంబు - మాని యాచలము

వదలవు! నిన్నుఁగా - వలసినవానిఁ
బరిహరించిన నీకు - పాపంబు రాదె?
ఎఱుఁగ వీతని కన్న - నెవ్వఁడున్నాఁడు?
నామాట హితమని - నమ్మి కావింపు
మో మానవతి! చలం - బుపసంహరింపు!
లేచి రమ్మ" నిన నా - లించి యాజాడ
చూచుక ప్రఘస భూ - సుతకు నిట్లనియె
"బాలవుగానఁ జే - పట్టక బిగువు
చాలించ..................దవు
నీకొద్ది వారలె - నిర్జరలోక
రాకేందు వదనలీ - రావణుచెంత
నుడిగముల్ చేసుక - యున్నట్టి వారు?
పడఁతి! నీచేసిన - భాగ్యంబు వలనఁ
జేరిన రావణుఁ - జేపట్టితేని
కోరికలన్నియుఁ - గొనసాగు నీకు
నెలనాఁగ! వలపురా - పెఱుఁగవుగాన
వలచెను నీకురా - వణుఁ డంతవాఁడు!
అతనినిఁ జేరి మా - యమ్మ నామనవి
హితముగాఁ గనుమన్న" - నెడ దూరి నిలిచి
ధర్మాసనము వల్కు - తగువరింబోలి
దుర్ముఖ జానకి - తో నిట్లులనియె
"ఇందరీవరేక్షణ! - యిదియేటి మతము!
మందమేలము లేల - మానవు నీవు?
రావణు నాజ్ఞ మీ - ఱఁగ నీవెకాదు
దేవతలకునైనఁ - దీఱునే చెలియ?

తనయింట మెలఁగునో - దక్షిణానిలము
నినుఁడు కాయునో - వెండి యెండలీవీట
కురియునో వానలు - కొలఁదికి మీఱి!
చరియింపవచ్చునో - శమనుని కిచట ?
వెలుఁగునో సెలవీక - వీతిహోత్రుండు!
కలఁగునో వారధి - కడలుబ్బి మొరసి ?
ఉరుమునో మేఘంబు - లురువడిగాఁగ ?
శిరములెత్తునొ మ్రోల - శేషాహియైన!
యేఋతువుల ఫలి - యించు వృక్షంబు
లేరు చాలోస్కకర - యిల పంట పండు
వాడనేరవు చుట్టి - నైచినపువ్వు
లీడెవ్వరీ రాక్ష - సేంద్రున కబల!
నీవెంత ? యతఁడెంత - యెక్కడికెక్క
డావల నీకెద్ది - యాధార మొకటి ?
చెప్పినయట్ల చే - సినగాని నీకుఁ
దప్పిపోవచ్చునె - తమచేతఁ జిక్కి ?
తెగఁ జాలకున్నచో - దెలియకున్నావు
దిగమ్రింగుదునొ పట్టి - తిత్తి యొలుపుదునొ !”
అనునంత మఱికొంద - ఱాచుట్టుఁ జేరి
జనకజఁ జూచి రో - షమున నిట్లనిరి
“అడవులలోపల - ననదవై చిక్కి
యిడుమలఁ బడి నన్ను - నెడవాసి నపుడె
బ్రదుకునో బ్రదుకఁడో - భామిని! యట్టి
యాదవమానిసి యడి - యాస లేమిటికి?
ఈతనిఁ జేపట్టి - యేనాఁడు నీదు

చేతులో వానిగాఁ - జేయక యేల
జేలవై నీబుద్ధి - పెడతల పెట్టి
మైల వాయక యిట్టి - మ్రాకు చేరితివి ?
మనుజకామిని గాన - మనుజునిఁగాని
మనుజాశనుని పొందు - మానుదునన్న
మానుదుమే నిన్ను - మర్దింపక" నిన
జానకి యాదైత్య - సతుల కిట్లనియె

—: సీత వారిమాటలకుఁ బ్రత్యుత్తరమిచ్చుట :—

"దనుజుల దనుజకాం - తలు మనుజులను
మనుజాంగనలు కోరు - మాట నిక్కువము
ఇలయెల్ల నేలిన - నిడుమలఁ బడిన
పొలఁతులకును దైవ - ములు ప్రాణవిభులు
రాముని చరణసా - రసములు గాక
నామది నేల య - న్యంబులు దలఁతు ?
ఛాయకు సూర్యుఁడు - శచికి నింద్రుండు
నాయరుంధతికి జో - డై వసిష్ఠుండు
రోహిణీసతికిఁ జం - ద్రుఁడు సుకన్యకు
నూహింపఁ జ్యవనుఁడు - నుర్వి శ్రీమతికి
కపిలమానియును స - గరుఁడు కేసినికి
కృపనేల దమయంతి - కిని నైషధుండు
జతగ సావిత్రికి - సత్యవంతుండు
శ్రిత చంద్రమతికి హ - రిశ్చంద్ర విభుఁడు
భామ కుంభజునిలో - పాముద్ర కెట్టు
కామింపఁ దగుదు రా - కైవడి చూవె

రామచంద్రుండె నా - రమణుండుగాక
కామింప నేర్తునే - కడ వాని నేను ?"

—: రావణుని ప్రేరణచే సీతచుట్టును గావున్న రాక్షస స్త్రీ లామెను రావణుని ప్రేమింపకున్న చంపెదమని భయపెట్టుట :—

అన విని యతి వికృ - తాకారులైన
దనుజ కామినులెల్ల - తను వెఱపింప
నాచోటు వాసి యా - హనుమంతుఁడున్న
పూచిన శింశుపా - భూరుహచ్ఛాయఁ
జేర నన్నియుఁ బరీ - క్షింపుచు నతఁడు
దాఁగిఁ గాకునికి చెం - తల వినుచుండఁ
గన్నీరు రాలంగఁ - గడకొమ్మ వట్టి
యన్నెలంతుక నిల్చి - యడలుచు నుండ
" నేఁటికి నడలెద ? - వేడ్వకు " మనుచు
వేఁట దీమముఁ బోలి - వనిత యిట్లనియె.
" నిద్దురయును గూడు - నీవు వర్జించి
ముద్దియ ! దినము రా - ముఁడు రాముఁడనుచు
పలవరించిన నేమి - ఫలమింత నీకు ?
సులభమె రావణా - సురునిఁ గాదనఁగ ?
ఏము మ్రింగెడు వేళ - నేమన నేర్తు ?
రాముఁడేకైవడి - రానేర్చు నిటకు ?
ఏల యీమరులు ? నీ - యెల జవ్వనంబు
బాల ! వీఱడిఁ బోవ - బ్రదుకాస పడవు !

ఇంకఁ గాదంటివే - నేనైతు నిపుడ
యంకిట నాఁకటి - యంకిలితీర !"
అనునంత వికట హా - స్మని ముష్టివట్టి
తనకేలు పొడవెత్తి - దండకుఁ జేరి
"ఎవ్వరు వలదన్న - నేమాన దీని
క్రొవ్వు మాన్పక!" యంచు - కోపించి పలికె.
"సీత ! నీకొఱకు బ్రము - చ్చిలిపోయి సగము
రాతిరివేళ మా - రావణాసురుఁడు
మారీచుఁ బురికొల్పి - మైడాఁచి నిన్ను
కోరి వేడియుఁబట్టు - కొని వార్ధిదాఁటి
మోచుక తెచ్చి యీ - మూలలఁ బెట్టి
కాచియుండగ మమ్ముఁ - గట్టడచేసి
యీపాటు బడుటెల్ల - నేనొల్ల ననుచుఁ
బాపజాతివి నీవు - పలికెదు కొఱకె ?
రాముఁడు నిన్ను జే - రఁగ సమర్థుండో ?
కామించి తెచ్చురా - క్షస నాయకుండు
ఒప్పక విడుచునో ? - యో యమ్మ ! చాటి
చెప్పితి చెప్పితి - చేతనైనట్లు
యెటులైనఁ దప్పులే - దిఁకమీఁద మాకు
చిటుకవైచిన యంత - నేపునేఁదాళ
నామీఁది ఫలము నీ - వనుభవించెదవు !
మామాట విని నాదు - మనవి యీడేర్పు
మీ రావణునకు నీ - విల్లాలవైన
నోరామ ! నిన్ను మం - డోదరి మొదలు
వెలఁదులు గలరేదు - వేలు రావణుని

కులకాంత లందఱు - గొలిచి యుండుదురు ।
ఒప్పుమీ" వనిన చం - డోదరి కంట
నిప్పులు రాలంగ - నిశిత శూలంబుఁ
గేల జాడింపుచుఁ - గిటకిట పండ్లు
చాల గీఁటుచు వచ్చి - జనకజ కనియె
" వీరి వారిని బోలె - వికటముల్ వలికి
పోరాదు నీకు నా - బుద్ధులు వినక
చెడనేల ? రావణుఁ - జెట్ట వట్టెదవు
కడిచేసి నిన్నునాఁ - కటికి మ్రింగుదును
నేరవు మాతము - నీవిందు నొకటి
యేరుచు కొమ్మన్నా - కెట్టులైన లెస్స !"
అనునంతఁ బ్రఘస "యీ - యవనీతనూజ
మన రావణునిఁ దీర్చి - మాఱుమాటాడె !
అందుకు నజ్ఞ యీ - యలివేణి కుతికె
ముందుగాఁ గఱచి రా - మునిఁ గూడుమనుచు
నెత్తుఱుఁ ద్రావుదు - నేనన్న" నగరి
యుత్తరు వడిగి రం - డొకమాటు మీఱు"
అన యజముఖి వల్క - నందఱికన్న
మునుపుగా శార్దూల - ముఖి యిట్టులనియె
" సెలవిచ్చె రాక్షస - శేఖరుం డిపుడు
' చెలిమి రమ్మ 'ని నాదు - చెవిలోనఁ జెప్పె
అడపంబుఁ గట్టెడి - హారిణియే సాక్షి
తడవేల యిదిమన - తామసంబింతె
సీత యంగములెల్ల - చేరి నూరీల
కోత మిప్పుడె పంచు - కొంద మింపఱము

పంచంగనేల ? యీ - బలు రోటవైచి
దంచి సంబారసై - దంబులు వైచి
పాలవెంబడిని కు - ప్పలు చేసి తిండ
మేలకిపాడి చల్లి - మెళనీళ్లు తెండు !
బందించి కాళికిఁ - బట్టిన పెద్ద
బిందె సారాయి కో - ప్పెరలోని కల్లు
తోలువాఱ్ప నాల్కల - దుప్పుదుల్ దీఱఁ
జలిదీర మనుజ మాం - సంబున్న యఁపుడె
వేగుజామాయె తే - వే యేకపాద
యోగిని ! చండి ! లం - బోదరి ! వికట ! 2060
ఏకాక్షి ! గజపుచ్ఛ - వృకముఖి ! కాళి !
ఘూకనేత్రి ! యజిహ్వా ! - గోముఖి ! వ్యాఘ్రి
కుసుమాలంబుచే - నిప్పుడే వరవి
లాసంబుల నికుంభి - లావనిలోనఁ
జిందులాడుదమని " - చిమ్మి రేఁగుటయు
నందఱి నీచోక్తు - లాలించి జడిసి

—: సీత వారిమాటలకు శోకించుట :—

చేతొమ్మ వదలిహా ! - శ్రీరామ ! రామ !
హాకైక ! హాకోస - లాత్మజ ! భరత
హాలక్ష్మణా! " యని - యవనిపైఁ బొరలి
జాలిచేఁ దాలిమి - చాలక వేణి 2070
యిలమీఁద జీరాడ - నేడ్చుచు జలధిఁ
గలము చందంబునఁ - గంపమొందుచును
" పోవ నేలకొ ప్రాణ - ములు మేన నింక ?

ఈవేడుకలు చూడ - నీడిగిల్లెదునో ?
ఎంతకు నోర్చితి ? - నెవ్వారి నిట్ల
కాంతుల నెడవాపి - గాసిఁ బెట్టితినో ?
ఆరాఘవునిఁ బాసి - నప్పుడు జావ
నేరని తనకు ని - న్నియును గావలయు !
బలిమిఁ జావఁగరాదు - పతియాజ్ఞ లేక
బొలియును గాదేది - బుద్ధియో తనకు ?
మాటలేకాని చం - పరు వీరలైన
చోటివే భూదేవి ! - చొత్తు నీలోన !
ఖరదూషణాది రా - క్షసుల మర్దించు
శరచాపములకు మో - సము వచ్చెనేమొ ?
మఱచెనో నను ? నేల - మఱచుఁ గారుణ్య
శరనిధి నమ్మిదా - స్యము సేయుదాని ?
ప్రిదిలెనొకో తన - బిరుదంబు చేయి
వదలక చేపట్టు - వారిఁ గాచుటలు ?
తెలియకున్నట్టి నా - తెఱఁ గెవ్వరైనఁ
దెలివిడి చేసి కీ - ర్తివహింపరొక్కొ ?
యెంత లేదనియెనో - యేఁటికి తనదు
పంతంబు మాను నా - ప్రాణనాయకుఁడు ?
రాఁ లేఁడో జలధిపై ? - రాక తదస్త్ర
కీలికి వార్ధి యిం - కించుట యెంత ?
నాకడ్డపడియెనో - నాయదృష్టంబు
రాకుండ నరికట్టి - రఘురాముఁగాచి ?"
అనియాస చాలించి - యసుర భామినులఁ
గనుఁగొని మఱియుఁ గొం - కక యిట్లు పలికె

—: సీత రాక్షసాంగనలతో తనమనోనిశ్చయముఁ దెలుపుట :—

"రోసితి ననుఁడు మీ - రు దశాస్యుఁ జార
వేసితి ననుఁడు నా - విభునకు జడిసి
చంపుదు ననుఁడు నా - స్వామిచే తనకు
తెంపుగల్గినవచ్చి - తెగవ్రేయు మనుఁడు
మీరైనఁ గత్తుల - మెడఁ గోయుఁ డొక్క
పారిగా మ్రింగి మీ - పగఁ దీర్చుకొనుఁడు.
ఉనికితిరే జటా - యువు మూర్ఛఁ దెలిసి
నను వెదకుచు వచ్చు - నాస్వామితోడఁ
దెలుపక మానఁడి - త్తెఱఁగెల్ల నేమి
దలఁచుక యున్నాఁడొ - దశరథాత్మజుఁడు ?
వచ్చిననడ్డమే - వారిధి తనదు
చిచ్చఱకోలల - చే బీడుచేసి
శరపరంపర సరా - క్షసముగా లంక
నుగ్గుమయిపో దహా - నునికి నర్పించి
రావణుఁ బుత్రమి - త్రకళత్ర యుతము
గావధియించు నే - గమె వచ్చుననుఁడు !
తనకు మృత్యువు చేర - తఱియయ్యెఁగాన
కనుగల్గి యుండవే - గమె పల్కుఁడరిగి
ఏనున్నకై వడి - నీనీచ నగరి
మానవతీమణుల్ - మఱి దిక్కులేక
రాముని నగరి కా - రాగృహాంతమున
సేమముల్ మాని వ - సింపుదు రనుఁడు

యీలంకలోపల - నింటింట సతులు
రాలఁ గన్నీరు తీ - అని దుఃఖములను
దమవారు రాఘవా - స్త్రములచేఁ బడిన
క్రమమున శోకింపఁ - గా వీనులలర
నవి లెస్స వినికాని - యంటమున్న గాఁగ
రవివంశతిలకుఁ జే - రఁగఁ బోవననుఁడు!
మితికట్టిపోయె నీ - మీఁద రెన్నాళ్లు
నితఁడన్ని నాళ్లుండు - నేతనయుంట?
కాదన విషమింత - కైకొనిరందు
నాదు విచార మం - తయుఁ దీఱు! గాని

యామాట వినిరాముఁ - డసువులఁ బాసి
యామఘువుని వీటి - కరిగిన నచటి
సురలెల్ల రాఘవుఁ - జూచి సంతోష
భరితులై యానంద - పరులు గానిందు!
రామునిఁ గాంచువా - రలదె పుణ్యాంబు
రామునిఁ గొలుచు వా - రలదె పుణ్యాంబు!
శ్రీరాముఁ జేర్కొను - జిహ్వయే జిహ్వ!
ఆరాఘవుని దేవి - యైనట్టి నన్ను
వీఁడేమి సేయును? - విచ్చలవిడిగ
వేడిపల్కులు బల్కి - వెఱపించి నన్ను.
మీఁ రేమి సేతురు? - మీరు చింతించి
చేరరాకుఁడు వల - సిన జీవనములు!
ఏటికి రాఁడొకో - యిన్నాళ్లు? నాదు
మాట వాకొనఁడో ల - క్ష్మణుఁడు దానైన॥
శత్రుసన్యాసంబు - సల్పెనో! కాక

యస్త్రముల్ పనికి రా - వయ్యెనో తనకు
చంపెనో వారి మో - సముచేసి వీఁడు ?
తెంపు సేయఁగఁ జేతఁ - దీఱకున్నదియె ?
ననుబాసి తానుండు - నారాముఁ డెంత
పనిమైన నెఱుఁగఁడె - భావశీలములు ?"
అనుచుఁ గ్రమ్మఱఁ గను - లందు నశ్రువులు
చినుకంగఁ దలవాంచి - సీత యున్నంత
నారామ హృదయమ - య్యాసుర వనిత
లారావణునితోడ - నడియాసతీఱ
నెఱిఁగింతమని కొంద - ఱేఁగిరి నిదుర
తరిదప్పెదనుచు కొం - దఱు కూర్కొనిరి
"మనచేతఁ దీఱదీ - మానిని హృదయ
మనురాగ మొందింప - నలయింపనేల !
చేతనైనట్లు చూ - చితిమింక బ్రహ్మ
చేతను మఱలింపఁ - జెల్లదీమనసు
యురకుండుఁ" డను నంత - నొకచెంత నిదుర
గురువెట్టుచుండి గ్ర - క్కున లేచి త్రిజట

—: త్రిజట తన స్వప్నవృత్తాంతముఁ జెప్పుట :—

"అమ్మక చెల్లి! ని - ట్టట్టని మీరు
క్రమ్మక సీతను - గాసి సేయకుఁడు !
ఓయమ్మలాల ! నే - నొకకలఁ గంటి
నీయమ్మ తెరువిక - నేల పోయెదగు ?
కలయనరాదు ని - క్కలగాని నాదు
పలుకు నమ్ముఁడు మీఁదు - పరికించుకొనుఁడు !

చెడనున్నయది లంక – శ్రీరాముపాలఁ
బడనున్నయది సీత – పదర నేమిటికి ?"
అన విని "యక్కక్క ! – యాకల మాకు
వినుపింపు మందఱు – వినఁగ వేడితిమి.
అంతియె చాలు భా – గ్యంబుఁ జేసితిమి
సంతోషమయ్యె నీ – స్వప్నంబు తెఱఁగు
వినుపింపు "మన దాన – వీశ్రేణితోడ
వినుఁడని త్రిజట య – వ్విధమెల్లఁ బలికె.
"ధవళచందనవస్త్ర – ధామముల్ దాల్చి
నవనవంబైన దం – తపు పల్లకీని
యీసీతతోఁ గూడి – యెల్లరు గొలువఁ
గౌసల్యపట్టి రా – ఘవుఁడు రాఁగంటి
ఛాయతోఁ గూడు భా – స్కరుని చందమున
నీ యమ్మతోఁగూడి – యినకులోత్తముఁడు
వెల్లయేనుఁగు మీఁద – విరుల లాజలను
జల్లుచుఁ బురసతుల్ – సందడిసేయ
ధవళాతపత్రంబు – తమ్ముఁడు దాల్ప
రవివంశరత్నంబు – రాఁ గలఁగంటి !
ఎనిమిది వృషభంబు – లెనిమిది దిక్కు-
లను గట్టినట్టి తె – ల్ల రథంబులోన
సీతాసమేతుఁడై – శ్రీరామచంద్రుఁ
డే తేర వేకువ – నేఁ గలఁగంటి !
జనులనందఱిఁ బ్రోచి – శత్రులఁ గెలిచి
తన పెంకియైన శ్వే – తద్వీపమునకు
పట్టాభిషిక్తుఁడై – పడఁతియుఁ దాను

నెట్టుక యుండఁగ - నేఁ గలఁగంటి !
ఆదినారాయణుఁ - డక్షరుం డభవుఁ
డాదిమధ్యాంత శూ - న్యస్వరూపకుఁడు
ఆరాముఁడనియు నీ - యవనితనూజ
శ్రీరామయనియున - శేషదేవతలు
భజియింప దివ్యపు - ష్పకముపై వీరు
విజయంబు సేయుచో - విబుధకామినులు
నుడిగంబు లొనరింప - సోదరుఁగూడి
కడిమి నయోధ్య కేఁ - గఁగ కలఁగంటి!
మనరావణుఁడు రక్త - మాలికఁ దాల్చి
ఘనమైన ఖరముపైఁ - గాంతలఁ గూడి
తలనూనె వడియంగ - దక్షిణ దిశకు
వెలువడి తరువాత - వేసడంబులను
కట్టిన తీరెక్క - కంధరయందుఁ
జుట్టిన రక్తప్ర - సూనమాలికల
నెట్టని క్రోకల - నేఁగుచు నొక్క
మిట్టన జారి భూ - మినిఁ బడిలేచి
వికవిక నవ్వుచు - వెట్టియుఁ బోలి
యొకఁడును బలురొంపి - యొలంబులోనఁ
బడి తన్నుకొనువేళ - భామినుల్ చేరి
మెడఁ ద్రాడుగట్టి దొ - మ్మిగఁ జేదుకొనఁగఁ
గలఁగంటి నదిగాక - కాళియోయనఁగ
బలురక్కసి యొకర్తు - పాశవల్లరులఁ
గుంభకర్ణుని గట్టు - కొని యింద్రజిత్తు
కుంభనికుంభాది - ఘోరరాక్షసుల

తలల నూనియలును - ద్రావుత్తెలములు
గలవారి తలవెంట్రు - కలు వట్టి యీడ్చి
కొనిపోవఁ గల కంటి! - కుంభకర్ణుండు
మునుపుగా లొటిపిట - మూపుపై నెక్కి
కడల రావణుఁడు సూ - కరముపై నతనిఁ
గదిసి నక్రము మీఁద - కడ నింద్రజిత్తు
నితరకుమారకు - లిరుగడఁ బోవ
సతులార! యీకాని - స్వప్నంబుఁ గంటి!
నలుగురు మంత్రులు - నలుగడఁ దన్ను
గొలిచిరాఁ దెల్లని - కుంభిపై నెక్కి
పూవులు భూషణం - బులు దాల్చి లంక
సీ విభీషణుఁడు రా - నేఁగలఁగంటి!
గోపురంబులతోడఁ - గోటలతోడ
నీపట్టణము నార్తి - నిప్పుడే పడఁగ
నొకపేడ మడువులో - నురకరావణుని
మొకము క్రిందుగఁ బడి - మునిఁగిపోవంగ
నొక కల యేఁగంటి - నోయమ్మలార!
ఒకనాఁడు నిటువంటి - యుత్పాత మెఱుఁగ!
ముందుగా వచ్చిరా - మునిదూత యొకఁడు
బందికాఁడై లంక - భస్మంబు చేసి
జానకి నూరార్చి - చనియె నటంచు
నేనొక్క కలగంటి - నిదియేల తప్పు?
ఎడమ కన్నదరెడు - నిపుడు సీతకును
కుడికన్నులదిరె మీ - కును నాకు నిపుడు
సేమంబు సీతకుఁ - జెప్పె నీపుడే

యేమి కాఁగలదిరొ ? - యెఱుఁగమేమియును
నడుగులకును మ్రొక్కఁ - డభయముల్ వేడుఁ
డుడిగముల్ సేయుఁ డ - య్యుత్తమాంగనకు !
అమ్మ ! మానేరంబు - లన్నియు సైచి
నమ్మింపు మనుఁడు మి - న్నక యుండరాదు !
రావణు మరణంబు - రఘురాము గెలుపు
నేవిధంబునఁ దప్ప - దెఱిఁగి వర్తిలుఁడు."
అనిన దానవ కాంత - లందఱు దొలఁగి
కనులను ముకుళించి - కడలు నిద్రింప
ననుమానముఁ జిక్కి - యవనితనూజ

—: సీత తనకు మరణముకన్న వేఱుమార్గము లేదని యురి పోసికొన నిశ్చయించుట :—

" తనకేది బ్రతుకు దై - త్యస్త్రీలచేత ?
నిందు గర్భముల జ - న్మింపని సుతుల
ఖండించి తివియు మం - గళియును బోలి
కోసి తెప్పించు నా - కొంటి నే ననుచు
నీసున రావణుఁ - డింతులచేత !
రాముఁడీ వేళకు - రాకున్నఁ దాళఁ
డీమీఁద మఱియుండి - యేమిటిదాన ?
కైకయై వెనక మృ - గంబయి వచ్చి
నాకర్మ మిట్లు ప్రా - ణమునకుఁ దెచ్చె !
తనదు పాతివ్రత్య - ధర్మశీలంబు
చెనఁటి వానికిని జే - సినమేలు వోలి
ఫలియింపదయ్యె ! నా - ప్రాణనాయకుని

పలువఁ జేసె తదేక - పత్నీవ్రతంబు!
శ్రీరామ! తండ్రితోఁ - జేసినపూన్కిఁ
దీటిచి యమరావ - తికి నింద్రునట్లు
నీవయోధ్యకు నేఁగ - నీతోడఁ గూడి
కావలిసినయట్టి - కామితార్థముల
ననుభవింపుదునని - యాసించి యుంటి!
తన పుణ్యమీయవ - స్థల నొందఁ జేసె!"
అని జీవనంబుపై - నడియాస విడిచి
యనుమానములు మాని - ప్రాణముల్ విడువ
నే యుపాయములేక - యిచ్చఁ జింతించి,
వేయేల? యితరముల్ - వెదుక నాక"నుచు
మెడచుట్టు బిగియించి - మిగిలినయట్టి
జడ తటాలున లేచి - శాఖను గట్టి
వ్రేలెద ననునట్టి - వేళ 'యీ తెగువ
చాలింపు'మను శుభ - శకునముల్ వినియె
కలకల దక్షిణ - గాళి చందమునఁ
బలికె చాటున నుండి - పవమానసుతుఁడు.
చెంపచేఁ గదలిన - చెందమ్మి కరణి
నేపు చూపుచు సీత - యెడమ కన్నదరె
దశరథాత్మజునకుఁ - దలగడయైన
శశిముఖి దాపలి - సందిలియదరె.
ఇదివచ్చె రఘురాముఁ - డీక్షింపు మనిన
కదలిక వామోరు - కదిలి చలించె.
తనుదాన మైలవ - స్త్రము కొంతజాఱె.
కనుపించెఁ దనయందు - కడలందు మఱియుఁ

శకునసంతతి మన - స్తాపంబుఁ దీఱ
రకమయ్యె వజ్రకో - రకరదాంకురము!
వలిగాలిఁ జివురాకు - వడఁకిన యట్లు
చలియించె నధరంబు - జానకీసతికి!
గ్రహణ పర్యవసాయి - కైరవిణీశు
రహిగన్న వదనసా - రస వికాసమునఁ
బంకజాననశుక్ల - పక్షత్రియామ
పొంకంబుఁ దాల్చెఁ బ్ర - భూతహర్షమున
జడముల్లి వదలించి - జగతిపైఁ గొంత
యడియాస గూర్చున్న - యాసమయమున
రావణు రాకయు - రాక్షసాంగనల
కావలి కట్టడల్ - గాసిఁ బెట్టుటలు
కలగని త్రిజట మే - ల్కని వల్కుటయును
కలఁగని మనసుతోఁ - గడు తెంపుచేసి
శుభశకునంబులు - చూసినసీత

—: హనుమంతుఁడు సీతతో మాటాడుటకిది మంచి సమయ మని తెలిసికొని ముందు వెనుక లాలోచించుట :—

అభిరతియును గాంచి - యమరనాయకుని
వనములోఁ గాపున్న - వనలక్ష్మి బోలి
కనుపట్టుచున్నట్టి - కల్యాణితోడ
తనరాకఁ బవమాన - తనయుఁడు దెలుపఁ
జను నిప్పుడని "మంచి - సమయంబుగాన
మాటాడుదునొ చేరి? - మాటాడకున్న
నూటిఁ దప్పను సీత - సోఁకోర్వదింక ?

మానవోక్తులుగాని - మాజాతివార్త
లేనారి యెఱుఁగలే - దిట్టి వేషమునఁ
గనిపించుకొన్న రా - క్షసమాయ యనుచు
మనసొగ్గి నాతోడ - మాటాడ దిపుడు.
ఏను భాషింపుచో - నెవ్వతెయైన
దానవి యెఱిఁగిన - దశముఖుతోడఁ
జెప్పిన వాఁడు వ - చ్చి రణంబు సేయు.
తప్పును కార్యంబు - తన కొక్కఁడైన
వానిఁ జంపుకు రఘు - వర్యుఁడు పూను
పూనిక వ్యర్థమౌ - పోనీకవాఁడు
కట్టివైచిన దివా - కరసూతి మాట
పట్టును దప్పు నీ - భామిని వెదక
నలుదిక్కులంచు వా - నరులను బంపెఁ
దొలుత సుగ్రీవుఁడం - దుల నే నొకండఁ
గంటిని వైదేహిఁ - గాంచినవార్త
యుంట వారికిఁదెల్ప - నొకరుఁడు లేడు.
ననునంపి మదినమ్మి - నారాకఁగోరి
వనధితీరమునందు - వానరప్రభులు
అంగదజాంబవ - దాదులు చాల
పొంగుచుందురు వారు - పొలసి పోవుదురు !
ఊరకే రఘుపతి - యున్నదిక్కునకుఁ
జేరి నేసీతఁ జూ - చితి నంటినేని
గురుతేమియైన నా - కును లేకయున్న
పరమార్థమని నమ్మి - పలుకియ్యకొనఁడు !
పోవకుండఁగరాదు ! - పోరాదు ! సీత

భావంబుఁగాంచి నా - పలుకు నమ్మించి
యుంగరంబొసఁగి యా - యువతినిఁ గనిన
యంగమచ్చమున కే - మైనఁ గైకొనుచు
నామీఁద తోఁచిన - యది నడిపించి
స్వామికార్యముఁ దీర్పఁ - జనుట యుత్తమము.
అందుకు తగిన పూ - ర్వాగమంబెల్లఁ
గందువగాఁగ ని - క్కడనుండి పలుక
నామీఁది నడఁచిన - యది చూత" మనుచు
రామప్రశంస పూ - ర్వమునఁ గావించి
సీతకు నొయ్యన - చెవిసోఁక సరళ
రీతిగా నలకేస - రికుమారుఁడనియె.

—: సీతవినునట్లుగా హనుమంతుఁడు
రామప్రశంస చేయుట :—

"మనువంశమణి నీతి - మార్గకోవిదుఁడు
జననుతకీర్తి యి - క్ష్వాకు వంశజుఁడు
తపనసంకాశుండు - దశరథనృపతి
తపముల జపముల - దానయాగములఁ
గోరి కాంచిన పెద్ద - కొడుకు రాఘవుఁడు
కారుణ్యనిధి కార్ము - కకళావినోది
స్వజనరక్షణశాలి - సత్యసంధుండు
సుజనసన్మాన్యుఁడు - సుదతియుఁదాను
తమ్ముఁడు వనులకు - తలిదండ్రులాజ్ఞ
సమ్మతించి విరాధుఁ - జక్కడగించి

పంచవటీస్థలి - భామినితోఁ జ
రించునప్పుడు ముని - శ్రేణులఁ బ్రోచి
దురములోపల ఖర - దూషణాదులను
బొఱిగొని తరుణి పం - పున మాయలేడి
పట్టెదనని రఘు - పతిత్రోవ నజుని
కట్టడచేత ల - క్ష్మణుఁడు దొలంగ
వంచించి వచ్చి రా - వణుఁడింతిఁ బట్టి
కొంచుఁ బోయిన రాచ - కొమరులు వెదకి
యువిదఁ గానక జటా - యువుచేతఁ దెలిసి
రవిసూనుతోడ పో - రామి వాటించి
వాలిసిఁ బడనేసి - వానరరాజ్య
మేలించి సుగ్రీవు - నింతితోఁగూర్చి
యాయన బలముల - నన్నిదిక్కులకు
జాయను వెదకిరాఁ - జనుఁడని పనుప
దక్షిణదిశకుఁ గొం - దఱు నేమువచ్చి
పక్షీంద్రుఁడైన సం - పాతి మాటలను
నగునో కాదో నిశ్చ - యము లేక చేరఁ
దగవు గాదనుచు నిం - తట నున్నవాఁడ
మ్రానిపై" నని హను - మంతుఁడు వెనుక
మౌనముద్రవహించి - మాటాడకున్న

—: సీతయామాటలనువిని వితర్కించుట :—

వెఱఁగంది జనకజ - విని మోముమీఁది
కురులు చక్కఁగఁ ద్రోచి - కుజముపైనున్న

వానరంబునుఁ జూచి - వానరుఁ డెట్లు
మానిసి కైవడి - మాటాడ నేర్చె ?"
అని విచారింపుచో - నవనియు దిశలు
వినువీథియుఁ జాల - వింత గాఁ గనుచు
తెల్లనితోఁకయుఁ - దీగె క్రొమ్మెఱుఁగు
తల్లియై కెంజాయఁ - దగుగాత్రయష్టి
పుత్తడి జిగిఁ దేఱు - భుజములు క్రొత్త
లత్తుక చాయల - లపనంబు పచ్చ
పిల్లికన్నులు గల్గు - పెనుగ్రోఁతిఁ జూచి
తల్లడిల్లుచు రాముఁ - దలఁచి తలంచి
"కలగంటినో కాక ? ని - క్కమొ ?"యని భ్రమసి
కలవరింపుచు సీత - గడియ మూర్ఛిల్లి
తెలివిడి నొంది "క్రో - తినిఁ గలగంటి
కలలోనఁ గ్రోఁతులఁ - గనినఁ గీడనుచు
వినియుందుగాన నా - విభుఁడైన రాఘ
వునకు సోదరుల ము - వ్వురకు నాతండ్రి
జనకభూపతికి వి - చారముల్ లేక
మనవలె!"నంచు ప - ల్మారు దీవించి
కల నిద్రలేక యే - గతిఁ గంటినిపుడు
కల నిద్రయెల్ల రా - ఘవుఁడె కైకొనియె!"
అని "రామ! రామ! రా - మా!"యంచు సారె
పునరుక్తములుగాఁగ - భూమిజ పలికి
"ఆడునే వానరుఁ - డకట! యీమాట
లాడక మఱి యెవ్వ - రాడి రిందుండి ?
ఇటు లెవ్వరాడిన - యేవిన్నయట్టి

యటువంటిదే సత్య - మయ్యెనుగాక !
మంచిమాటకు నను - మానింప నేల ?
ఎంచ దైవంబుతో - డింక నానేమి ? ”
అనుమాటలోన శా - ఖాగ్రంబు డిగ్గి
జనకతనూజాత - చరణాబ్జములకు
సాగిలి మ్రొక్కి యం - జలిచేసి భక్తి
యోగంబుతోడ వా - యుతనూజుఁ డనియె.

—: హనుమంతుఁడు సీతకు నమస్కరించి మాట్లాడుట :—

“ అమ్మ ! యిట్లు మహీరు - హచ్ఛాయ నొంటి
కొమ్మ వట్టుక కన్నుఁ - గొలుకులయందు
వెలిదమ్మితేకుల - విరిదేనె చిందు
నలవున నుడివోని - యశ్రులురాల
నేమి హేతువు ? నీకు - నిచ్చోటనుండ
నేమిటి ? కెవ్వరి - యెలనాఁగ వీవు ?
అమరభామినివో ! వి - ద్యాధరయక్ష
రమణివో ! కిన్నర - రాజీవముఖివో !
గారుడకాంతవో ! - గంధర్వసిద్ధ
నారీలలామవో ! - నాతి ! వాకొనుము.
తెలియఁ జూచితి వన - దేవతవనుచుఁ
దలఁచెద నెవ్వరి - దానవు నీవు ?
హరిణాంకు నెడవాసి - యవనికి డిగ్గి
తిరిగి పోలేక చిం - తించు రోహిణివో !
పంతంబు డించుక - ప్రణయ కోపమునఁ
జెంత వసిష్ఠుఁ బా - సిన యరుంధతివో !

ఎవ్వారు తలిదండ్రు - లింతి? నీకాంతుఁ
డెవ్వాఁడు? నీకుఁ బే - రేద్ది? యేర్పఱుపు
మీరాజునో చింత - నిందాఁక నీకు
పేరుకొంటివిగాన - పృథివిపై నీదు
యడుగులు సోఁకిన - యందుచేఁగట్ట
వెడలు గన్నీటిచే - వేదనఁ బుట్టు
నెమ్మోము చెమటచే - నీవు వేలుపుల
కొమ్మవు కావని - గురుతెఱింగితిని!
మానవాంగన వను - మానంబులేదు
కాననెవ్వరిఁ బాసి - గాసి నొందెదవు?
లలితతావక శుభ - లక్షణావళులు
తలఁచి చూచిన మహీ - తలమెల్ల నేలు
పట్టభద్రుండు చే - పట్టంగఁ దగిన
యట్టి సాధ్వివి గాని - యన్యవుగావు!
ఈరావణుఁడు మాయ - నెత్తుకవచ్చు
శ్రీరాము దేవేరి - సీతవీవైన
తెలుపుము కాదేని - దీనవై యింత
కలఁగు నేజయ శీల - గౌరవశ్రీలు
తరగక యుందువే? - తరుణి! యట్లగుటఁ
బరమార్థమిది రామ - భార్యవే నీవు!
అతిమానుషంబైన - యట్టి యీపాటి
యతిశయ సౌందర్య - మదియేల కలుగు
కడమ తొయ్యలులకు? - గావునఁ దెలియ
నుడువుము నాదు వీ - నులు చల్లగాఁగ."

అనవిని శ్రీరాము - నంకించి పొగడు
వనచరోత్తమునితో - వైదేహి పలికె

—: సీత హనుమంతునితో సంభాషించుట :—

జనక భూపాలుఁడు - జనకుఁడు నాకు
మనవంశనృపనభో - మణి దశరథుఁడు
నామామ లోకైక - నాయకుఁడైన
రామచంద్రుండు నా - ప్రాణనాయకుఁడు
కౌసల్యమాయత్త - గారు మరందు
లానుమిత్రా పుత్రు - లాభరతుండు
ఏను మాయత్త వా - రింటికిఁ జేరి
యానగరము ద్వాద - శాబ్దముల్ సకల
సంతోషమున నుందు - సమయంబు నందు
చింతించి దశరథ - క్షితిపతి రాము
నభిషేక మొనరింప - యత్నంబు సేయు
విభవంబుఁ గైకేయి - విని యోర్వలేక
వరమడిగిన సత్య - వాది మామామ
తరుణిపై మిక్కిలి - దయవాఁడుగాన
నడవులకును దన్ను - ననిచిన నన్ను
నడలార్చి రఘువీరుఁ - డత్తఁ జెంగటను
నను నుండుమని పల్క - న సహింపలేక
తనవెంట నేవచ్చె - దనటంచు నడల
ననుమతి నాకిచ్చి - యటమున్నుగాన
తనవెంట నాసుమి - త్రాకుమారకుఁడు

పయనమై యున్నఁ జే - పట్టి యిర్వురను
రయమునఁ దోకొని - రఘుకులోత్తముఁడు
దండకాటవి నుండ - దశకంధరుండు
కండక్రొవ్వున మీఁదు - గానకనున్న
మావారిఁ గికురించి - మాయలు వెంచి
చావందలంచి వం - చనచేత నన్ను
చెఱవట్టి తెచ్చి యుం - చినవాఁడు బ్రదుకు
దరముగాదింక నీ - దశకంఠు చేత
రెండు నెల్లకు సంహ - రించును గడువు
నిండకమునుప వీ - నివధింప లేరు
మావారలనుచు నే - మరిగెద" ననిన
నావధూమణితోడ - హనుమంతుఁడనియె

—: హనుమత్సీతా సంభాషణము :—

" శ్రీరామచంద్రుండు - సేమంబుతోడ
నోరమణీమణి ! - యున్నవాఁడిపుడు
నిను జూచి రమ్మని - నీప్రాణవిభుఁడు
పనిచిన నమ్మిక - బంటను నేను
నీచందమారసి - నీవున్నచోటు
చూచి నీతోడను - శుభవార్తఁ దెలిపి
రమ్మని పనిచె నో - రమణి ! లక్ష్మణుఁడు
ముమ్మారుగా నీకు - మ్రొక్కితిననుచు
వినిపించు మనియె నా - వృత్తాంత మిట్టి"
దని పల్కుటయు విని - యది నమ్మలేక

యాస యుండదుగాన - హనుమంతుఁజూచి
యాసీత మధుర వా - క్యముల నిట్లనియె
" మదిచూడవేడి యీ - మాటలాడితివి
బ్రదికి యుండినఁ గల్గు - భద్రంబులెల్ల
సేమంబెకాక మా - శ్రీరామ విభున
కేమి కొఱంత ? నీ - వెఱిఁగిన పాటి
యేను నెఱుంగుదు - నింతియచాలు !
వానరోత్తమ ! మేలు - వార్తఁ దెచ్చితివి !"
అనిపల్క నిజముగా - నాడిన దనుచు
జనకజఁ జేరఁగఁ - జనుదేరఁ జూచి
యదియు రావణుఁడుమా - యావిర్యై తన్నుఁ
గదియుచున్నాఁడని - కరపల్లవమునఁ
బట్టిన కొమ్మునఁ దాఁ - బట్టూడి వదల
నట్టిచోనిలిచె న - య్యెడఁ గూరుచుండి
తలవాంచియున్నఁ జెం - తను గేలు మొగిచి
నిలుచున్నయట్టి వా - నికి సీత వలికె
" మేలు శ్రీరాముని - మేలు చెప్పితివి
చాలునింతియె నాకు - సంతోషమయ్యె
నిన్ను రాఘవుఁడంపె - నే ? రాముచెంత
నెన్నినాళ్లాయె నీ - విప్పుడు కొలిచి ?
కల్లలు సేరవు - గద ? - మంచివాఁడ
వెల్లిదమ్ములు సేయ - నెంచిన నీకు
నీకోతి వాళక - మేల వేఱొక్క
యాకారమున మాట - లాడిననేమి?

రాక్షసాధమ! యావి - రాధారి నన్ను
రక్షింపుచుండ దూ - రంబుగాఁ దిగిచి
కపట సన్యాసివై - కనిపించి నన్ను
నపలవించితివింక - నయ్యెడిదేమి!
వానరతనుబ్రమింగ - వచ్చినావేమొ?
ఐనట్టులయ్యెడా - యఁగ రాకుమీవు
వాకొమ్ము నాస్వామి - వార్తలు దనకు
నాకర్ణనము సేయ - నభిలాషమయ్యె!
నినుజూచి నపుడు కం - టికి వింతదోఁచి
తనమనంబునకు విం - తగ నుండలేదు!
భీతివుట్టదు గాన - ప్రియవచనముల
హేతువుచే నిన్ను - నిటు నిల్వమంటి
ఉభయతారక మాట - నోడక నీకు
నభిముఖినై రాఘ - వాలాప కథలు
నాజోఁగియుండిన వచి - యింపుమీ" యనిన
మఱల సీతకు హను - మంతుఁ డిట్లనియె.
"రాముని సుగుణ కీ - ర్తనములు సేయ
సామాన్యమే బృహ - స్పతి బుద్ధికైన!
ధనదుఁడు కల్మిచే - దయ నంబురాశి
యినుఁడు తేజమున స - హిష్ణుత ధరణి
ధర్మశాస్త్రార్థత - త్త్వజ్ఞుఁ డక్లిష్ట
కర్ముఁడు నీతిమా - ర్గవిశారదుండు
శతకోటి మన్మథ - సౌందర్యమూర్తి
శతపత్రనయనుఁ డా - జానుబాహుండు
ఆరాఘవుఁడు నిన్ను - నరసి రమ్మనియె!

ఓరామ! యతని స - హోదరుఁడైన
సౌమిత్రియును నమ - స్కారంబుఁ జేసి
నీమేలుచూచి సం - ధించి రమ్మనియె
దా రాఘవుని యాప్తుఁ - డైన సుగ్రీవుఁ
డారసి నీదు మే - లడిగి రమ్మనియె
వారు సేసిన భాగ్య - వశమున నిట్టి
ఘోరరాక్షస వధూ - కోటులచేత
నలమటలకు నోర్చి - ప్రాణంబు తోడ
మెలఁగెద వింక నే - మి కొఱంత నీకు?
అసుర వల్లభుఁడు మా - యామృగవ్యాజ
మెసఁగొల్ప రాఘవు - నెలయించి బంచి
నిను దెచ్చియిచట వ - నీక్షోణియందు
నునిచిన ఫలమంద - నున్నాఁడు మీఁద!
మారాజు తరణికు - మారుఁడాప్తుండు
శ్రీరామునకుఁగాన - సీతను వెదకి
చూచిరమ్మని పను - చుటయు నేవచ్చి
యేచి క్షణంబులో - నీవార్ధి దాఁటి
ద్రోహిరావణు తలఁ - ద్రొక్కిన చుటుల
యూహించి నిన్ను నీ - యూరెల్ల వెదకి
కనుఁగొంటినని పల్కు - కపివీరు మాట
తనమది నమ్మక - ధరణిజ వల్కె
"కలఁగంటినొక్కొ! రా - క్షసనాథుఁ డిట్టి
బలుమాయ వన్నెనో? - భ్రమసితినేనొ?
మనసులో బాయని - మరులు చందంబో!
కనుఁగవ మిరిమిట్లు - కవిసైనదదియొ?

కాక రావణుఁడు ని - క్కము పుట్ట నిట్లు
వాకొనుచున్నాఁడో ? - వలను జూచుటకు !"
అన పల్కి "యెవ్వఁడ - వైన నేమాయె ?
వినవన్న ! యేవచ్చి - పీనింట నుండు
యిన్నినాళ్ళకు రాముఁ - డిట్టి వాఁడనుచు
విన్నదియె చాలు - వేడుక యయ్యె !
ఇది కలయైనచో - నెదిరి నామాట
కిది యుత్తరంబని - యియ్యనేరుచునె ?
కలఁగాదు నిజమని - కనరాదు మేలు
వలికెదు గాన నీ - పలుకీయకొంటి.
రామదూతవయేని - రావన్న నీకు
సేమమౌఁగాక య - శేషకార్యముల.
నరనాయకులకు వా - నరులకు నెట్లు
దొరకును జెలిమి ? నీ - దొర భానుసుతుఁడు
అనిచిన మంత్రి నే - నంటివి యిచట
దనుజుల మాయలఁ - దవిలి నేవిసివి
దరిదాపు లేనట్టి - దానను గాన
నెఱనమ్మి నీతోడ - నేఁ బల్కవెఱతు
నిజమైన రాముని - నెమ్మేని గుఱుతు
లజరులు మెచ్చఁగ - నగు లక్షణములు
నీతెఱఁగును నాకు - నిక్కంబుఁ దెలిపి
ప్రీతిఁ గావింపుము - విరతిగ "ననిన
నామాటలకు మెచ్చి - యనిలనందనుఁడు
రామునిల్లాలితోఁ - గ్రమ్మఱఁ బలికె.
"హనుమంతుఁడందు - రోయమ్మ ! నాపేరు

నను నెఱిఁగెదవు నీ - నాయకుఁడైన
రామభద్రుని శరీ - రవయోవిలాస
సాముద్రికాంగ ల - క్షణములు వినుము.

—: శ్రీరామ రూపవర్ణనము :—

తమ్మికన్నులవాఁడు - దాక్షిణ్యశాలి
యమ్మ! భూజనమనో - హరుఁడు చెల్వమున
మతిగలవాఁడు నే - మము గలవాఁడు
ధృతి గలవాఁడు బు - ద్ధిబలాధికుండు
దయగలవాఁడు స - త్యము గల్గువాఁడు
జయశాలి స్వజన ర - క్షణ విచక్షణుఁడు
రక్షకుఁడు స్వధర్మ - రక్షణుండటి వి
చక్షణుఁడు హితప్ర - చారుఁ డెల్లరకు
ఓరుపుగల్గువాఁ - డుర్వర యేలు
నేరుపుగలవాఁడు - నిపుణమానసుఁడు
కారయితయుఁ గర్త - కారణంబగుచు
ధారుణి నన్నియుఁ - దానైనవాఁడు
సర్వపూజ్యుఁడు బ్రహ్మ - చర్యవ్రతైక
నిర్వాహకుఁడు కారు - ణికతాంబురాసి
వినయగాంభీర్య వి - వేకప్రతాప
జనక చారిత్రుఁ డా - ర్జవగుణాన్వితుఁడు
వేదవేదాంగ కో - విదుఁడు కోదండ
వేదపారీణుఁడ - వేలధైర్యుండు
ఉత్తుంగభుజుఁడు మ - హోరస్కుఁ డప్ర
మత్తుఁ డాజాను కో - మలభుజార్గళుఁడు

చారురాజన్య ల - క్షణుఁడు కామాది
దూరుఁడు గూఢజ - త్రు వరిందముఁడు
సుభ్రూవిలాసుండు - సులలాటుఁ డధిక
శుభ్రయశోనిధి - సుగుణాకరుండు
సమవిభక్తాంగుండు - సమదర్శనుండు
సమఁ డింగితజ్ఞుండు - సౌమ్యవర్తనుఁడు
బింబాధరుఁడు దుందు - భి ధ్వనివాఁడు
కంబు కంధరుఁడు శృం - గారనాయకుఁడు
కలికలనవ్వు చ - క్కని మోమువాఁడు
వలరాజు నేలు చె - ల్వము గల్గువాఁడు
మానుషాధ్యుండు చా - మనచాయ మెఱుఁగు
మేను గల్గినవాఁడు - మిక్కిలి దాత
ముష్టి కరమ్మున - ముంగేల బలము
పుష్టి గల్గినవాఁడు - పొడవులైనట్టి
చేతుల బొమల మిం - చినవాఁడు సోగ
లై తగుజాను గే - శావళివాఁడు
ఉన్నతనాభి వ - క్షోదరుం డరుణ
సన్నుత చరణ లో - చనకరాంచలుఁడు
కరయుగ చరణరే - ఖానఖావళుల
యరుణత్వముల మించి - యమరినవాఁడు
నున్ననికాల్లు వెం - ట్రుకలు గాంభీర్య
సన్నర్ధనాభికా - స్వరగమనములు
గలవాఁడు త్రివళిరే - కల నుదరంబు
గళమును గలవాఁడు - కనుపించనీని
చరణరేఖావళి - చనుమొనల్ గలిగి

కరమొప్పువాఁడు శ్రీఁ - గడుపును గళము
కుఱుచలై తగువాఁడు - కొమరొప్ప సుడులు
శిరమున మూఁడుగాం - చిన భాగ్యరాశి
లలన! యంగుష్ఠ మూ - లమునఁ ద్రిరేఖ
లలవడువాఁడు క - రాలికంబులను
నలు రేఖలును జర - ణంబుల వజ్ర
హల కులిశాబ్జధ్వ - జాది రేఖలను
బరఁగినవాఁడు తోం - బదియాఱు తనదు
కరతలాంగుళి కేలఁ - గల ప్రమాణమున
మీఱు గాత్రమువాఁడు - మీఁగాళ్లు చెవులు
నూరువుల్ నయనంబు - లోష్ఠజానువులు
చేతులు భుజములు - చెక్కులు నొక్క
రీతిఁ బొల్చినవాఁడు - శ్రీలచేమించి
తళుకులైనట్టి దం - తంబులు నాల్గు
పలువరుసకు మధ్య - భాగంబు నందు
రాజిల్లువాఁడు వా - రణసింహవృషభ
రాజ యానమువాఁడు - రక్తాధరుండు
మెఱుఁగు కన్నులవాఁడ - మేయుండు దీర్ఘ
కరచరణాంగుళి - కళికలవాఁడు
సరసజోపమరస - జ్ఞాముఖనయన
కరపదద్వయములు - గలిగినవాఁడు
వెళపైన వక్షంబు - వీఁపును నుదురు
గలవాఁడు నిడుసోయ - గపు నాసవాఁడు
తేజోయశశ్రీల - దినకరాన్వయము
రాజులకెల్లను - రాజైనవాఁడు

అత్యున్నతోజ్జ్వల - దళికనాసాగ్ర
మత్యుపాయ బలాభి - మానవైభవుఁడు
కాలంబులను ధర్మ - కామార్థలాభ
శీలముల్ మఱువక - చేకొనువాఁడు
నిగ్రహానుగ్రహ - నిపుణుఁడు ధర్మ
విగ్రహుఁ డఖిలాస్త్ర - వేది ప్రాజ్ఞుండు
మగువ! కౌసల్యాకు - మారు నెవ్వారు
పొగడ నేర్తురు? తలఁ - పుల కొద్దిగాక!
అతఁడట్టివాఁడ సు - మ్మతని సోదరుఁడు
చతురుఁ డన్నిటను ల - క్ష్మణకుమారకుఁడు!
వీరిద్దఱును నిన్ను - వెదకుచువచ్చి
ఓరామ! యలజటా - యువు వార్తవలన
రావణు చందమా - రసి విని వార
లీవలగా వచ్చి - ఋశ్యమూకంబుఁ
జేర దవ్వులను వీ - క్షించి భీతిల్లి
మారాజు తరణి కు - మారుఁడు వెఱచె.
వెఱవకుమని యేను - వెనుఁ జఱచుటయుఁ
దిరిగి చూచుచుఁ బాఱి - ధృతిపూని నిలిచి
యారాజుల తెఱంగు - లరసి రమ్మనుచు
నారీశిరోమణి! - నను బిల్చి పనిచె.
రాముని తెఱఁగు స - ర్వంబును దెలిసి
నామూపుపై వారు - నడిచి రాకుండఁ
దాలిచి తెచ్చి చెం - తల డించి నన్ను
నేలిన దొరతోడ - నెఱిఁగించి వారి
యిరువురకును సంధి - యే నడిపింప

తరుణి! యావేళ వా - ర్తలు చెప్పరాదు !
"తనరాజ్యము హరించి - తనయాలి నుడిచి
తనుజెట్లు వట్టించె - తమ యన్నవాలి
దిక్కుగావే !" యని - దినకరతనయుఁ
డొక్క దిక్కునఁ బల్క - నూరడించుటయు,
"తనకాంతఁ జెఱపట్టి - దశవదనుండు
కొనిపోయె మాకు ది - క్కును ప్రాపుదాపు
నీవు దక్కఁగ లేరు - నీవారమగుచు
సేవకావృత్తిఁ గొ - ల్చెదము రక్షింపు
సీతను గ్రమ్మఱఁ - జేకూర్పు" మనుచు
నాతి! మీవారు బ - న్నంబు నొందుటయు
సరిపడియుండ బా - సలు నేమికలును
నిరువాగు నడిపింప - నే నట్టివేళ
మును నీవు చెఱఁగు చే - ముడిచి మా నడుమ
వినువీథి నరుగుచో - వ్రేసినయట్టి
సొమ్ములు దెచ్చి యేఁ - జూపిన మూర్ఛఁ
గ్రమ్మి ధారుణిఁబడి - కనువిచ్చి లేచి
రామ! యావేళ శ్రీ - రాముని దుఃఖ
మేమనవచ్చు! న - ల్లేడ్చుచునున్నఁ
గాంచి సుగ్రీవుఁడు - కన్నీరు దుడిచి
మంచి మాటలు పల్కి - మౌళిఁ గేలుంచి
సీతను దెచ్చి కూ - ర్చెదనని ప్రాణ
దాతయై యొకకొంత - తాల్మి పుట్టింప
నిదురలేమియుఁ జాల - నెగులు శోకంబు
మదిని త్రేతాగ్నుల - మాడ్కిఁ జూపట్ట

నోతన్వి ! యిపుడగ్ని - హోత్రగృహంబు
రీతి నీమగఁడు భ - రింపలేఁడయ్యె !
భూకంపమునఁ దాను - భూమీధరేంద్ర
మాకంపమునఁ బొందు - నట్ల శోకాగ్ని
కానోర్వఁడయ్యె నీ - దశకంఠు నిఖిల
దానవశ్రేణితోఁ - దన దివ్యబాణ
పావకజ్వాలికా - పటలిచేఁ బ్రేల్చి
దేవి ! చేకొను నిన్ను - దివిజులు మెచ్చ
నిను వెదకింప న - నేకవానరులఁ
బనిచెదనని పూని - ప్రతినలు పలుక
నందుచే వాలి నొ - క్కమ్మునఁ గూల్చి
యందలంబున నుంచి - యర్కసంభవుని
యతని రాజ్యమునకు - నభిషిక్తుఁ జేసి
సతితోడఁ గూర్చి వి - చారముల్ దీర్చె !
ఆరాఘవుఁడు చేసి - నట్టి మేలునకు
మారాజు మది మేలు - మఱవక నిన్ను
వెదకి కన్గొనిరండు - వేగంబయనుచు
ముదితాత్ముఁడై దిశా - ముఖములకెల్ల
కపివీరులను బంచె - గాన యేనొకఁడ
నిపుడు వచ్చితి నిన్ను - నిచ్చోటఁ గంటి !
పవననందనుఁడ నీ - పతితోడ నిన్ను
నువిద ! కూర్పఁగ మది - నూహించినాఁడ !
అందఱు వానరు - లన్ని దిక్కులకు
నిందు నంగద ముఖ్యు - లినకుమారకుని
పనుపునఁ బనిపూని - బలములఁగూడి

నిను వెదుకంగఁ బోవ - నిజశక్తులెల్ల
మాటక చరియింప - మాఁజాలవారు
మాట వాసుల దోర - మానసులగుట
'గడువు మీఱెను జన - కజఁ గానమైతి
మడియఁగ లేకనేల - ప్రాణంబులందు'
ననుచుఁ బ్రాయోప వే - శాలోచనముల
నెనుకటి సుద్దులు - వినఁ బల్కువేళ
ననుజుండైనట్టి జ - టాయువు మాట
విని యా బిలంబులో - వెడలి సంపాతి
యెగిరి పోవుచు మాకు - నిచ్చోట నీవు
వగలతో నున్న తా - వల మేఱుపఱచి
పోవ నే మెల్ల నం - బుధిచెంతఁ జేరి
లావుల కొలఁదు లె - ల్లరు తేటపఱుప
నెవ్వరిచేఁగాని - యీఘనాన్కిఁ జేసి
తివ్వన నేదాఁటి - తెక్కలతోడి
యచలమో యనఁద్రికూ - టాద్రిపై వ్రాలి
యిచట లంకాపురం - బెల్ల శోధించి
అమ్మ! నాదైన పు - ణ్యావశంబుచేత
నిమ్మెర నినుగంటి - నీడేరెఁ బాటు!
మఱలి మావారికి - మాట యేర్పఱచి
తరణిజ దశరథ - తనయులతోడ
నీదు చందముఁ దెల్పి - నేవారిఁ గూడి
యీదశానను మదం - బెల్ల నడంచి
నినుఁగూర్తు శ్రీరాము - నికి నందుకతన
ననుపమంబైన వి - ఖ్యాతిఁ గైకొందు!

మును కౌరవాచలం - బున నుండి యొక్క
పని గల్గి గోకర్ణ - పర్వతంబునకుఁ
గేసరియను గపి - కేసరి నాక
వాసుల హితము భా - వమునఁ దలంచి
జలధి తీరంబున - శంబసాదనుని
బలియుని దానవ - పతిఁ బొలియించి
యసము గైకొనియె నే - నతని నందనుఁడ
నసమానశౌర్యబా - హాబలాన్వితుఁడ !
వాయువొసంగిన - వరముచేఁ గాంచె
మాయమ్మ యంజన - మందరాగమున !
నీపతి సద్గుణా - నీకముల్వరుస
రూపించితిని నాస్వ - రూపమంతయును
విన్నవించితి "నన్న - విని హనుమంతుఁ

—: హనుమంతుని మాటలకు సీత సంతోషించుట :—

డన్న మాటలకునై - యవనిజ మొగము
చెలువంబు రాహువు - చేత వీడ్వడిన
కలువలరాజు చ - క్కదనంబుఁ గాంచె !
ఆనందబాష్పంబు - లవనిజ కన్ను
గోనల సోనలై - కురియంగఁ జూచి
యుదుగని కన్నీట - నోరంతప్రొద్దు
నెడపని చింతచే - నేడ్చుచు నునికి
మనసు గానఁగలేక - "మాయమ్మ ! యింక
జనదు శోకింప వి - చారంబు మాను

మేమి సేయుదు నీకు ? - నెద్దియభీష్ట ?
మేమి కావలయు ? నా - కెయ్యది బుద్ధి ?
వాయుపుత్రుఁడ గాన - వాయువుకన్న
నాయత జవశక్తు - లధికముల్ నాకు !
పొమ్మనఁ బోయెదఁ - బోయి యీక్షణమె
రమ్మన్న వత్తు శ్రీ - రాము నూరార్చి !"
అని వెండియును సీత - యనుమానముడుప
మనసున నెంచి య - మ్మారుతి పలికె.

—: హనుమంతుఁడు సీతకు రాముని ముద్దుటుంగరము
నానవాలుగా నిచ్చుట :—

"పరమకల్యాణి ! నీ - పతి నన్నుఁ బిలిచి
'గురుతుగాఁగడమ గై - కొనదు మాసీత
యిది చూచునెడ నమ్ము - నింద' పొమ్మనుచు
ముదిత ! చేతికినిచ్చె - ముద్దుటుంగరము
కొమ్మ"ను నంతఁగై - కొని రాముచేతి
సొమ్ము ప్రాణేశ్వరుఁ - జూచిన యట్టుల
తీసుక మదిని సం - దియమెల్లఁ దీఱి
యాసీత ప్రమదాబ్ధి - యందు నోలాడి
శిరముపై నునిచి మ - చ్చికఁ జెక్కుఁ జేర్చి
యురముపై నిడి లోచ - నోత్పలంబులను
హత్తించి కరమున - నమరించి కపికు
లోత్తముఁ గనుఁగొని - యొకమాట వలికె.

—: శ్రీరాముని ముద్దుటుంగరము చూచి యానందభరితయై సీత హనుమంతునిఁ బ్రశంసించుట.—

"తజ్ఞుఁడ వతిశౌర్య - ధనుఁడవార్యుఁడవు
ప్రాజ్ఞుఁడ వసమాన - బలుఁడవు ధైర్య
శాలివి వానర - సాధారణుండ
వే! లంక కితఁడే - విధమున వచ్చు?
జలరాశి నూఱుయో - జనము లావడుగు
పొలుపున దాఁట నో - పున యొకఁడుండు?
ఈరావణునిఁ జూచి - యెదవడ కొకఁడు
ధీరుఁడై నగరుశో - ధించి రాఁగలఁడె?
చాలఁ జిత్తమునకు - సరిపోకయున్నఁ
బాలించునే రఘు - పతి యుంగరంబు?
నాతోడ మాటాడ - నాతోడబుట్టు
వై తగువానిఁగా - కనుచునే విభుఁడు?
అంత నమ్మినవాఁడ - వగుట నీతోడ
మంతనంబున నేను - మాటాడఁ దగవు!
రామసౌమిత్రులు - ప్రాణముల్ దాల్చి
భూమి నున్నారను - పుణ్యమొక్కటియె
కలుగఁ గావలె గాక - కపివీర! యేమి
తలఁచిన నది యసా - ధ్యంబె వారలకు?
శ్రీరాము కోపాగ్ని - చే విశ్వమెల్ల
నీఱు కాకుండదే - నిమిషమాత్రమున?
ఈమీఁద నాకర్మ - మెట్టిదో? కాక
రాము నెదుర్చునే - రావణాసురుఁడు?
సేయు కార్యములందు - చింతిలుచుండి

సేయక మానునో - సేయునో పూని ?
సామదానములాప్త - జనులందు నహిత
భూమీశులెడ భేద - మును దండనీతి
నద నెఱింగి యొనర్చు - నాయాప్తజనుల
పదవులు తాఁబరి - పాలించునొక్కొ ?
దేవమానుషవిధుల్ - తెలిసి వర్తిలునె ?
నావార్తలుగఁ బల్కు - నా యేకతమున ?

—: శ్రీరాముఁడు తన్నెప్పుడు చెఱనుండి విడిపించునో యని సందేహముతో సీత యడుగుట :—

ఎడవాసినప్పుడె - యెంతలేదనుచు
విడువక నాచెఱ - విడిపించు నొక్కొ ?
ఎన్నడు నొకచింత - యెఱుఁగని భర్త
యున్ని దుఃఖములచే - నిందుచున్నాఁడొ ?
కౌసల్యయు సుమిత్ర - కైకేయి లెస్స
లే ? సోదరులు సుఖు - లే ? వారివార్త
వినఁబడునే ? మహీ - విభుఁడైన భరతుఁ
డనుచరావళిఁ బంచి - యన్న సేమంబుఁ
దావిచారించునే ? - తరణినందనుఁడు
రావణుపైనెత్తి - రాఁగలఁడొక్కొ ?
వివిధశస్త్రాస్త్ర సం - వేదియైనట్టి
రవివంశమణి సుమి - త్రా కుమారకుఁడు
నానిమిత్తముగ దా - నవుల వధింపఁ
బూనుక యున్నాఁడె - పోవనిమ్మనక ?
రాము బాణములచే - రణభూమిలోన

నాముందటను గూలు - నా దశాననుఁడు ?
నీటఁ బాసిన యట్టి - నెత్తమ్మిఁ బోల్ప
సాటియై శ్రీరామ - చంద్రుని మొగము
ననుఁ బాసి వాడియు - న్నదియొక్కొ? ధర్మ
మునకునై తనరాజ్య - ముఁ దృణీకరించి
వనులకు ననుగూడి - వచ్చిననాఁటి
యనుపమధైర్యమే - మయ్యెనో యిపుడు ?
తల్లిదండ్రులకన్నఁ - దనపాలిప్రాణ
వల్లభు మేలిమి - వార్త యేవినఁగ
నిన్నాళ్లు తాల్చితి - నీ శరీరమునఁ
జిన్న ప్రాణంబులు - చననీక యాఁగి !
ఎంత లేదిటమీఁద - నేమైన లెస్స
చింతలు దీర్చి ర - క్షించితి వీవు !"
అని కంటఁ దడియుంచు - నవనీతనూజఁ
గనుఁగొని వానరా - గ్రణి యిట్టులనియె.

—: హనుమంతుఁడు తాసీవృత్తాంతము తెలిపిన తక్షణమే శ్రీరాముఁడు రావణుని సంహరించి యామెను విడిపించునని ధైర్యము చెప్పుట :—

"ఇచట నీవుండిన - యీవార్త వినిన
శచి నింద్రుఁడును బోలి - స్వామి రాఘవుఁడు
అమ్మ ! తోడ్కొనిపోవు- ననుమానమేల ?
నమ్ముము నామాట - నారాకఁ గోరి
యున్న రాఘవుఁడు నీ - యున్నట్టివార్త
విన్నయప్పుడె కపి - వీరులఁ గూడి

జలధి యింకించి రా - క్షసుల రావణునిఁ
బొలియించి నీఖేద - ములు మాయఁజేయు
నినుబాసి యోరుచు - నే రఘువరుఁడు!
తనునమ్ము మఖిల భూ - ధరముల యాన
నాకుఁ జీవనమా వ - నశ్రేణి యాన
రాకమానఁడు రఘు - రాముఁ డిచ్చటికి
నైరావతంబుపై - నమరేంద్రుఁ డనఁగ
నో రామ! ప్రస్రవ - ణోర్వీధరమున
నున్నట్టి భానువం - శోదధి చంద్రుఁ
గన్నులు చల్లఁగాఁ - గాంతువు మఱల
వన్యమాంసంబులు - వలదని యితఁడు
వన్యాసియై ఫలాని - వర్గంబు కరణి
దేవతలకు పితృ - దేవతావళికి
సేవకాతిథులకుఁ - జేఁ జేతఁ బంచి
యైదవపాలు సా - యంతనంబునను
నీదయితుండు క - న్నియ! తాభుజించు
మేనిపై వ్రాల నీ - మీఁద విరాళిఁ
దానెఱుఁగఁడు చొంప - దంశకాదులును
నినుబాసి క్షణమైన - నిద్ర యెఱుంగఁ
డనుచోట నతని కా - హార మెక్కడిది?
ఒకవేళఁ గనుమూసి - యొకకొంత నిదుర
నొక క్షణమాత్ర దా - నుండి రాఘవుఁడు
అదరి పాటున లేచి - హా! సీత! యనుచు
నెదురువారలు విన - నెలుగెత్తి పలుకు

మంచిపువ్వులు పరి - మళములు చవులు
గాంచిన ఫలములు - కమ్మ తెమ్మెరలు
పొదరిండ్లు చూచిన - ప్పుడు నినుఁదలంచి
మదిఁ గందియసురని - మ్రాన్గన్ను వెట్టు
లోలుఁడై సీతోడి - లోకంబె కాక
యోలేమ! రఘువరుఁ - డొల్లఁ డేమియును
తామసింపక వచ్చి - దశకంఠుఁ దునిమి
నీమనోరథముల - న్నియు నొనఁగూర్చు
నూరడిల్లు" మటన్న - నుర్వీతనూజ
మారుతనందను - మాటలచేత
శరదాగమనమున - జలధర శేష
పరిచితిఁ గన్పట్టి - పద్మారితోడ
నెసఁగిన యామిని - కెనయైన సీత
మెసకంబు మానితా - నిట్లని పలికె

—: సీత యామాటలకు ధైర్యముఁ జెందుట :—

"అన్న! వాయుకుమార! - యమృతంబుఁ జిలుక
విన్న నీమాటలు - వేడుక చేసె
రాముని చింతాభ - రంబునే వినిన
నేమందు రావణు - నింటిలో నున్న
యీ దుఃఖమునకన్న - నినుమడియైన
ఖేదంబుఁ జేసెనే - క్రియ నోర్పుదాన!
కలిత సుఖాసుఖ - కరములై నీదు
పలుకుల దెలిఁగు నా - భావంబులోన
నమృతంబు విషము జో - డై కూడి నట్టి

క్రమమునఁ బ్రమదంబు - గాసియుఁ బెనిచె.
మేలును గీడునే - మేరలఁ జెందు ?
కాలంబు వచ్చినఁ - గడప లేకునికి
మముఁ జూచితివె నడు - మఁ బయోధిలోనఁ
దెమలి క్రుంగిన యోడ - తెరవరులెల్ల
గడతేర నేరని - కైవడి నిట్టి
యెడపని వెతలచే - నీఁత లీదెదము !
రాముఁ డెప్పుడు గెల్చు - రావణు నపుడు
నామీఁది కరుణఁ బ్రా - ణములిచ్చి నిలుపు
దశమాసములకు నిం - త గొఱంత నేను
దశరథాత్మజుఁ బాసి - దశకంథరుండు
మితి చేసె రెణ్ణెల్లు - మీఁదటఁ దనకు
నతనిచే బ్రదుకు లే - దటుగాన వేఁగఁ
గాకుత్‌స్థతిలకు లం - కాపురంబునకు
నేకైవడి దెచ్చు - నెన్నిక నీకుఁ
దోఁచె నట్టిది చేసి తోడ్కొనిరమ్ము
దాఁచక నీకు నిం - తయు వివరింతు.
అసురనాథుని తమ్ముఁ - డగు విభీషణుఁడు
విసువక మంత్రులు - వినఁ గొల్వులోన
" వలదన్న ! రాముని - వనిత నీకేల
కులమెల్లఁ జెడు సీతఁ - గోరితివేని
రామునిచరణ సా - రసములు చేరి
నామీఁద నేరమె - న్నక ప్రోవుమనుచు
నొప్పగించితివేని - యోర్చి నీదైన
తప్పుసైరించు నీ - తానాయకుండు "

అనియెంత చెప్పిన - నామాట వాఁడు
వినఁడేమి తలఁచియో - విధివశంబునను!
ఆవిభీషణు భార్య - యైనట్టి సరమ
యీవిధంబెల్ల నా - కేర్పరించుటకు
ననల యనంగ ప్రి - యంవదయైన
తనపెద్దకూఁతురుఁ - దనచెంత కనిచి
నాతోడ వివరించు - నాఁడు నాఁటికిని
భీతి నొందకుమని - బిమ్మటఁ దీర్చు
మారుతాత్మజ! నీదు - మాటచేఁ గొంత
యూరడిల్లితి దైవ - యోగంబుచేత
ధైర్య ఋజుత్వ స - త్య వివేకధర్మ
శౌర్యశాంతిదయాది - సద్గుణంబులకు
నెళవైన శ్రీరాము - నికి నెంత వీనిఁ
బొలియించుటని నాదు - బుద్ధిలోఁగలదు.
ఖరదూషణాది రా - క్షసుల సంగ్రామ
ధరణిలో నొకముహూ - ర్తములోనె తునిమి
యనుజునిఁ గడనుంచి - నట్టి రాఘవునిఁ
గినియ శక్యమె యేరి - కిని వానరేంద్ర!
ఇంద్రుని మహిమంబు - లిట్లని కన్న
చంద్రాస్యయైనట్టి - శచియును బోలి
శ్రీరామచంద్రుని - చిత్తవర్తనము
లీరూపనియు చాల - నేనెఱుంగుదును
బాణకరంబు లంబర - దైత్యకోటి
ప్రాణంబు లంబురా - పమునఁ గ్రోలించు

శ్రీరామ సూర్యు నీ - క్షింతునే యీశ
రీరంబుతోఁ గేస - రికుమార నేను ?”
అనునంత జలజల - నశ్రుపూరములు
కనుగొలుకుల నోడి - కలుగాఁగఁ గురియఁ
దలవంచు కొనుటయు - ధరణిజఁ గాంచి
‘ వలదని ’ యాకపి - వలిపట్టి పలికె

—: హనుమంతుఁడు సీతను రామునికడకుఁగొని పోవుదునని విన్నవించుట :—

‘ అమ్మ ! చింతింపకు - మదె రాఘవుండు
తమ్మునితో భాను - తనయునితోడ
వచ్చును వచ్చిరా - వణుని ఖండించు
నిచ్చలో నదినమ్మ - వేని యింతేల
నిన్ను వీపునఁ దాల్చి - నిమిషంబులోన
మున్నీరు దాఁటి రాముని - చెంత నునుతు !
కొనిపోవఁ జాలఁ డొ - కోయను శంక
మనసులోపల నీవు - మాను మీలంక
యీరాక్షసాళితో - నేఁ బెల్లగించి
కోరకై వడి కేలఁ - గొని వింట నేఁగ
సత్తువ కలదు వి - చారమేమిటికి ?
ఉత్తమగుణవతి ! - యొకసెలవిమ్ము
హుతవహుఁడందు నా - హుతులు తాఁదెచ్చి
శతమఖునకు నిచ్చు - చందంబుఁ దోఁపఁ
గానుక సేతు రా - ఘవునకు నిన్ను

మానినీమణి ! మాఱు - మాటాడవలదు!
ఇతనిపైఁ జనవచ్చు - నే నాకు ననక
యతివ రోహిణి చంద్రు - నందినరీతి
నీ నాయకునిఁ బొంది - నెమ్మది నుండు
మేను గల్గియు నింక - నేల ఖేదంబు ?
ఏలీల వచ్చితి - నేవార్ధి దాఁటి
యాలీలఁ జులకఁగా - నమ్మ ! యేనెగసి
నిను దాల్చి పోవుచో - నిర్జరులైన
నను గూడలేరు దా - నవులేమి లెక్క !
మానసవేగాస - మానసత్వములు
మానిని ! కలవాఁడ - మసలక రమ్ము."
అన విని పులకించి - యనురాగమొంది
హనుమంతుతో జన - కాత్మజ వలికె.

—: సీత హనుమంతుని బలము సందేహించుట :—

" నాతోడ నీవు వా - నరుఁడవుగాన
జాతికిఁ దగినట్టి - జాడఁ బల్కితివి.
ఏనెక్కుఁ డీవెక్కుఁ - డెంతకునెంత ?
పూనిన నెత్తుక - పోవ నోపుదువె !
జలధి నేక్రియ దాఁట - జను ? నీకునింత
సులభమే ? కనుఁగొను - చో నింతలేవు !
ఇందాఁక నీమాట - లే వినుచెల్ల
సందియంబయ్యె నీ - శపథముల్ వినిన."
అని తన్ను నమ్మక - యసదుగా నెంచి
జనకజ వలుక స్వ - చ్ఛందగాత్రుండు

—: హనుమంతుఁడు తన నిజస్వరూపమునుఁ జూపుట :—

"కాదింక నానిజ - గాత్రంబుఁ జూపి
వైదేహికిని నిక్క - వము సేయకున్న"
నని హిమాచల మంద - రాగ కైలాస
కనకాచలంబుల - గతి మేను పెంచి
తామ్రవక్త్రుఁడు వజ్ర - దంష్ట్రానఖుండు
క్రమభీకరభుజా - ర్గళుఁడును నగుచు
ననలార్కసంకాశుఁ - డై పవమాన
తనయుఁడు క్రమ్మఱ - ధరణిజ కనియె
'కొత్తడమ్ములతోడఁ - గోటలతోడ
మత్తేభతురగస - మాజంబుతోడ
నీరావణునితోడ - నింతులతోడ
నీరాక్షసాళితో - నీత్రికూటంబుఁ
బెకలించుకొని కేల - బెల్లుపుటచ్చు
నకునుద్దిగా గగ - నంబున కెగసి
చనుదునో! నిన్నుభు - జాపీఠి నునిచి
వనధి దాఁటుదునో! రా - వణముఖ్యులైన
యీదానవులనెల్ల - నిరుగేలఁ జమరి
యోదేవి! యురులపై - నుఱుగఁ జేయుదునో!
అమ్మ! యింకొకమాట - యానతి యిచ్చి
నమ్మి యాపై రమ్ము - నామీఁద నీవు!"
అనునంత గజగజ - నవనిజ వణఁకి
మనసు రంజిల హను - మంతున కనియె

—: సీత హనుమంతునకు సమాధానముఁ జెప్పుట :—

అంజనాతనయ ! నీ - వహితదైతేయ
భంజనుఁడవు నీదు - బాహాబలంబు
జవసత్త్వములును ని - జంబులు జలధి
చవుకళించుట నీక - సాధ్యంబు గాదు !
నీదుపై రా రాము - ని యనుజ్ఞ మొదట
లేదు గావున వెంట - లేచి రారాదు
కాకవచ్చిన నీదు - గమన వేగమున
నాకంపమునఁ బొంది - యంబుధిలోనఁ
బడిన నమ్మీనముల్ - భక్షించిపోవు
పడనీక గట్టిగాఁ - బట్టితివేని
వెంటాడి వత్తురీ - వీరదానవులు
మింటిత్రోవను వారి - మీఱిపోరాదు !
'వారలు నాకెంత ? - వధియింతు' ననినఁ
బోరాడ నాయుధ - మ్ములు నీకు లేవు
వారికే మఱలఁ గై - వశమైతి నేని
నేరరు మఱి తాళ - నేఁడె మ్రింగుదురు !
నీవె రావణుఁ బట్టి - నిర్జించితేని
యావల రాముశౌ - ర్యము నిరర్థకమ్ము !
ఒంటిగాడవు నన్ను - నొకయెడ డించి
బంటించి యహితులఁ - బైకొనరాదు
తనకెట్టులైన చో - దయె తీఱె ! నీకు
నని హానియైనఁ గా - ర్యము నమ్మువోవు !
నీవుగెల్చిన రాము - నికిఁ గీర్తి లేదు!
చావనీయక వారు - చలపట్టుపట్టి

కొనిపోయిరే నొక్క - గొందిలో డాఁచి
యనుతు లన్యులెఱుంగ - కుండ నెందైన
నటుగాన నీనేర్చి - నట్ల శ్రీరాము
నిటకుఁ దోడ్కొనివచ్చి - యీనిశాచరులఁ
దునిమించి యామీఁదఁ - దోడ్కొని నన్ను
చను నొప్పుఁగాని యో - జన యిదిగాదు
రామలక్ష్మణులకు - ప్రాణంబు లెల్ల
నామీఁదనుండు గా - నఁబ్రమాద వశతఁ
దనకొక్కఁడైన చోఁ - దమ్ములు దాను
మనఁడు కౌసల్యకు - మాఱుఁడే యెడల
నదిగాక యితరుల - నంటనెవ్వరిని
మదియొగ్గి యొక్క ప్ర - మాదంబు చేత
దిక్కులేనట్టిచోఁ - దెగపట్టి తెచ్చె
రాక్షసుఁడను విచా - రమునఁ గుందెదను
అందుచేఁ బుత్ర మి - త్రాదులతోడ
మ్రందించి దనుజేంద్రు - మదమడగించి
కొదవలు దీర్చి తో - కొనుచుఁ బొమ్మనుము
సదయాత్ముఁడగు రామ - చంద్రునితోడ
వాయువుతోఁగూడు - వహ్నియో యనఁగ
నాయుధపాణియై - యనుజుఁడుఁ దాను
నిలిచిన శ్రీరాము - నికి నెదిరింపఁ
గలరె దేవాసుర - గంధర్వముఖులు ?
తామసించక నన్ను - దరిచేర్పఁ దలఁచి
రామలక్ష్మణులను - రవికుమారకునిఁ
దోడ్కొనివచ్చి నా - తుందుడుకార్చి

కై కొనుమీవు సం - కల్పసిద్ధులను."
అనుచు దైన్యోక్తు లి - ట్లాడిన సీతఁ
గనుఁగొని సామీరి - క్రమ్మఱఁ బల్కె
"అమ్మ! నాతోడ నీ - వాడిన మాట
సమ్మతంబది పుణ్య - సాధ్వివిగాన
మున్నిటిమీఁద నా - మూపుపై నెక్కఁ
గన్నులఁ జూపుట - మేరగాదనియుఁ
బోరాకయును పర - పురుషుల నంట
దీఱునే యెందు స - తీమణి కనియు
నాడిన వాక్యంబు - లవి నీకె చెల్లు!
వేడుకయయ్యె! నీ - విభుచెంతఁ జేరి
నీవున్న చందంబు - నీ విచారంబు
నీవచనంబుల - న్నియుఁ దేటపఱచి
నీ మనోరథములు - నెఱవేర్చువాఁడ
రామలక్ష్మణులు నా - రాశిపై దాఁటి
రాలేరనియు వాన - రశ్రేణి చేరఁ
జాలదంచును యత్న - సాధ్యంబుగాని
సులభంబు గాదని - చూచి యేనిట్లు
పలికితి 'రమ్మునా - పై' నంచు నిన్ను
అదిగాక తనయుని - యట్లయే మిమ్ము
మదినమ్మి కొలిచిన - మందమేలమున
రమ్మంటి యేవాన - రస్వభావమున
నమ్మ! నామాట యె - గ్గని యెంచవలదు
ఇపుడె పోయెద రాము - నెటకు నామీఁద
గృపయుంచి గుఱుతుగా - నెద్దియే నొకటి

పాలించి పొమ్మని - పనుపు" మటన్న
నాలించి క్రమ్మర - యవనిజ వలికె

## —: సీత హనుమంతునితో రామునికి కొన్ని గుఱుతులు చెప్పుమనుట :—

"రావన్న గుఱుతువా - ర్త యొకండు గలదు
పావని ! నీతోడఁ - బల్కెద నిపుడు
ఒకనాఁడు చిత్రకూ - టోపరికుంజ
నికటంబునందు వ - నీకేళి నలసి
మున్నుగా ఫలమూల - ములకు నామఱఁది
చన్నట్టియెడ నొక్క - చలువరాపలక 3120
మీఁదరాముఁడు విశ్ర - మించిన నేను

## —: కాకాసుర వృత్తాంతము :—

నాదండఁ జరియించు - నపుడొక కాకి
నాచనుమఱి తన - నఖమునఁ జీరఁ
జూచి యేనొక్క పెం - చున నదలించి
ప్రేసిన నదిపోక - వినుజాడ నెగసి
లాసి క్రొవ్వాఁడి గో - ళ్లనురంబుఁ జీరఁ
గరపల్లవమున బం -గరు మొలనూలు
సరగునఁ గీలూడ్చి - చాల కోపమునఁ
దరిమి కొట్టెదనని - తానేఁగఁ బైఁట
చెఱఁగు జాఱఁగ బిగిం - చిన నీవి వదలి 3130
వలువ జాఱిన రఘు - వర్యుఁడు చూచి
కలకల పరిహాస - గతిని నవ్వుచును

జూడ మాయలకాకిఁ - జోపక మఱలి
వ్రీడ గైకొని ప్రాణ - విభు తొడలందు
వసియింప నలసిన - వాఁడౌట విభుఁడు
వసుధ శయించి నా - వామోరు పీఠిఁ
దలగడగాఁగ ని - ద్రాసక్తి నుండఁ
జలపట్టి యాకాకి - చంచువుల్ నాఁట
నురముపైఁ బొడిచిన - నూరక తాళి
తటిచూచి రమణుని - ద్రాభంగమునకుఁ
జాలకయున్న న - స్ర ప్రవాహంబు
జాలెత్తి తనదు భు - జంబుపైఁ గురియ
నిదుర మేల్కాంచి కం - టికిఁ గోరగించు
నెద గాయమునఁ బ్రవ - హించు రక్తమునఁ
దోఁగిన నను జూచి - 'తొయ్యాలి! నీకుఁ
రాగతమేమి యు - రంబుపై నంటు?
యనవిని యిది హేతు - విని విన్నవింపఁ
గనలుచు నొకయిషీ - కను జేత నంది
బ్రహ్మమంత్రంబుఁ దాఁ - బలికి వ్రేయుటయు
బ్రహ్మాస్త్రమై తన - పై దర్భపోఁచ
రాఁజుచు విలయాగ్ని - రవులు కొన్నట్లు
రాఁజూచి కాకి పా - ఱఁగ నది తరుమఁ
గాకారవంబుతోఁ - 'గావరే!' యనుచు
లోకంబులెల్ల నా - లోకించి చుట్టి
యజహరేంద్రాదులా - నమరుల వేడ
గజగజ వడకుచు - గాంచి వారెల్ల
మ్రొక్కుచు 'రాఘవా - మోఘదివ్యాస్త్ర

మెక్కడ యదిమాన్పు – యెక్కడ ? నిన్నుఁ
గాచు టెక్కడ ? యెఱుఁ – గక వచ్చినావు'
చూచుకొమ్మింక గా – చు తెఱఁగు నిన్ను
నిందు నుండక చను – మెచ్చోటి కైనఁ
బొందుపట్టున' కని – పోవఁ ద్రోలుటయు
నేకాకినై చొర – నెచ్చోటు లేక
యాకాకి రాముని – యడుగులు చేరి
'శరణు చొచ్చితినయ – జగదేకవీర !
శరణంబు నీకు కౌ – సల్యా కుమార !
ఆదరింపుము శర – ణాగతత్రాణ !
కోదండ దీక్షాది – గురుకీర్తి నిరత !
రామ ! నీమహిమ మె – ఱుంగక రాజ
సామాన్యుగా నెంచి – జనకతనూజఁ
జెనకితిఁ గృపఁజూచి – చేపట్టి నన్ను
మనుపుము మఘవకు – మారుఁడ నేను
పేరు జయంతుఁడు – పిచ్చుకమీఁద
నోరామ ! బ్రహ్మాస్త్ర – మురక వేయుదురె ?
చేతనంటి తృణంబు – చిదిమి వేయుటయు
నాతతంబైన బ్ర – హ్మాస్త్రమై వచ్చె
నన 'నమోఘంబు నా – యస్త్రంబు నీదు
తనువున నొకచోటు – దాని కొసంగి
చను' మన్న వాపలో – చన మిచ్చివాఁడు
చనియె నేనును రాయ – చంద్రుఁడుగాని
యీపాట సౌమిత్రి – యెఱుఁగఁడీ గుఱుతు
స్వామితో నేకాంత – సమయంబు నందు

వినిపించు" మనిన సా - ధ్వీ శిరోమణికి
హనుమంతుఁ డబ్బుర - మంది యిట్లనియె
"రాముఁడు నిన్నేమ - ఱక యున్నవాఁడు
సౌమిత్రి మఱచునే - స్వప్నంబులోన?
తేపె రాఁగలఁడు గ - ర్వితుల నడంచి
చేపట్టు నిన్నుఁ గా - శిక రక్షకుండు!
అందఱితో నేమి - యందు నేఁబోయి
యిందీవరాక్షి! నా - కెయ్యది బుద్ధి
పలుకు మీవన గాలి - పట్టినిఁజూచి
యిలసుత వెండియు - నిట్లని పలికె

— సీత హనుమంతునితో శ్రీరామునికిఁ జెప్పఁదగిన సంవాదమునుఁ జెప్పి శిరోమణినిచ్చుట :—

"సకలలోకములకు - స్వామియైనట్టి
సకలజ్ఞు రాముఁ గా - సల్యాకుమారు
నడుగుల కెఱఁగి నే - నడిగితి ననుచు
నుడువుము పవనత - నూజ! మున్నగను
తల్లిదండ్రుల నన్న - దమ్ములఁ బాసి
యెల్లభోగముల మీ - యింట నేమాని
వచ్చిన తరువాత - వనులందు నన్ను
మచ్చిక నందఱి - మాఱుగా నీవు
రక్షించి నన్ను నా - రక చేయి వదల
దక్షుఁడవగునీకుఁ - దగవౌనె? యనుచు
సౌమిత్రితో రామ - చంద్రుఁడు వినఁగ
నామాటగాఁగ వి - న్నప మాచరింపు;

తలిదండ్రులని మమ్ముఁ - దలఁచును దండ్రిఁ
దలఁపఁ డాయనఁజూచి - తన ప్రాణవిభుఁడు
దయఁగలవాఁడు 'సీ - తా' యంచు వచ్చి
శయనవాసము చెంత - సైదోడువోలె
యాకలి యరసి తి - య్యని పండ్లు నచటి
పోకపాళెల మాంస - ములు దెచ్చి యిచ్చు
గంటికిఱెప్పయై - కాచు నేవేళఁ
గంటెఱుంగడు నిలు - కడఁ గలవాఁడు
పసి బిడ్డవలె నాదు - పరిచర్య సేయు
విసువఁ డేమఱఁ డేక - వృత్తంబు వాఁడు
అట్టి లక్ష్మణునితో - నడిగితి ననుచు
గట్టిగా ముమ్మాఱు - గాఁబల్కుమీవు
భారకుఁడైనట్టి - భానుజుతోడ
నేరూపమునఁ బల్కి - యీకార్యమునకుఁ
బురికొల్పవలయునో - పొసఁగిన యట్టి
సరణిగాఁ బలికి ద - శగ్రీవుఁ దునిమి
నన్ను రాఘవు పాద - నళినముల్ చేర్చు
నెన్నిక మఱువక - యేరీతి నీకు
సరిపోయినటులాడి - సంకల్పసిద్ధిఁ
బరగుము నాకేమి - పని నీకె తెలుసు
నెలకు మిక్కిలి దాల్ప - నేరఁ బ్రాణములు
తొలుత నింద్రునిచేతఁ - దోయజాక్షుండు
విష్ణుఁడు సేయించి - వెలుతులు దీర్చి
వైష్ణవయాగ ది - వ్య ప్రభావమునఁ

పాతాళ బిలమునఁ - బడిపోయినట్టి
శాతమన్యవమహై - శ్వర్యంబు మఱల
నిచ్చినకైవడి - నీవు రాఘవునిఁ
దెచ్చి సంగరయాగ - దీక్షితుఁ జేసి
నన్ను జేకూర్చి పు - ణ్యముఁ గట్టుకొమ్ము
బన్నంబుఁ దీర్పు మా - పద నివారించి !"
అని తన జిలుగుఁ బ - య్యంట చెఱంగు
కొనఁగొంగుముడి వాలు - గోళ్ళచే విడిచి
మానినీమణి శిరో - మణి హనుమంతు
చే నిచ్చుటయు నంది - శిరసావహించి
మేను గొంచెము చేసి - మేరువుగాలి
లేనిచో నురక చ - లింపకున్నటులఁ
గన్నులుంగరము లొ - క్కట మొగిడించి
సన్నుతింపుదు "రాము - చరణముల్ దలఁచి
మఱలిపోవుదునని - మదిలోన నెంచి
కరువలిపట్టి యా - కల్యాణి కనియె.
"ఇదె చనుచున్నాఁడ - నేఁ దత్తు రాము !
కొదవలన్నియుఁ దీఱెఁ - గులములోఁ దనకు
వన్నెవాసులు గల్గె - వైదేహి ! యింత
మిన్నగల్గిన తల - మిన్న యిచ్చితివి
అనుమతియే ?" యన్న - ననిలనందనునిఁ
గనుఁగొని మిథిలేంద్ర - కన్య యిట్లనియె.
"పోయిరమ్మిపుడ య - భ్యుదయమౌఁగాక
మాయన్న ! యనిలకు - మారక ! నీకు,
నీ శిరోమణిచేత - నింకిటమీఁద

దాశరథుల మన - స్తాపముల్ దీఱు
నందుచే నుత్సాహ - మగ్గలికయును
జెంది మావారు వ - చ్చి జయింపఁ గలరు
తరణితనూజుఁడు - తన సేననెల్లఁ
బురికొల్పి లంక యి - ప్పుడె చూఱవట్ట
నీవు పూనిక కార్య - మీడేఱుఁ జనుము !
కావలసిన నేఁడు - క్రమియింపు మిచట
నలసినవాఁడ వి - య్యంబుధి దాటఁ
గలవె ? సామాన్యమే ? - కన్నుల నిన్నుఁ
జూచుచు నీతోడ - సుద్దులాడుచును
నాచింత మఱచి యుం - డఁగ నేల కలుగు ?
భాగ్యహీనత నిన్నుఁ - బనిచెదఁ జెలిమి
యోగ్యుల వీడఁ జే - యుట సౌఖ్యకరము
యెడవాయునది దుఃఖ - మిఁక నిన్నుఁ బాయ
గడియయైనను బ్రహ్మ - కల్పమైతోఁచు.
తడవుగాఁ బ్రాణముల్ - దాలుపు శక్తి
వొడమ దీమీఁద నా - పుణ్యమెట్టిదియొ ?
ఎట్టులున్నదియొ నీ - హృదయప్రచార
మెట్టుగాఁ దన తపం - బీడేఱఁ గలదొ ?
నమ్మిక నున్నవా - నరబలంబునకుఁ
గిమ్మన వంచునే - కీలాలరాసి ?
గరుడఁడు నీవును - గాడ్పును రాము
తరణిసూనులు సుమి - త్రాకుమారకుఁడు
దాఁటఁ జాలుదురీ యు - దన్వంతుఁ గాక
యేఁటిమాట కపీంద్రు - లెట్లు రాఁగలరు ?

ఐన పీడన నెంత ? - యర్కజునంత
వాని సహాయంబె - వలె నింతెకాని
వచ్చునే యెదుర నా - స్వామి విల్లంది
చిచ్చుటమ్ములు గురి - సిన నేరికైనఁ
దోడాస సేయునే ? - తోయజారాతిఁ
జూడఁ జెదిర్చిన - చో రామవిభుఁడు !
తోడితెమ్మొటులైనఁ - దోయధి దాఁటి
నేఁడె చేరుదె రాము - ని సమీపమునకు ?
పోయెదవే ? ”యన్న భూమిజఁ జూచి
ధీయుక్త వానరా - ధిపుఁ డిట్లులనియె.
‘ జనయిత్రి ! వానర - సాధారణులకు
వననిధి లంఘింప - వచ్చునే యనుచు
నంటివి నా స్వామి - యర్కనందనుని
బంటులకిది యెంత - పని ? వినవమ్మ
నాకన్న నధికులు - నాసముల్ గాని
నాకుఁ దక్కువమైన - నగచరాధముని
వెదకి చూచెదమన్న - వేలంబులోనఁ
బదికోట్లు కొకనిఁ జూ - పఁగఁ జాలరొకరు ?
ఒక్కమ్మా టూరుపు - పుచ్చుక నడుమ
గ్రుక్కక జలధి చం - గున దాఁటఁగలరు
కపివీరులెల్ల కి - గ్గాడి వానరుఁడఁ
దపనాత్మజుని చెంతఁ - దాకొక్కరుండ
రామలక్ష్మణులెట్లు - రానేర్తురనిన
నోమానవతి ! నాభు - జోరుపీఠముల
నిరువుర ధరియించి - నెగిరియేవచ్చి

నురుమింతు నీరావ - ణు సరాక్షసముగ !
పూఁట కాఁపులు రఘు - పుంగవు శస్త్ర
కోటి నావూనికిఁ - గొనసాఁగఁజేయు
నాసత్యమాన మె - న్నఁడుఁ గల్లలాడ
నో సాధ్వి ! యిపుడె పో - నోపుదు నేను
సింగంబునకు వెఱ - చిన మదేభంబు
సంగతిఁ బంచాస్త్ర - సాయకంబులకు
లొంగినవాఁడు తా - ళునె రాకతేపె ?
కాఁగల్గియున్నట్టి - కార్యముల్ గలవు
చెవులార కపివీర - సింహనాదముల
రవళియు దశరథ - రామకోదండ
రణదురుజ్వాలతా - రావంబు ఘోర
రణహతస్వజనకా - రణదైత్యయువతి
రోదనంబులును మ - రుల్లోకసాధు
వాదంబు విందువా - వలహితంబులుగ
నామాట వినియు క్ష - ణంబైన నోర్చి
నీమగఁడీకఁ దాళు - నే ? యేఁటికమ్మ
యీ విచారంబు నీ - వెఱుఁగవుగాక
నీవిభు మదిఁగాన - నే చూచి యేను ? "
అనుచు నమ్మికలిచ్చు - హనుమంతుఁజూచి
యనుకంపతో వసు - ధాత్మజ వలికె.

—: సీత హనుమంతు నాశీర్వదించి పంపుట :—

" వాడుఁ దేఱితి నీదు - వదనంబుఁ జూచి
నేఁడెట్టిదో పది - నెల్లకీదినము

కల్యాణకరమయ్యెఁ - గరుణింపుమని య
హల్యామహాదోష - హారితో నీవు
తెలుపుము కాశ్మీర - తిలకంబు నీదు
నెలవంటి మోముపై - నిన్నెడవాయు
నాఁడు దీర్చితిగాన - నాయానవాలు
చూడుము తలఁచి యం - చు వచింపుమీవు.
కాకాసురుని దుండ - గము లేకతమున
వాకొను మితరు లె - వ్వరు విననీక
తలమానికం బిమ్ము - తరణినందనుని
తలమానసులనెల్లఁ - దలఁచితిననుము.
రాముని మారుంగ - రముఁ జూచి చూచి
భూమిజ యోర్వక - పొగిలెడి ననుచు
నక్కడి పెద్దల - యందఱితోడ
మక్కువవుట్ట నా - మాటగా ననుము.
ఈ శిరోమణి యిచ్చి - యిఁక నెలగాని
క్లేశంబునకుఁ దాళ - లేనిటమీఁద
నీవు వచ్చుటచేత - నిమిషంబులోనఁ
బోవు ప్రాణములు గొ - బ్బున మఱల్చితిని
రావణునకు దయ - రాదు నామీఁదఁ
జావునకును దెగు - సందేహమేల ?
నన్ను రక్షింపు వా - నరవీర !” యనుచుఁ
గన్నీరు నించి గ - ద్గదకంఠి యగుచు
శోకించు సీతను - జూచి యేమియును
వాకొనలేక పా - వని యూరకున్న

మఱియు జానకి హాను - మంతునితోడ
పరమహితాదర - ప్రౌఢి నిట్లనియె.
"గుఱుతు వేడితివి నా - కోర్కె దీర్చుటయె
గుఱుతింతె కాకవి - గుఱుతులు గావు.
మాయన్న నీవు నే - పంబుతో వేగ
పోయిరమ్మిఁకఁ దల - పూ వాడకుండ.
త్రోవలో విఘ్నముల్ - ద్రోచి ధైర్యంబు
లావును విజయ వి - లాసంబుఁ గాంచి
మేలొందు" మనిన భూ - మిజ మాటలోనె
వేళంబె యాకపి - వీరశేఖరుఁడు 3360

—: హనుమంతుఁడు రావణుని శక్తిని పరీక్షించుటకు నశోక వనమును పాడుచేయుట :—

"వచ్చితీ లంకకు - వైదేహిఁ గంటి
ముచ్చనే డాఁగి రా - మునిఁ జేరఁబోవ ?
కనిపించుకొనియెదఁ - గాక యశోక
వనమెల్లఁ గూల్చి రా - వణుఁ డావ మెఱిసి
సామాద్యుపాయముల్ - చనదిట్టియెడలఁ
జేమీఁది యిటునడ - చినఁ గార్యమునకు
దండనోపాయంబె - తగుఁ గాన వీని
దండించుటొప్పు సీ - తానిమిత్తముగ
రాక తీరదు రఘు - రామున కేను
వాకొన్న యప్పుడే - వచ్చు దండెత్తి 3370
వీని బలాబల - వృత్తముల్ చూచి
కాని పోరాదేను ; - కనిపించుకొన్నఁ

బోరికి నంపక - పోఁడు రాక్షసుల
నీరావణుఁడు వారి - నెల్ల వధింప
నందుచే బలహాని - యగుఁ గొంతవీరి
కిందఱి శౌర్యంబు - లేర్పడుఁ దనకు
రావణు హృదయవ - ర్తన మేనెఱింగి
పోవుట లెస్స చ - ప్పుడుగాక యుండ
చననేల నాకని ” - శతముఖోద్యాన
వనసన్నిభాశోక - వనము నీక్షించి
యుత్తాలమై వాల - ముడువీధి నాడ
నుత్తరముఖముగా - నుత్తుంగ కనక
గిరినిభగాత్రుఁడై - కేసరిసుతుఁడు
బరవసంబున నూరు - భాగసంజనిత
పవన నిర్ఘూర్ణిత - పాదపగుల్మ
నివహుఁడై కనకమ - ణీ సౌధయూధ
కాసారశతదీర్ఘి - కాకాయమాన
భాసమానంబై సు - పర్వాలకైనఁ
దేఱి చూడఁగరాని - దేవారి విభుని
యారాము నంతయు - నారాముదూత
పెఱికి వేఁటాడి ద - ర్పించి దైత్యులకు
వెఱపు పుట్టించి దో - ర్వీర్యంబు మెఱసి
యారామసాలంపు - హోద్వారసౌధ
తోరణంబున నిల్చి - దుర్వారుఁడగుచు
దిక్కులు చూచుచోఁ - దెలవాఱవచ్చెఁ
ఒక్కట లంకలో - నుల్కలు రాలె !
ఆవేళ మేల్కని - యవనిజ చుట్టుఁ

గావలియున్న రా - క్షసభామలెల్ల
నల్లనికొండ చం - దంబునవాల
మల్లార్పుచును దోర - ణాగ్రంబునందుఁ
గదలక యున్నట్టి - కపివీరుఁ జూచి
బెదరి జానకిఁ జూచి - భీతిఁ దొట్రిలుచు
"వీఁడెవ్వఁ డమ్మ ! యీ - విపినంబుఁ గూల్చి
నాఁడు ? దర్పించి యు - న్నాఁడు వాకిటను.
నీతోడి మాటాడి - నీ యనుగ్రహము
చేత నీవనముఁ గూ - ల్చె నశంకవృత్తి
వెఱపు వుట్టెను మాకు - వివరింపు"మనిన
ధరణిజ దనుజకాం - తలకు నిట్లనియె.
"ఎవ్వడో వాఁడు మీ - రెఱుఁగుదు రిట్టి
నవ్వులు గలవె ? వా - నరమూర్తిఁ దాల్చి
వచ్చినవాని రా - వణుఁ డంపెనేమొ.
ఇచ్చోటి కదిగాక - యేరాక్షసుండు
మాయావియై యీ క్ర - మమునవనమ్ము
రాయిడిచేసి తో - రణమెక్కినాఁడు
వానికిఁ దెలుసు నా - వల మీకుఁ దెలుసు
నేనెఱుంగుదునె పొం - డెటు పోతిరేని."

—: సీతవద్ద కాపున్న రాక్షసస్త్రీలు రావణునితో అశోకవన భగ్న వృత్తాంతముఁ దెలుపుట :—

అన భీతితోఁ గొంద - ఱసురభామినులు
దనుజవల్లభుని చెం - తకుఁ జేరఁబోయి

గజగజ వడఁకుచుఁ - గరములు మొగిచి
యజరారివిభుఁ "డేమి ?" - యన వారలనిరి.
"అయ్యా ! యీవేళఁ గొం - డంత వానరుఁడు
దయ్యమువలె వచ్చి - ధరణిజతోడ
నిండాఁక యేమేమొ - యేకాంతమాడి
నందనోద్యానంబు - నకు జంటయైన
మన యశోకవనంబు - మాటమాత్రమునఁ
దన యిచ్చవలయు చం - దమున నుగ్గాడ
శింశుపావృక్షంబు - సీతకై యునిచి
కింశుకవకుళకం - కేళిరసాల
పనసనింబకదంబ - పాటలప్రముఖ
వనమహీరుహముల - వసుధపాల్చేసె !
పాకశాసనుఁడు పం - పఁగ వచ్చినాఁడొ
కాక కుబేరుఁ డి - క్కడికిఁ బొమ్మనఁగ
వచ్చిన దూతయో - వసుమతీతనయ
ముచ్చట దీర్ప రా - మునిపంపు పూని
యేతెంచెనో వాని - యెదురు కట్టునను ?
సీతఁ జేరఁగ వెఱ - చితిమిందఱమును
దలఁపరాదిఁక సీ - తఁ దలయెత్తిచూడఁ
బొలియించువాఁడు మీ - బోటులనెల్ల !
కావలసినయట్టి - కార్యంబుఁ జూడు
మావల నీచిత్త" - మని పల్కునంత
"ఏమేమి ?"యని కన్ను - లెఱ్ఱగాఁ జేసి
రోమముల్ మిగుల ని - ట్రుపడంగ నలిగి

మందు దీపముల సం - పఁగి నూనె వడియు
చుండుకై వడి నశ్రు - లుప్పతిలంగ

—: రావణుఁడు పదివేలమంది రాక్షసవీరులను హనుమంతునిపైఁ బంపుట :—

నలుబదివేలు దా - నవ వీరభటుల
బలశౌర్యములఁ దన - పాటి వారలను
బిలిపించి "నేఁడొక్క - పెనుగ్రోతి వచ్చి
చిలివిషంబులు జేసి - సీతయున్నట్టి
వనమెల్లఁ బెఱికి యె - వ్వరి లెక్కఁగొనక
మనతోఁట వాకిటి - మంటపాగ్రమున
నున్నది దాని బిగా - రొడిసి పోనీక
వెన్నంటి యాజ్ఞఁ గా - వింపుఁడుపోయి."
అనవారు శలభంబు - లనలంబులోనఁ
గనియుఁ గూలఁగఁ బోవు - గతిఁ జేరఁబోయి
భానుని కరముల - పాటినిశాత
నానాస్త్రకోటి వా - నయుఁబోలి కురియ
నవి యెల్ల హనుమంతుఁ - డలవోకగాఁగ
నవలికివలికి వా - లాగ్రంబుచేత
వారించి శౌర్యదు - ర్వారుఁడై తోర
నారూఢుఁడై యట్ట - హాసంబుఁ జేసి
"జయమొందు శ్రీరామ - చంద్రుఁడు నేఁడె
జయశాలి యగును ల - క్ష్మణకుమారకుఁడు
రామపాలితుఁడు మా - రాజు సుగ్రీవుఁ
డాతత జయశాలి - యై యొప్పఁగాక

కోసలేంద్రునకు ర - ఘుప్రవీరునకు
దాసుఁడఁ బవమాన - తనయుఁడ నన్ను
హనుమంతుఁ డందు రా - హవమున రిపులఁ
దునుముదుఁ దరులు న - ద్రులు బ్రయోగించి
సరిగారు రావణ - శతసహస్రములు
దురములో నొకవీనిఁ - దునుమాట యెంత !
నాదు శక్తిని వీని - నగరమంతయును
వైదేహి వెదకి యీ - వనములోఁ గంటి
మాటలాడఁ గృతార్థ - మతినైతి, వనము
వే టాడితిని నాదు - పెంపెల్ల మెఱసి
యిదె పోవుచున్నాఁడ - నెఱుఁగ మేమనక
కదిసి కన్గొనుఁడు రా - క్షసయోధులెల్ల."

—: హనుమంతుఁడు వారినందఱిని సంహరించుట :—

అనునంత వారెల్ల - హనుమంతుమీఁదఁ
గనలి దివ్యాస్త్ర సం - ఘముఁ బ్రయోగింపఁ
బరిఘ మొక్కటి కేలఁ - బట్టుకొఁ దాఁటి
బిరబిరఁ ద్రిప్పి యా - భీలసత్వమున
నందఱ నురుమాడి - యని నెదిరింప
నెందు నెవ్వరు లేక - యెగరి మింటికిని
గదతోడ వేడెంబు - గాఁ బన్నగేంద్రుఁ
బొదివి పట్టిన పక్షి - పుంగవు రీతి
నెప్పటి తోరణం - బెక్కి నిప్పుకలు
కుప్ప వోసిన తెఱం - గున బ్రకాశించు
హనుమంతుఁ గనుఁగొని - హతశేషులైన

దనుజులు భీతిచే - దశకంఠుఁ జేరి
యంతయు నెఱిఁగింప - నతఁడు గోపించి

—: రావణుఁడు జంబుమాలిని హనుమంతునిపైకి బంపుట :—

యంతకు రీతిఁ బ్ర - హస్తకుమారు
మగఁటిమిఁగల జంబు - మాలినిఁ జూచి
పగవాని నడచిన - పనిఁ దేట పఱచి
చనుమన్నవాఁడు రా - క్షససేనతోడ
ననికి నేతేరక - యటమున్నగాఁగఁ
బొద్దుపోకల వన - భూమిలోఁ జెంత
మిద్దెలు పడఁద్రోచి - మేడలుఁగూల్చి
చప్పరంబులు ద్రొబ్బి - చదలెల్ల నిండ
దెప్పరంబుగ నార్వ - దిగులొంది యచటి
కావలియున్న రా - క్షసులెల్లఁ దమదు
ప్రావులకొద్ది నా - లములకుఁ జేరి
పొడుఁడు పొడుండని - పోనీక గంగ
నుడివోలి నలుగడఁ - జుట్టుకపోర
హనుమంతుఁ డమ్మహా - యతనంబులోనఁ
గనకమయంబైన - కంబంబు వెఱికి
బిరబిరఁ ద్రిప్పినఁ - బెనుమంటలందుఁ
గఱికట్టి సౌధంబుఁ - గాలిచి కూల్చె.
ఆ మహాస్తంభంబు - హస్తిహస్తమునఁ
దామఱతూడు చం - దంబున మెఱయ
దానిచే నెదిరించు - దానవావళినిఁ
పీనుఁగు పెంటగాఁ - బీచంబడంచి

మఱల నవ్వాకిటి - మాళిగె మీఁద
గరువంబు దిటమున - గ్గలికయు మీఁది
భుజమున కంబంబుఁ - బూనుకఁ దనదు
విజయంబు లంకలో - వినరాఁగ నార్చె.
" కేసరిసుతుఁడ సు - గ్రీవానుచరుఁడ
దాసుఁడ నేను సీ - తానాయకునకు.
వారు వొమ్మని పం - పవచ్చితి నమ్మ
వారి పాదంబుల - వ్రాలి యేవచ్చు
పనిదీర్చి మఱలెద - బవరంబులోన
నను మాఱుకొన రావ - ణ సహస్రమైన
చాలరు, నాస్వామి - జలజాప్త తనయుఁ
డేలిన పంపున - నీసీత కొఱకు
వెదకఁ బోయిన కపి - వీరులొండేను
పదినూఱువేయి వే - ల్పదులొక లక్ష
కోటిగజంబుల - కునుగల్గు సాహ
సాటోప సత్త్వంబు - లమరని యట్టి
కపులెల్ల దిశలకుఁ - గదలినా రట్టి
యపరిమితంబౌ మ - హావానరాళిఁ
జేకూర్చికొని వచ్చి - శ్రీరామచంద్రుఁ
డీకంధి దాఁటి ద - హించు నీలంక !
అనిలోన పుత్రపౌ - త్రాదులతోడ
దనుజేంద్రుఁ దునుము సీ - తానిమిత్తముగ
నను నెదిరింప ను - న్నారు మీ వీటి
దనుజులలో ! ధర్మ - దారి వట్టుదునొ ?
పలుకుఁడు హితశేవ - పలలాశు ''లనుచుఁ

బలుకునంతట మిన్ను - పరియలు గాఁగ
విల్లుమోపెట్టుచు - "వేఁడి వానరుఁడు ?
త్రుళ్ళడంచెదఁ బట్టి - తోఁకయుఁ జెవులు
తెగఁగోసి విడిచెదఁ - దెగి పారనీక
నగచరుఁ బట్టి దా - నవులార !" యనుచు
నరుణ చందనభూష - ణాంబరమాల్య
సురుచిరద్యుతులతో - సూర్యుఁడో యనఁగ
పూజించి ఖరములఁ - బూన్చిన యరద

—: జంబుమాలి యుద్ధము - హనుమంతుఁడు జంబుమాలినిఁ జంపుట :—

మాజంబుమాలి చా - యన వఱపించి
సటలు వీడఁగ నర్ధ - చంద్రబాణమున
నిటలంబు నాటించి - నిశితాస్త్రయుగళిఁ
గరములఁ గ్రుచ్చినఁ - గరము కోపించి
హరివీరుఁ డతిశోణి - తాస్యంబుతోడ
గిరి శిఖరము పెల్ల - గించి పైనేయ
దురము సేసెను వాఁడు - తూపులచేత
శైలంబు వమ్మైన - సామీరి మీరి
సాలంబు వేలంబ - సంధించి మించి
వ్రేసిన దానవ - విభుఁడు తూణమున
దీసిన బలుదూపుఁ - దెగనిండఁ దీసి
చెట్టు చూర్ణముఁ జేసి - చిట్టాడగాలి
పట్టిపై వాఁడైదు - బాణముల్ దొడిగి
రొమ్ము నాటించిన - రోసంబు మిగుల

తెమ్మరకొడుకు న - ల్దిక్కులు జూచి
యొక పరిఘంబెత్తి - యురువడి నేయ
నొకరూప మిదియని - యూహింపరాక
తేరువాజులు సార - థియు రథికుండు
నూరి చూర్ణముఁ జేసె - నోయని తలఁపఁ
జెవి కన్నుముక్కును - జెక్కు నగంబు
లివియవి యనరాక - యిలతోడఁ గలియ
హతశేషులగు దైత్యు - లా జంబుమాలి
హతుఁడైన తెఱగు ద - శానను తోడ

—: రావణుఁడు మంత్రితనయుల నేడుగురిని హనుమంతునిపైకి బంపుట - అతఁడు వారినిఁ దునుముట :—

వినుపింప నాగ్రహ - వృత్తితో మంత్రి
తనయుల నేడ్వురం - దాఁ బిలిపించి
పనిచినఁ దల్లులు - పలవింపుచుండ
జనకులు పుత్రవాం - ఛల శోకమొంద
పృథుశక్తితో విధి - ప్రేరితు లగుచు
రథములమీఁద సా - రథులు మెచ్చంగఁ
జేరి శిలీముఖ - శ్రేణిచే నతని
వారిధరంబులు - వానయపోలి
కురియించి మించినఁ - గోపించి నాటు
శరములువో మేను - జాడించి పెంచి
తోఁకచే నొకని కు - త్తుక బిగియించి
యూఁకించి యిలఁగొట్టి - యుక్కడఁగించె !

పిడికిటిపోటుచేఁ - బ్రేవులు వెళ్ల
కడుపుపై గ్రుద్ది యొ - క్కని మన్నిగొనియె!
అరచేతఁ జెంపపై - నఱచి యొక్కరుని
గరువంబుతో మన్నుఁ - గఱచుకోఁ గొట్టె!
మోచేతిపోటున - ముక్కుచుఁ బోర
చాచుక పడఁగఁ బీ - చమడంచె నొకని!
ఊకడాకడ పక్క - టెమ్ములు విఱుగు
మోకాటఁ బొడిచి దు - మ్ములు రాల్చె నొకని!
కాలిగొద్దినిఁ దన్ని - కాలుని వీడు
పాళెవట్టుగ నిచ్చి - పనిచె నొక్కరుని!
ఒకచెట్టు వెఱికి తా - నురముపైఁ గొట్టి
చెకబికల్ చేసి ని - ర్జించె నొక్కరుని!
హనుమంతుఁడీరీతి - నసురేశు మంత్రి
తనయుల నేడ్గురిఁ - దఱిమి వధింప
విఱిగెను తేరులు - విఱిసె నేనుఁగులు
తెఱలె నశ్వంబులు - తెగియెఁ గాల్బలము
పగిలె ఖేటకములు - పడియెఁ గేతువులు
నొగిలె ఛత్రంబులు - నుగ్గయ్యెఁ దలలు
తునిగెఁ జామరములు - తొరగె రక్తములు
చినిగె మేమరువులు - చెదరె మాంసములు
ఆడెభూతము లట్ట - లాడె పిస్వాధి
మూడె దైత్యులకు రా - ముని బంటు గెలిచి
మగుడఁ దోరణమెక్కె - మడియుచోఁ గొంత
మిగిలి పాఱిన మూఁక - మొఱఁకువ లేక
వినిపింప నంతయు - విని రావణుండు

—: తన మంత్రులైదుగురిని రావణుఁడు పంపుట :—

తన మంత్రులను బంచ - తంత్రకోవిదుల
ననఘచిత్తుల విరూ - పాక్షుయూపాక్షు
ప్రఘనుని దుర్ధరు - భాసకర్ణాఖ్యుఁ
బిలచి యేవురతోడ - "బిరుదువానరుఁడు
చలపట్టి దైత్యులఁ - జంపుచున్నాఁడు
వాఁడెవ్వఁడో యక్ష - వరుఁడో వేలుపుల
ఱేఁడో నాపైఁ బచా - రించి మార్కొనిన
సురసిద్ధచారణ - స్తోమంబులోని
దొరయెవ్వఁడో మాయ - తోనిట్లు చేరి
మున్ను నాచేనైన - మోసంబుఁ దీర్ప
నెన్ని యీ మూర్తితో - నేతేరనోపు।
ఎంత లేదని పోక - యెంతయుఁ బుద్ధి
మంత్రులై చాలస్తో - మములతోఁ గదలి
మిముఁగాచుకొని యవ - మిక లేక సాధ
నములతో దైత్యసై - న్యములతోఁజనుఁడు.
వాలిన శౌర్యని - ర్వాహకంబులను
వాలి భానుజ జాంబ - వన్నలతార
నీరాది వానరుల్ - నిర్జరశ్రేణి
నాలంబులలో మెచ్చ - రది యెఱుంగుదును
వారిలో నొకరుఁ డీ - వానరుఁడున్న
వారికే దదియో య - వార్యశౌర్యంబు !
కదనంబున జయంబుఁ - గామించి తన్నుఁ
బదిలంబు చేసుకోఁ - బరగునెవ్వరికి ?
దుడుకుగాఁ బోవక - దుర్జయు నతనిఁ

దోడరి జయించి వ - త్తురుగాక మీరు
చనుఁడ "ంచుఁ దనదు పం - చప్రాణములను
బనిచినగతి వారిఁ - బనిచిన వారు
బలములతోఁ గూడి - బాలార్క-బింబ
తులితప్రకాశగా - త్రుని హనుమంతుఁ
జేరఁగఁ బోయి వీ -క్షించిన వారి
నారామ దాసుఁడ - ల్లంతటఁ గాంచి
సరకు సేయక నల్ది - శలు గనుఁగొనుచు
ధరణిపై వాలంబు - దాటించు కొనుచు

—: హనుమంతుఁడు వారితో యుద్ధము చేయుట - వారినైదఁగురిని సంహరించుట :—

నున్నచో దుర్ధరుఁ - డుత్పల చాప
సన్నద్ధ శతపంచ- సాయకంబులను
వేసిన నవిపోవ - విసరి కుప్పించి
కేసరిసుతుఁడు నిం - గికి నెగయుటయుఁ
బాఱకు మెక్కుడఁ - బఱచెద ననుచుఁ
క్రూరాస్త్రములు వెను - కొని ప్రయోగించి
యఱముటయును బర్వ - తాగ్రంబునందు
మొఱయుచుఁ బిడుగుల - మూటవడ్డట్లు
రభసంబుతోడ దు - ర్ధరు తేరుమీఁద
నభమున నంజనా - నందనుఁడూర్చి
దుమికిన నరదంబు - తోవాఁడు చదిసి
నిమిషమాత్రంబున - నేలతోఁ గలసె!

ఆ విహూపాత్రయూ - పాత్రులు తీసి
పోవక ముద్గరం - బులు ప్రయోగించి
నొప్పించుటయును హ - నూమంతుఁడొక్క
గొప్ప భూరుహముఁగై - కొని యిరువురను
బడఁగొట్టి యసువులఁ - బాపిన ముగురు
మడిచిపోవుటఁ జూచి - మచ్చరింపుచును
భాసకర్ణుండును - బ్రఘనుండు తోమ
రాసిలతాహస్తు - లై యెదురించి
జగడింపుచో నొక్క - శైలశృంగంబు
నగలించి వారిపై - నదలించి వ్రేయఁ
బడె గంట పడ్డట్లు - బవరంబులోనఁ
బడిరి వారిరువురు - ప్రాణముల్ విడిచి!
వెంట వచ్చిన దైత్య - వీరుల వెంట
నంటి పోనీయక హ - యమును హయము
రౌతును రౌతును - రథమును రథము
సూతుని సూతుని - సుభటుని సుభటు
నేనుఁగ నేనుఁగ - నిట్టట్టు గొట్టి
పోనీక దనుజులఁ - బోకడ వెట్టి
పోరు తీఱె నటంచుఁ - బోరు తీరుటయు
తోరణాగ్రంబుపైఁ - దొలుతటియట్ల
వసియించు మాట రా - వణుఁడాలకించి

—: రావణుఁడు యక్షకుమారునిఁ బంపుట :—

మసలక యక్షకు - మారునిఁ బిలిచి

పనిచిన 'సెలవంది - బంగరు రథము
మనసు రంజిల నెక్కి - మణిమయాభరణ
కుండలకోటీర - కోదండచండ
కాండప్రకాండ ప్ర - కాశితుండగుచుఁ
జతురంగబలముల - జతకట్టు చేసి
ధృతిశాలియై బారు - దీరుక నడచి
తోరణాగ్రంబుపై - దుర్వాంతవిలయ
మారుతాప్త నిలస - మాన తేజమున
మీరు ధీరాత్ము స - మీరకుమారుఁ
డేరి కన్గొని శర - త్రితయంబు చేత
నాఁటించుటయుఁ జఱు - నవ్వుతో నిలకు
దాఁటి యక్షకుమారు - దర్పంబుఁ జూచి
గిరులును దరువులం - కించి యుంకించి
బిరబిరవైవ న - భేద్యవిక్రముఁడు
అక్షుఁడు శౌర్యహా - ర్యక్షు డువాని
లక్షించి వాలమ్ము - లను వమ్ముచేసి
శరములు గుఱియంగ - సమరంబు మిగుల
నరుదని వినుతించి - రమరులు మింట!

—: హనుమంత యక్షకుమారుల యుద్ధము :—

ఆవేశఁ గరువలి - యసియాడ వెఱచె
త్రోవలు దప్పి రిం - ద్రుఁడు భాస్కరుండు
అలమట లొంది కు - లాద్రులు వడఁకె
జలరాసి కలఁగె ర - సాచక్రమగలె
దిక్కులేర్పడవయ్యె - తిమిరంబు కప్పె

చుక్కలు రాలె పాం - సువులెందుఁ బొదివె!
అంతటఁ గోపించి - హనుమంతు మీఁదఁ
బంతంబుతో నైదు - బాణంబు లేసి
యపరంజిపింజల - యమ్ములవాని
కపివరాచలముపైఁ - గదిసి ముంచుటయుఁ
దన తనువెల్ల ర - క్తంబులఁదోఁగ
హనుమంతుఁ డతని సా - హసమాత్మమెచ్చి
నవ్వుచు మేనిండ - నాఁటు నస్త్రముల
దవ్వులఁ బోవ వి - దర్చి యార్చుచును
సరణి నూతనతృణ - ఛన్నకూపంబు
కరణి నిల్చిన వాఁడు - గజము చందమున
సింగముల్ నొగలఁ బూ - న్చిన తేరుఁద్రోలి
సంగరవీథి న - క్షకుమారుఁ డలిగి
కదియరా వానరా - గ్రణి మింటి కెగయ
నది చూచి చేవిలు - నమ్ములు వూని
పక్షీంద్రుఁడెగసిన - పగిది నవ్వెంట
నక్షాసురుఁడు రాఁగ - హనుమంతుఁడెదిరి
నవ్వుచు "సౌరార! - నావెంట నెగసె
చివ్వకు మగఁటిమి - చేఁ గొంకులేక।
అక్కట! చంపఁ జే - యాడునే యింత
చక్కనివాని రా - క్షసుఁడైన నేమి?
తల్లడిల్లక యిట్టి - తనయునిఁ గన్న
తల్లి యోరుచునె పు - త్రవ్యథచేత?
అటులైన వీఁడు కా - లాగ్నియ పోలి
పటుతరాశని కల్ప - బాణజాలముల

దండపెట్టఁగ నిందు – తనచేత నేఁడు
నిండెఁ గాఁబోలు నీ – నికి శతాబ్దములు !”

—: యక్షకుమారుని మరణము :—

అని చేతఁ జఱచిన – నరుదెంచు హరులు
తునిసి దుమ్మయి తన – తోఁ ధాత్రిఁ బడిన
విదిలించుకొని లేచి – వీరరసంబు
చిదిమి పెట్టిన యట్లు – సిగ్గు రోషంబు
చిట్టాడఁగ మొలాము – చేసిన కత్తి
పట్టి చేతనుగాని – పట్టి బీరమున
దివమున కెగసి హే – తి కొలఁది నణికి
జవముచేఁ గేడించి – చౌకళించుటయుఁ
నా నఱుకున కిను – మంతయుఁ జీఱ
వానరకుల నూళి – వక్రకాయమున
సోఁక కున్నడ వానిఁ – జూచి పోనీక
తోఁకచే వానికు – త్తుక బిగియించి
బిరబిరఁ ద్రిప్పి కుం – భిని మీఁదవైవ
నుఱుమయ్యె దళవద – నుని పిన్నకొడుకు !
అగ్గించి రప్పుడా – హనుమంతు గెలుపు
లుగ్గడింపుచు సుర – వ్యూహంబు మింట !
అచ్చి వచ్చిన తోర – ణాగ్రంబునందుఁ
గచ్చులకై తాను – కాలు ద్రవ్వుచును
“ఇంక నంపక పోవఁ – డెవ్వచ్చెన బంటు
దంకంబునకు నీద – శాననుం”డనుచు

నున్నఁ జావక చిక్కె - నొక్కట పిఱికి
జన్నెపు రక్కసుల్ - జగడంబు తెఱఁగు
నక్షుని పాటును - హనుమంతు గెలుపు
రాక్షసవిభున కే - ర్పడఁ బల్కుటయును
దనకొల్వులో నగ్ర - తనయుని దుర్మ
దుని శూరు నింద్రజి - త్తును విలోకించి

—: రావణుఁ డింద్రజిత్తును హనుమంతునిపైకి పంపుట :—

"ఒక కోఁతి వచ్చి యి - ట్లోడక యక్షు
నకు మృత్యువయ్యె దా - నవకోటిదునిమె
వాని ఖండింపు మ - వార్యశౌర్యుఁడవు
దానవవంశవ - ర్ధనుఁడవు వివిధ
దివ్యశస్త్రాస్త్రవే - దివి సమర్థుఁడవు
కావ్యశిష్యుఁడవు సం - గ్రామభీముఁడవు
అజుని వరంబుచే - నమరేంద్రు గెలిచి
విజయంబుఁ గైకొన్న - వీరాగ్రమణివి.
దేశకాలంబులు - దెలిసి యుపాయ
కౌశలమునను జే - కన్న పోటరివి.
అనిఁ బెక్కుమారు లిం - ద్రాదులఁ గెలిచి
దనుజమాయోపాయ - దారుణక్రియల
నాయంతవాఁడవై - నావు నిన్నెదుర
నీయజాండంబులో - నెవ్వఁడున్నాఁడు ?
మర్కటుఁడతఁడు సా - మాన్యుండు గాడు
కర్కశుండస్త్రముల్ - గాడవువాని !
ఆయుధమరణంబు - నని నపజయము

దాయల భయ మసా - ధ్యములైన పనులు
వాఁడెఱుఁగడు వాని - వధియించువాఁడు
లేడు ' గాలియును గీ - లియు నోడి ' రనుచు
గరువించి పోరక - కనుఁగల్గి వానిఁ
బరిభవింపుము పొమ్ము - పయనమై "యనిన
వల్లె యనుచుఁ దండ్రి - వలగాఁగ వచ్చి
తెల్లని కేతువె - త్తించిన యట్టి
సింగపు రాచతే - జీలీస్చి తెచ్చు
బంగరుతేరిపై - బాలార్క కిరణ
సంకాశరత్నకాం - చన కిరీటాద్య
లంకారములతోడ - లంకాపురంబు
వెలువడి దానవ - వీరులు వడిన
కలను గన్గొని యశో - కవనంబుచెంత
తన వింటి యల్లెమ్రోఁ - తయు బెట్టిదంబు
తన భీమ సింహనా - దంబుల రవళి
తన రథనేమికా - ధ్వని ముమ్మరంబు
తనచెంత బిరుదవా - ద్యంబుల యులివు
తనసేన కలకల - ధ్వానంబు చెవుల
విని "భళిరే!" యని - విశ్వమంతయును
గజగజ వడఁకంగ - గర్జించి మింట
నజర గంధర్వ వి - ద్యాధర యక్ష
చారణ ముఖులు మె - చ్చఁగ వాయుసుతుఁడు

—: హనుమ దింద్రజిత్తుల యుద్ధము :—

తారసించినచోట - దనుజవీరుండు
కనకపుంఖాస్త్ర ప్ర - కాండ వర్షంబు

తనమీఁద నిండ ను - ద్ధతిఁగురియింప
సైరింపఁగలేక - శ్రీరామదాసుఁ
డాకసంబునకు ర - యంబునతో నెగయ
'నెటు వోయెద'ని నిశి - తేషువుల్వఱప
నటునిటుఁ దప్పుచు - నజ్జగాకున్న
చొరవఁగానక చేయి - చూచుక వాని
శరములు వట్టి రా - క్షసుల నేయుచును
తరుశిలావర్షము - ద్ధతి నింద్రజిత్తు
నరదంబుపై ముంప - నమ్ములచేత
నవియెల్లఁ దునిమి ది - వ్యాస్త్రముల్ వైచి
యవశుఁగాఁ జేయ స - మర్థుఁడు గాక
శరముల వీనికిఁ - జావు లేదనుచు
నరుదంది వింట బ్ర - హ్మాస్త్రంబుఁ దొడిగి
ప్రేసిన నది విను - వీథిఁ బోనీక

—: ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్ర ప్రయోగమున హనుమంతునిఁ
గట్టి వైచుట :—

యాసమీరాత్మజు - నదరంటఁ గట్టి
యిలఁ బడవైచిన - నింతయు మేనుఁ
దెలియక మూర్ఛిల్లి - తెప్పిరి లేచి
బ్రహ్మాస్త్రమునఁ గట్టు - వడుటయు మొదటి
బ్రహ్మవరంబును - బ్రహ్మాస్త్రవరముఁ
గడఁ ద్రోయరామియుఁ - గదలక పుడమిఁ
బడి బ్రహ్మమంత్ర జ - పంబు పాంశువుగఁ

జేయ నప్పుడు బిగి - సినకట్లు వదలి
చేయిగాలును గద - ల్చి పితామహేంద్ర
వాయువులఁ దలంచి - వలసినయట్టి
చాయ నేఁగఁగ శక్తి - చాలియు మదిని
"ఏనిట్టులున్న న - న్నితఁడు దోకొనుచు
దానవవిభుని ముం - దటఁ దెచ్చియునుచు
నందుచే వాని మ - ర్యాద లన్నియును
గందు నమ్మీఁదటఁ - గదలి పోవుదును"
అని యచేతనుఁడైన - యట్టిచందమునఁ
గనుఁ దేల్వైచి యే - గతి మున్నువడియె
నట్టి చందంబున - హనుమంతుఁడున్న

—: హనుమంతుని రావణుని సమక్షమునకుఁ
దీసికొనిపోవుట :—

కట్టి యీతని దశ - కంఠుని యెదుర
నునిచెద ననుచు దై - త్యులఁ జేరఁ బిలిచి
జనపనారల త్రాళ్లు - నవరని వాళ్లు
బండిమోకులు దేరఁ - బనిచి "కట్టుండు
కొండకై వడిఁ బడ్డ - కోఁతి" నటంచుఁ
బగ్గంబులను బిగిం - పఁగఁ దనశక్తి
తగ్గబ్రహ్మాస్త్రంబు - తనమీఁది నితర
రజ్జులఁగట్ట నో - ర్వమిచేత నదియె
యజ్జగాఁ దొలఁగిన - నది గాన లేక
కట్టి యీడ్చిన లేవఁ - గని "వీనినేల
కట్టితిఁ గడమ ప - గ్గములచే మఱచి

నారత్రాళులఁ గట్టి? - నాదు బ్రహ్మాస్త్ర
మాఱడిఁ బోయె నై - నటులయ్యె నింక !"
అనితండ్రి సన్నిధి - కరుగుచో వెంట
దనుజులు గుద్దుచుఁ - దరమి కొట్టుచును
లాతముల్వట్టి భ - ళాలునఁ గొట్టి
కోఁతి పాఱుసాటంచు - గొల్లున నగుచు
తోఁకవట్టుక యీడ్చి - త్రోయుచుఁ దమరు
" వేఁకమే నీకని " - వీపెక్కి కొనుచు
" నెందఱెందరిఁ జంపె - నీకోతి పురువు
మందె మేలము లేల ! - మర్దింపు మనుచుఁ
గూడి గుంపులఁగట్టి - కోతిని త్రాటి
నీడిచికొని దాన - వేంద్రుని యెదుర
నునిచినఁ గొలువులో - నున్నవారెల్లఁ
గనుఁగొని " యెవ్వఁడె - క్కడ వానరుండు ?
యేమేమి చేసె ? వీఁ - డేటికిఁ బట్టి
దామెన త్రాళ్ళ నిం - దఱు గట్టినారు?"
అన హనుమంతుఁడు - యక్షాదులైన
దనుజులఁ దునుము వా - ర్తలు తేటపఱుప
" పొడువుఁడు నరకుఁడు - పొరలింపుఁ డగ్నిఁ
బడఁ ద్రోయుఁ డబ్ధిలో - పల వేసిరండు
చంపుఁడు కోయుఁడు - చరులను ద్రోయుఁ
డంపుడు పురిపెళ్ళ - నాజ్ఞ సేయింప !"
అని బెదరింపుచో - నందఱుఁ గనుచు
ననలసంకాశు సిం - హాసనా సీను
నరుణాంబుజేక్షణు - నాజానుబాహు

హరిమధ్య సకలసు - రాసురాసాధ్యు
నూరక వీక్షింపు - చుండంగఁ జూచి
యారావణుఁడు ప్రహ - స్తాది మంత్రులను
గనుఁగొని "యెక్కడి - కపివీఁడు ?" తెలియఁ
డనిన ప్రధానులా - హనుమంతుఁజూచి
"గొంట ! యెవ్వఁడ !" వన్నఁ - గొంకి "సుగ్రీవు
బంట నేన" ని మాఱు - పల్కి వారలకు
తెప్పవేయక మది - రిచ్చపాటొదవ

—: హనుమంతుఁడు రావణుని రాజసమును వైభవమునుఁ జూచుట :—

నప్పుడు గనుచో మ - హాసింహపీఠి
చిఱుతగద్దియ మీఁద - శృంగారరసము
కరువునఁ దీర నా - కారమై నటుల
మేరువుపై ప్రాలు - మేఘమో యనఁగ
చారుతను ప్రకా - శములు శోభిలఁగ
దశశిఖరముల మం - దరనగం బనఁగ
దశవదనముల గా - త్రము వెలుఁగంగ
మింటను హరుమేను - మిహిరద్వయంబు
నంటు చేసుకయున్న - నలిన బాంధవులు
కడమవారలు వచ్చి - కాచి యున్నట్టి
పడువున మకుటముల్ - వైఖరిమీర
కటకకేయూర కం - కణ రత్నదీప్తి
పటలిచే నిరువది - బాహువుల్ దనర
చందురుతోడి న - క్షత్రమాలికలు

నందముల్ దెలుపునా - యకములచేతఁ
దళుకొత్తు కట్టాణి - తారహారముల
వలుద యురంబుపై - వలవొప్పు నపుడు
లాలిత వివిధ బా - లాంక రేఖలను
నీలాంబుదంబు క - న్పించు నట్లనుర
వెలలేని మగరాల - విడిమీరఁ దీర్చ
నలఘు మంజీరంబు - లంఘ్రుల మొఱయ
యిరువురు వేలుపు - టింతులు మరుని
శరములన్నట్లు విం - జామరల్ వీవ
నడపంబుఁ గట్టెడు - నలివేణి చెంతఁ
బడతి యొక్కతె జిల్లు - పావాడ వూన
కాళాంజిఁ దాల్చు జ - క్కవచంటి చెంత
బాలయొక్కతె గిండి - వట్టుక నిలువ
చంద్రహాసము వూను - సతి చెంత నొక్క
చంద్రాస్య సురటి యొ - చ్చరికతో వీవ
నిలువుటద్దంబు వూ - నిన దాని చెంత
వలకారి చెలియ పా - వలు ధరియింప
తరళాక్షి పారిజా - తపు ముడిపువ్వు
సరము పొట్లములు హ - స్తములఁ గీల్కొలుప
ఘుమ్మను మృగనాభి - కుంకుమరసము
కొమ్మలు జాళువా - కోరలఁ దాల్చ
పదములొత్తుచునున్న - పద్మాక్షి తొడలఁ
గదియు పాదము శోణ - కమలంబుఁ గెగడ
కొలువున్న రావణు - కొలువులో నున్న
బలుగొండలనఁ బోలు - భద్రాసనముల

నున్నట్టి దానవ - యోధుల కడలఁ
గన్నవారికి భయం - కర మూర్తులగుచుఁ
గొలుచు నానాకార - ఘోరరాక్షసులఁ
గొలువు సావిడిలోఁ ర - ఘుశ్రేష్ఠు దూత
కలెజూచి తలయూఁచి - "కటకట ! యింత
కలిమి మీఁదట నేమి - గానున్నయదియొ ?
ఎంతటి గాంభీర్య - మెంతప్రతాప
మెంతటి రాజస - మెంత వైభవము !
కారుగదా సాటి - కాలిగోరునకు
రారు పోల్పఁగ సుర - ప్రభువు లీతనికి !
రాక్షసేశ్వరు మహా - రాజమూర్ధన్య
లక్షణమ్ములు కన్ను - లకు విందుచేసె !
తరమెన్నరాని యిం - తటి భాగ్యశాలి
పరకాంతలను బల్మిఁ - బట్టి రమింపఁ
దలఁచక యుండుఁగ - దా వీఁడె కాక
కలుగునే యెల్లలో - కములేల నొకఁడు!
తమ జీవనములకుఁ - దలఁపకుండుదురు
యమరనాథులు వీని - యడుగులు గొల్వ ?
రావణునకు నధ - ర్మమె లేకయున్న
నీవిశ్వమంతయు - నేలక యున్నె ?
ఇఁతటివానికి - నీచెడుబుద్ధి
సంతరించునె ? పాప - జాతి విరించి !"
అనిచూచునంత ద - శాననుండతనిఁ
గనుఁగొని 'యెక్కడి - కపివీరుఁడొక్కో ?
ఎక్కడి కపివీరుఁ - డేను కైలాస

ముక్కుతో నెత్తగం - నూచి కదల్ప
నాఁడుకోపించిన - నందియేకాక !
వీఁడు వానరుఁడే వి - వేకించి చూడ ?"
అని ప్రహస్తునిఁజూచి - "యడుగుమెవ్వారు
వసిచి రిచ్చటికిరాఁ - బనియేమి తనకుఁ ?
వనమేల చెఱచె ? నీ - వానరుండడుగు"
మనుఁడు ప్రహస్తుఁడా - హనుమంతుఁజూచి

—: ప్రహస్తుఁడు హనుమంతుని ప్రశ్నించుట :—

"ఎవ్వరు పొమ్మని - రేల వచ్చితివి ?
చివ్వకై వనమెల్లఁ - జెఱుప నేమిటికి
పలుకుము నిజముగాఁ - బలుకక యున్నఁ
బొలియింతు మెక్కుడఁ - బోనిత్తు మింక !
మాచేతఁ జిక్కి నీ - మనసింక లెస్స
చూచుక మాటాడు - జుణిగి పోరాదు ."
నావిని యంజనా - నందనుఁడపుడు
రావణు చెవిసోఁకఁ - గ్రమ్మఱఁ బలికె

—: హనుమంతుని ప్రత్యుత్తరము - తాను రామకార్యార్థమై దూతగా వచ్చినసంగతి నెఱుకపఱచుట :—

"నిజము పల్కెదఁ గపి - నే యాదు నేను
నీరావణునిఁ జూడ - నిచటికి వచ్చి
యూరకే పోరామి - యుద్యానవనము
పెఱికి వైచితి నన్ను - బెదరింప వచ్చు
సురవైరులను బట్టి - సుంకఁరాల్చితిని

యనిలోన నాకు బ్ర - హ్మావరంబు గలుగఁ
దనుగట్టి తేర నెం - తటివాఁడు గలఁడు ?
ఇతనిఁ జూచుటకునై - యే నింద్రజిత్తుఁ
బ్రతిసేయ నొల్లక - బ్రహ్మాస్త్రముననుఁ
దగిలితిఁ గాని యీ - తనివంటి వాఁడు
పగవాని నాతోడఁ - బట్టి తేఁగలఁడె ?
కపటమేఁటికి ? నాకుఁ - గలిగిన కార్య
మిపుడె తెల్పెద" నని - యిట్టని పలికె
"నీతోడ బుట్టువు - నీరజబంధు
సూతి వానరరాజు - సుగ్రీవుఁ డిపుడు
పనిచిన దూతనేఁ - బవమానసుతుఁడ
హనుమంతుఁ డంద్రు లం - కాధీశ ! నన్ను
రాముఁడు రవివంశ - రత్నము నాదు
స్వామి యిచ్చటికేలఁ - జనుదేర ననిన
దశరథుండను దమ - తండ్రి వొమ్మనిన
శశిముఖి యగునట్టి - జానకీసతియు
తమ్ముఁడు సౌమిత్రి - తనుఁగొల్వ భీక
రమ్మగు దండకా - రణ్యంబుఁ జేరి
సత్యసంధుఁడు రామ - చంద్రుఁడున్నెడను
ప్రత్యవాయము దిన - బ్రదుకు లేదనక
వంచనతో నీవు - వైదేహిఁ బట్టి
కొంచుఁ బోయిన వెద - కుచు వచ్చి వారు
రామలక్ష్మణులు మా - రాజు సుగ్రీవుఁ
గామించియాప్తుని - గాఁగఁ జేపట్టి
ఘనతని సోదరు వాలి - నతిసత్త్వశాలిఁ

ప్రతినఁ దప్పక యొక్క - బాణంబు చేతఁ
బడఁజేసె! వాలి యే - పాటివాఁడనుచు
నడుగఁ దెల్పఁగనేల? - యది నీకె తెలుసు
నావాలి సోదరుఁ - డైన సుగ్రీవు
లావు నాబోటులె - ల్ల నెఱుంగలేరు.
అట్టి భానుజుఁడు ని - న్నడిగితి ననుచు
జుట్టఱికము సేయఁ - జూచి రమ్మనియె!
నారవితనయుని - యానతిచేత
వీరవానరకోటి - విశ్వమంతయును
వెదుకఁ బోయెను లంక - వెదకి రమ్మనుచుఁ
బదువురితోఁ నన్నుఁ - బనిచె నిచ్చటికి
వారెల్లఁ గడలి యా - వల నున్నవారు
తారాంగదాదులిం - దఱు నన్నుఁబనుప
జలధి లంఘించి ని - శావేళలంకఁ
గలయఁ గన్గొని యశో - కవనంబులోన
సీతను బొడగాంచి - సేవించి రామ
దూత నేనని పల్కి - తుందుడుకార్చి
మఱలివోయెదువాఁడ - మదమత్తు నిన్ను
ధరఁగూల్చి కాని వ్య - థా పోవననుచుఁ
దలఁచి నాస్వామి సీ - తాప్రాణవిభుని
తలఁపున కది విరు - ద్ధం బెట్టులనిన
రావణుఁ బుత్రపౌ - త్ర కళత్రయుతము
గా వధింపుదునని - కపినాథుతోడఁ
బ్రతిన వల్కఁగ యేను - బజ్జననుండి
యతని యానతి విన్న - యది కారణముగ

నిను జంపరాదని - నీకు నారాక
గనిపింప నేనిన్నుఁ - గని పోవఁదలఁచి
చెట్టుచేమలు నుగ్గు - చేసి నీవంపి
నట్టి రాక్షసుల బా - హాశక్తిఁ దునిమి
యేల నాకీగోల - యిఁకఁ జాలుననుచు
న లంబు మాని నీ - యాత్మజుచేతఁ
జిక్కిన యటుల వ - చ్చితి గాక యేను
చిక్కుదునే యింద్ర - జిత్తునిచేత ?
నినుగూడ యీలంక - నీవారితోడఁ
దునిమి వైదేహి న - త్తుకపోవఁగలను !
ఆయమ్మ యొడఁబడ - దందుకు నేమి
సేయుదు నీతల - సీత వ్రాసినది
యైన నేమాయె ! ని - న్నావాలిగాఁగ
భానుతనూజుఁడో - ప్పరి వట్టుటను
అతఁడను మన్నట్టు - లనక పోరాదు
హితమది యాలింపు - మెట్లంటివేని
'సీతఁ దోడుక వచ్చి - శ్రీరామవిభుని
చేతికి నందిచ్చి - శ్రీపాదములకు
సాఁగిలి నాతప్పు - సైరింపుమనిన
నాగుణసాగరుఁ - డన్నియు నోర్చు !
అందుపై హాని రా - దా తరువాత
నెందుకు చింతిల్ల - నేనున్నవాఁడ'
నని పల్కుమనియె నీ - వది చేసితేని
మను నీకులంబు సే - మము గల్గునీకు !
కాదని నామాట - కడఁద్రోచితేని

కోదండదీక్షాది - గురుఁడైనయట్టి
రాము బాణము లీవు - రంబుతో నిన్ను
సాము జామింట భ - స్మము సేయఁగలవు!
తగునె నీ కీ పర - దారాభిలాష?
అగణితంబగు పాప - మందు నిందుఁను
పుణ్యము ల్పాపంబుఁ - ద్రోఁద్రోయుననిన
పుణ్యపాపము లను - భూతిరోగ్యములు
చేసిన పుణ్యముల్ - క్షీణించుదనుక
నీసర్వసౌఖ్యంబు - లీవు పొందితివి
పాయని పాపాను - భవకాలమునకు
నీయవనిజఁ దెచ్చి - యింట నుంచితివి.
కాలుని పాశముల్ - గళమునఁ జుట్టు
పోలిక మృత్యువు - భూపుత్రి నీకు!
నీయంతవానికి - నీచకృత్యంబు
సేయఁ జెల్లునె? పర - స్త్రీలఁ గోరుదురె?
ధరణి నీయంత ప్ర - ధానపూరుషుఁడు
పరకాంతఁ దల్లిగాఁ - బాటింపవలదె?
అప్పుడుగా నీ మ - హామహిమంబు
కప్పువాసి త్రిలోక - గణనీయ మగును
ఈలంకఁ జెఱుపంగ - నిలఁ బుట్టినట్టి
కాళరాత్రి యనంగఁ - గనుము జానకిని
తెలియవు సీతపా - తివ్రత్యమహిమఁ
బొలిపోవు నీపుణ్య - భోగభాగ్యములు!
ఖరదూషణాదుల - ఖండించుటయును
శరమొక్కటను వాలిఁ - జంపివైచుటయు

గుఱుతులుగా నెఱుం - గుము రాము నెదిరి
సురనాథునకుఁ దల - చూపంగ రాదు
సురగరుడోరగా - సురసిద్ధసాధ్య
వరులు గెల్వఁగ లేని - వరములు నీకు
నల ధాత యిచ్చినాఁ - డనుచు గర్వింప
వలవదు వారిలో - వాఁడె భానుజుఁడు ?
బహుకాల ముగ్రత - పంబులు చేసి
విహితవై ఖరిఁ గన్న - విభవమంతయును
కటకటా ! సీత యొ - క్కరితెకె యొక్క
చిటికి వైచినయంత - చెడగఁ జూచెదవు !
రాముఁడు గవిసిన - బ్రహ్మరుద్రాదు
లేమని వచ్చి వ - హించుకో గలరె ?
నామాట నిజముగా - నమ్మి జానకిని
రాముని కర్పించి - బ్రదుకు" మీవనినఁ
గోపించి "మీరలీ - క్రోఁతినిఁ బట్టి
యీపొద్దె యాజ్ఞ సే - యింపుఁడు పొండు."
అని కింకరులఁ జూచి - యాడిన యన్నఁ
గని విభీషణుఁడు డ - గ్గరి యిట్టులనియె.

—: హనుమంతుని మాటలను విని యాతనిఁ జంపుటకాజ్ఞ యిచ్చిన రావణుని విభీషణుఁడు నివారించుట :—

"అగ్రజ ! వలవని - యాగ్రహంబూని
సుగ్రీవుచారు ని - చ్చో నాజ్ఞ సేయ
చెల్లునే ? దూతలు - సేయరానట్టి
చుల్లకమ్ములు సేయఁ - జూచిన దొరలు

తగిన యాజ్ఞయ కాని - దండింపరేల ?
తెగ చూడ వీని క్రోఁ - తికిఁ దప్పు గలదె ?
దూతమానసులపై - దోషముల్ చూచి
వ్రేతురు తఱటుల - వెడలఁ ద్రోయుదురు
తల గొఱిగింతు రం - తటఁ దీఱకున్న
వెలితి సేయుదురు భా - వించి యంగముల.
ఇది ధర్మమని విచా - లెఱుఁగరె ? యొక్క
కొదవసేయుఁడు తాళు - కొనుఁ డాగ్రహంబు
ధైర్యనీతిబల ప్ర - తాపగాంభీర్య
మర్యాదలందు స - మస్తలోకముల
నీయంతరాజవు - నీవింతెకాక
వాయెత్తి పలుక నె - వ్వరు గలరింక ?
ఇంద్రుఁడో వాఁడా యు - పేంద్రుఁడో వాన
రేంద్రుఁడంపినవాని - హింసింప నగునె ?
కీర్తివంతుఁడవు లో - కిక వైదిక ప్ర
వర్తనంబుల నుడు - వఁగసమర్థుఁడవు
కాదిట్టి తలఁపు లో - కవిరుద్ధ మఖిల
వేదవి శాస్త్రకో - విదుల కగ్రణివి
వీనిఁ జంపిన రఘు - వీరులతోడ
జానకీదేవి నీ - సదనంబులోన
నున్నదియని పల్క - నొకరుఁడు లేడు
విన్నఁ గాక రఘు - వీరుఁడు రాఁడు
వచ్చినగాక నీ - వైరులఁ దునుమ
వచ్చునె నీవిందు - వారందు నున్న
రాముఁడెక్కడనైన - ప్రాణంబుతోడ

భూమిపై నున్నట్టి - ప్రొద్దులకెల్ల
నాతనిపై నడి - యాసలేకాని
సీత నీమాటలు - చెవి సోఁక వినదు
నీకోప మారాము - నికిఁ జూప నమరు
గాక వానరు మీఁదఁ - గనిపించుకొన్న
నపకీర్తి యేకాక - యొందుచే నేమి
యిపుడు సాధించితి - మిది మేరగాదు."
అనుచు విభీషణుఁ - డాడిన మాట
విని పదితలల న - వ్వి 'యథార్థ' మనుచు

—: రావణుఁడు హనుమంతుని తోఁక కాల్చుట కాజ్ఞ యొసంగుట :—

దూతమానసుల నెం - దును జంపరామి
సీతంబు తోఁక వీ - నికి నాస్తిగాన
నిజముగాఁ దోఁక వీ - నికి నాస్తిచేసి
ప్రజలు నవ్వఁగఁ జంపి - బట్టలు చుట్టి
నూనెలోఁ దోఁచి గం - తులు వేయుచుండ
వీని తోఁక దహించి - వీడ్చి పొమ్మనుఁడు."
అను నంతలో విక్ర - తాకారులైన
దనుజులు కొలువులోఁ - దనుకడ కీడ్చి
కోకలు చుట్టంగ - గొంచెపుతోఁక
యాకడ నిరవధి - యై కొనసాఁగ
నూరిలో నింటింట - నున్న పెట్టియల
చీరలన్నియును దె - చ్చి సమీరసుతుని
వాలాగ్రమునఁ జుట్టి - వలయు కొప్పెరల

తైలంబులో నది - దరికొల్పి వారు
పురవీథులను మెడఁ - బువ్వాలు చుట్టి
హరివీరు పంచవా - ద్యంబులు మొఱయ
బాలకుల్ వెం - బడి బడి కూఁతలిడుచుఁ
గోలచేఁ దోలుచు - కొని పోవుచుండ
" చీకటివేళఁ జొ - చ్చితి లంక నేను
తేఁకువ వీథివీ - థికిఁ జూడలేదు.
దివిటీలు వీరు దై - తేయులు నాకు
రవులు కొల్పిన తోఁక - రాఁజినవెనక
నా వెలుఁగున పురం - బంతయుఁ జూచి
కావలసిన లంకఁ - గాల్చి పోయెదను।"
అని యూరకేపోవు - నప్పుడీ వార్త
దనుజకాంతలు మహీ - తనయతోఁ దెల్పఁ
జింతించి యిందు ప - చ్చినవాఁడవేల
యింత సేసితి వింక - నేమి సేయుదును ?"

—: సీతకు హనుమంతుని వృత్తాంతముదెలిసి యాతని కగ్ని యంటక, చల్లగానుండునట్లామె వరమొసంగుట :—

అని "యోఁ బతివ్రత - నైతినే నిపుడె
యనలుఁడు కడుచల్ల - నై యుండుగాక !
రాముని దక్క ప - రవ్యక్తులందు
నేనది నిలుపని - యది నిక్కమేని
యనిలకుమార ! నీ - కాపద లేక
యనలుఁడు కడుచల్ల - నైయుండుగాక !

శ్రీరామచంద్రుండు - చేపట్టి నన్ను
యీరాక్షసాళి జ - యింప నోపుటలు
మనసున సరిపోవ - మాయన్న! నీవు
ననలుండు కడుచల్ల - నై యుండుఁగాక!
ధర్మంబు గలచోట - తప్పదు జయము
ధార్మికులకు నంచు - తజ్ఞులు వలుక
వినుమాట సత్యమై - వెలసిన నీవు
ననలుండు కడుచల్ల - నై యుండుఁగాక!
ఏనె పతివ్రత - నేని రాఘవుఁడ
ధీనాత్ముఁ డేకప - త్నివ్రతుఁ డేని
దనుజులు నీతోఁక - దవిలించినట్టి
యనలుండు కడుచల్ల - నై యుండుఁగాక!
నెయ్యుఁడై నట్టి వా - ని సుతుండు వీని
కియ్యెడ రామార్థ - మితవుఁ గావింతు
నని రావణుని యాజ్ఞ - యాత్మఁ గైకొనక
యనలుండు కడుచల్ల - నై యుండుగాక!
అవనిఁ బరోపకా - రార్థులైనట్టి
ప్రవిమలాత్మకుల నా - పదలొంద వనుచు
జనులాడు వచనంబు - సత్యమా నేని
యనలుండు కడుచల్ల - నై యుండుఁగాక!
సుగ్రీవుఁ డగచర - స్తోమంబుఁ గూర్చి
యగ్రణియై వచ్చి - యసురేంద్రుఁ దునిమి
నను దెచ్చి రఘురాము - నకుఁ గూర్చునేని
యనలుండు కడుచల్ల - నై యుండుఁగాక!"
అనునంత పెనుమంట - లడరు పావకుఁడు

తన వాలమునకు శై - త్యము సంఘటించి
చల్లగాఁ బన్నీరు - చల్లినయట్లు
పెల్లుబ్బ నూనియు - పృథిపై దొరుగఁ
దావి చావంతి పూ - దండలు చుట్టు
తీవిగా నిండఁ జు - ట్టిన చీరలమర
దహనుఁడు తనకు శీ - తలభావమొందు
మహిమంబునకు హను - మంతుఁడుప్పొంగి
" రాముని కార్యభార - ము పూను కతన
నామున్ను మైనాకుఁ - డాప్తుఁడైనటుల
నమరులు వేడుకో - నగ్నియీరీతి
శమియించి నాపాలఁ - జల్లనై నాఁడో!
దిక్కుల సీతపా - తివ్రత్య మహిమ
మెక్కుడై వెలయుగా - కిందుచే ననుచు
ధార్మికుఁడగు బృహ - ద్భానుండు నన్నుఁ
గూర్మిచే మనుపఁ గై - కొనియెనో చలువ!
ఏనొనరించిన - యీ వీరకర్మ
మానిలింపులకెల్ల - నాశాస్యమగుట
వారికి హితముగా - వహ్ని నామేనఁ
బూరించెనేమొ క - ర్పూరంపుఁ జలువ!
అదిగాక నాతండ్రి - యాప్తుండుగాన
నది తలఁచుక సౌమ్యుఁ - డయ్యెనో కీలి!"

—: హనుమంతుఁడు లంకనుఁ గాల్చుట :—

అని తలంపుచు పణ - వాది వాద్యములు
తన మ్రోల మొఱయ ను - త్సాహంబు మెఱసి

ును వెంచిన తన – మెయిఁ గట్టుత్రాళ్లు
వానికివానికి – వదలిపోవుటయుఁ
దమ్మినూలునఁ జిక్కు – దంతావళంబు
చిమ్మి రేఁగినయట్లు – చెంత రాక్షసుల
విలయాగ్ని దరికొల్పు – విధమునఁ దోఁక
వలమానగతిఁ ద్రిప్పు – వారలందఱును
దారుణ వహ్ని ప్ర – దక్షిణ శిఖలఁ
బోరాక రారాక – బూదియై పడినఁ
గుప్పించి వానర – కుంజరుండలిగి
యప్పుడు భయదాట్ట – హాసంబుచేసి
చంగునఁ గోటపైఁ – జౌకళించుటయు
నింగలంబులవాన – లెల్లెడఁ గురిసె!
అందుపైనున్న మ – హాపరిఖంబు
సందడి విరియ రా – క్షససేన మీఁద
ప్రేసిన నదివచ్చి – వీధి పీనుఁగుల
రానులుగాఁ జేయ – రాముఁ బేర్కొనుచుఁ
బగలింటి సూర్యుని – పగిది వాలాగ్ని
దిగదిగ వెలుఁగ మీఁ – దికిఁ బొడవెత్తి
త్రిప్పుచు లంక నల్ – దిక్కులుచూచి
యుప్పరిగలు సౌధ – యూథముల్ జూచి
" సీతను వెదకి చూ – చినవాఁడ మఱలి
దూతకృత్యము మాత్ర – తోఁ బోవనైతి
వనమేలఁ గూల్చితి ? – వాదుల కేల
పెనఁగితి ? నిదియేటి – బీరంబు తనకు

నైనట్టులయ్యె మ - హావాలజాయ
మానపావకశిఖా - మాలికలందు
నీకోటతో లంక - యెల్లను గాల్చి
పోకున్నఁ గీర్తి య - బ్బునె నాకు ననుచుఁ
బెడబొబ్బవట్టి కు - ప్పించి ప్రహస్తు
నడిమింట దాఁటి భ - గ్నముచేసి కాల్చి
యచ్చోట నుండి మ - హాపార్శ్వు పసిఁడి
మచ్చుమీఁదికి హను - మంతుఁడు దాఁటి
దరికొల్పి యదివజ్ర - దంష్ట్రుని మేడ
నెరియించి శుకుఁడున్న - యిలుఁ గాలవేసి
సారణు గృహము భ - స్మము చేసి మింటి
తో రాయు నింద్రజి - త్తుని మందిరంబు
నగ్నికి నపుడ పూ - ర్ణాహుతి యిచ్చి
భగ్నంబుచేసి యా - పై జంబుమాలి
మాలిసుమాలుల - మణి భవనములఁ
గీలి యందిన రశ్మి - కేతు వాసంబు
వాసంబులందుఁ బా - వకు రవుల్ కొలిపి
త్రోసిపై సూర్యశ - త్రుని నిలయంబు
విలయంబు నొందించి - వీతిహోత్రునకు
సెలవిచ్చి చంచలా - జిహ్వధామంబు
హస్తికంధరశోణి - తాక్షాలయముల
ధ్వస్తముల్ చేసి మే - ఘావి ధరించి
రుధిరాక్షు కుంభక - ర్ణుల నికేతనము
లధముల గుడిసెలో - యనఁ జిచ్చువెట్టి
మకరాక్షు సదనంబు - మాడిచి దహను

నకు యజ్ఞశత్రుని - నగరొప్పగించి
కొనతోఁక కుంభిని - కుంభినీకాయ
కనకాజిరముఁల సా - గఁగ నిల్చిప్రేల్చి
యంతటఁ బోక న - రాంతకు సౌధ
మంతయు వెలిగించి - యన్య రాక్షసుల
విడుదులు దహియించి - వీడెల్ల నింగి
పొడవుతోఁ బూడిద - ప్రోవుల నించి
చలముతో నావిభీ - షణుని గేహంబుఁ
దొలఁగ నన్యుల యిండ్లు - దుమ్ములుచేసి
చిచ్చుఱఁ గన్ను వి - చ్చెనో శంభుఁ డనఁగ
ముచ్చిచ్చులవు డొక్క - మూర్తియైనట్లు
పావక విశ్వరూ - పంబు లంకామ
హావరణంబులో - నాపూర్ణమయ్యె!
అనలుఁ డీక్రియ వాన - రాకార మొంది
తనపగఁ దీర్చుకోఁ - దలఁచెనో యనఁగ
నజుని కోపాగ్ని మ - హా ప్రళయములఁ
బ్రజలపైఁ జూపఁ బ్రా - రంభించె ననఁగ
జముఁడు వీఁడనఁగ నీ - శానుఁ డనంగఁ
నమరనాయకుఁడన - నర్కుఁ డనంగఁ
త్రిపురంబు లేర్చుధా - త్రీరథుండితఁడె
యిపుడు లంక దహించ - నేతెంచె ననఁగ
మేడలు మాడుగల్ - మేలు కట్టులును
వాడలు ధనధాన్య - వస్తుచయంబు
పట్టాంశుకంబులు - భస్మముల్ చేసి
చిట్టముల్ గట్టించి - చిటచిటాత్కృతుల

నాలుకల్ గోయుచు - నాగాశ్వధేను
శాలలం దనిల భ - స్మములు సేయుచును
రథములు గాల్చి తో - రణములు గూల్చి
పృథుగతి లంకలోఁ - బెనుమంట లెగయ
నమరయానములో గ - డాకులో యనఁగఁ
దెమలఁ బారుచు నలు - దిక్కుల నొదుగ
పై లోకములనున్న - పావనాత్మకులు
పేలగింజలరీతిఁ - బెటిలిపడంగ
సెగఁ దాఁకి యిలమోచు - శేషుఁడు పడగ
లెగ నెత్తఁజాలక - యించుక వంప
వెలుఁగు పట్టణములో - వీరు వారనక
చిలచిల నెత్తురుల్ - చింద రాక్షసులు
మగ్గిన మగలపై - మగువలు వ్రాలి
యగ్గలికలఁ జేసి - రనుగమనములు
చంకల బిడ్డలు - జాఱిపడంగ
నంకించి పట్టుక - యట్టిట్టు సుడిసి
పొగచుట్టి కన్నులఁ - బొదివిన నూర్పు
లెగదొట్టి యిండ్లలో - నీల్గినవారు
యిల్లాండ్రు లోపలి - యిండ్లలోఁ దగిలి
వెల్లిరాఁ ద్రోవలు - వెదకి కూయిడుచు
వాకిళ్లు కడపుచో - వారి వల్లభులు
కోకటాడఁగఁ దోడి - కొనివత్తు మనుచుఁ
జొరఁబారి యాలోన - సుడిగొని తమరు
తిరిగి రాఁజాలక - త్రెళ్లెడువారు
కుచ్చిళుల్ మును రవు - లొల్కనిన కెంగేల

నుచ్చిపోవఁగ దివి - యుచుఁ గడవైవ
పయ్యెంట లంటి లో - పలి జల్లులవిక
చెయ్యందుకొని విడ - ర్చినఁ బోక మేన
దరికొను మంటల - తమవారలెల్లఁ
బురపురఁ బొక్కంగఁ - బొరలెడువారు
కాయముల్ దరికొన్న - కవచంబులూడి
హా! యని పొరలుచు - నంగముల్మఱచి
కొఱప్రాణములతోడ - కుత్తుక లెండి
యిరవుల నిల్లాండ్రు - మృతినొందువారు
సొమ్ములు దేనిండ్లు - చొచ్చి చేతులను
రెమ్మి నల్గడల దో - రికిన మాత్రంబు
కైకొని వచ్చుచోఁ - గడపలు దాఁకి
వాకిళ్లఁ బడి మేను - వ్రస్సినవారు
దంపతుల్ నిదురించు - తఱిఁ గాలికాలి
కొంపలు పైవచ్చి - కూలంగఁ బడిన
నెట్లు మున్నుండిరి - యిట్టట్టు మెదల
కట్లమేనుఁగు నూర్పు - లడఁగినవారు
కలుద్రావి యొడలెఱుం - గక మంటలనుచుఁ
దెలియక యందందుఁ - దెరలినవారు
నగుచుండ హనుమంతుఁ - డాలంకనడుమ
బెగడ లోకములెల్లఁ - బెనుబొబ్బవెట్టి
కుప్పించి యెగిరి చం - గున దశాననుని
యుప్పరిగెల వ్రాలి - యొడలుజాడించి
కొనతోఁక సందుల - గొందులదూర్చి
యనలునిఁ బురికొల్పి - యసమిచ్చుటయును

నతఁడు దూరంతయు - నల పవమాన
సుతునిపై వైచి రాఁ - జుచు విమానములు
సింహాసనంబులు - చీర్ణదంతములు
సింహతలాటముల్ - చీనాంబరములు
చప్పరంబులు పెండ్లి - చవికెలుపట్టు
కప్పడంబులును ము - క్తా చ్ఛత్రములును
చామరంబులును ధ్వ - జంబు లమూల్య
సామజంబులు కేళీ - సౌధ యూథములు
పడకయిండ్లును విండ్లు - పసిఁడి తల్పులును
కొడిగెలు కేరులు - కొల్లారు బండ్లు
తేరులుగాల్చి బూ - దిగఁ జేసి తనదు
పేరువాడి సుపర్వ - బృందంబు పొగడ
ప్రళయ కాలార్కుని - పగిది తానెగసి
యలవోకగాఁ ద్రికూ - టాద్రిపై నిలిచి
యుత్తరంబుగఁ జూచి - యుదధిలోఁ బెద్ద
వత్తికై వడి మండు - వాలంబుముంచె
జానకి శ్రీరామ - చంద్రుల తాప
మేనె జల్లార్పుడు - నిటులన్న రీతి!
వాలాగ్ని యార్చి భా - వములోనఁ బవన
బాలకుఁ డుత్సాహ - పరతచే నుండి

—: హనుమంతుఁడు సీత యగ్నిలోదగ్ధమైన దని చింతించుట :—

తనలోనఁ జింతించి - "తప్పెఁ గార్యంబు
కినుకఁ గల్గిన వాని - కిని మేలు గలదె?

క్రోధంబు విడనాడు - కొని తాల్మినుండు
సాధువులకుఁగాక - సౌఖ్యంబు గలదె?
కోపంబు కలిగిన - గుణములఁ జెఱచి
పాపంబులకు నెల్ల - పాల్పడఁ జేయు
నేలకాల్చితి లంక? - యీ హింసవలన
నేలాభ మందితి - నేగార్యమయ్యె
ఏమిటికై వచ్చి - యేమిసేసితిని!
తామసాత్మకులు గ - దా వనచరులు!
అనుపంగఁ దగువాని - ననిపినఁగాక
ననుబోటి పనిగొన్న - నగుబాటుగాదె?
ఆలోచనంబు సే - యక వేగిరించు
పాలసులెందు నా - పద పొందుటరుదె?
దూతనై వచ్చి తో - ట్తోడఁ గ్రమ్మఱక
సీతఁ జంపగ లంక - చిచ్చు పెట్టితిని!
ఇందుచే జానకి - యేమాయెనో యనక
ముందు చూడక యేల - మోసపోయితిని?
జానకిఁ జంపి ల - క్ష్మణ భానుజులకు
నేనోరు వెట్టుక - యేను దెల్పుదును?
రాముఁ డీవార్త క - ర్ణంబుల సోఁకు
నామున్నుగా మేనఁ - బ్రాణముల్ విడుచు
వారివారలును మా - వారలు గొలుచు
వారు రామునితోడి - వారు నిక్కముగ
నెవ్వరికిని బని - యేమి నావలన?
నవ్వుపాలయ్యె వా - నర నాథుపూన్కి
మిగిలినవేల స్వా - మి ద్రోహియనుచు

నగుచుఁ బల్కుదురు వా - నరులెల్లఁ జూచి
జనకజ వెదకెదఁ - జని యయ్యశోక
వనిలోన నాయమ్మ - వసియించి యున్న
మఱలిపోవుదు లేక - మఱి యొక్కటైన
శరధిలోఁ బడుదు మ - త్స్యములు మ్రింగుటకు
ననలమేనియుఁ జొత్తు - నంతియకాని
తనువుతో మెలఁగ నిం - తట సిగ్గుగాదె!"
అనుచు నాలోచించు - హనుమంతుఁ డెదురఁ
గనిపించు శుభసూచ - కములకుప్పొంగి
"పరమపతివ్రతా - భరణమైనట్టి
ధరణిజ కేల చిం - తవహింప నాకు?
రాముని మహిమ మా - రమణి శీలంబు
నేమున్నెఱింగియు - నెఱుఁగలేనైతి!
తోఁక నంటిన చిచ్చు - తోఁ గాలిపోక
పోఁకవ్రయ్యక మున్న - పురము గాల్చితిని!
ఆసతీమణి తేజ - మనలుని కన్న
వీసమంతయుం దక్కు - వే? కాననైతి
యింతేల వహ్నివ - హ్నిదహింపఁ గలదె?
యంతకొంచెపు బుద్ధి - యదియెన్ననైతి?
అనలుఁ డేగతిముట్టు - నాపతివ్రతను?
తన తపంబున శీల - ధర్మవర్తనలు
శ్రీరాముపై భక్తి - సీత కోపించి
యూరుపుగానోపు - హవ్యవాహనునిఁ
గాక పావకుఁడు ద - గ్గరఁ జేరఁ గలఁడె॥
నా కేలచింత?" య - నంగ ఖేచరులు

—: దేవతలవలన సీత సురక్షితముగానున్నదని యెఱిఁగి యామెవద్ద సెలవు గైకొనుట :—

మిన్నుల నుండి "భూ - మిజ కేమి కొఱఁత !
విన్నఁబాటేల ? సే - వించి భూమిజను
చనుము క్రమ్మర రామ - చంద్రునిఁ దెమ్ము
తునిమింపు మెల్ల దై - త్యుల" నంచుఁ బలుక
తలయెత్తిచూచి యా - దారిగా మ్రొక్కి
వలకన్ను గదల న - వ్వైదేహిఁ జేరి
యడుగులఁ బ్రణమిల్లి - "యమ్మ ! పోయెదను
తడయక దశరథా - త్మజుని సన్నిధికి.
ననుమతి యిమ్మ"న్న - ననిల నందనునిఁ
గనుఁగొని మరల రా - ఘవురాణి పలికె.
" పోవన్న ! వాయుజ ! - పోయి శ్రీరాముఁ
దేవన్న ! తెచ్చి దై - తేయులతోడ
రావణుఁదునిమించి - రాముని చేతి
కీవన్న ! నన్ను నా - యిడుములు దీర్చి
నమ్మితిఁ బ్రాణదా - నము సేయు మీవు !
పొమ్మ"న్నఁ బవమాన - పుత్త్రుఁడు పలికె.
" పోయెద నేను గో - బ్బున రాముఁదెచ్చి
మాయమ్మ ! తేపె నీ - మది చల్లఁజేసి
లంకపైఁ గపుల నె - ల్లను డించి నాఁటి
యంకంబులోన ద - శానను ద్రుంచి
నీవు నీమగనిఁ జెం - దియయోధ్యకడకు
దేవియు దేవర - తీరున మఱలి

పట్టాభిషిక్తుడై – పరిణామమొందు
నట్టివేడుక చూతు – నదిచూడు"! మనుచు

—: హనుమంతు డరిష్టకాద్రిని దాఁటుట :—

రింగున నెగసి య – రిష్టకాద్రికిని
చంగున దాఁటి కే – సరికుమారకుఁడు
నిలిచిన నసిత వ – నీశ్రేణితోడ
నలరారె కొండ నీ – లాంబరు కరణి!
పొగడొందె శారదాం – బుదముల చేత
నగము గారోత్తరీ – యము దాల్చి నటుల!
వైణవరంధ్ర ని – స్వనములచేత
వేణునాద వినోది – విధమందె గట్టు!
తనయందుఁ గదలెడు – తరువులఁ గొండ
కనుపించె నొకయాట – గాని చందమున!
వాయువువలన గ – హ్వరములు మొఱయ
నాయద్రి యొప్పెగా – యకుని వైఖరిని!
సెలయేటి మొత్తంబు – చే మహీధరము
పొలిచె ముత్తెప్రసరుల్ – బూనినరీతి!
క్రేవ ధాతువులచే – గిరిరాజు వెలిచె
తీవి చెంగావి ధ – ట్టినిఁగట్టి నటుల!
కమలసరంబుచే – గ్రావంబు దనరె
కమనీయమగు పత – కము వైచుకరణి!
యటులున్న యచలమా – హనుమంతుఁ డెక్కి
యటునిటు మెలఁగి త – దగ్రభాగమున

శృంగంబుమీఁద ని - ల్చి యభంగతిమితి
మింగిల తద్గిరో - ర్మిప్రవాహములఁ

—: హనుమంతుఁడు సముద్రము దాఁటుట :—

గనుపట్టు నుత్తర - కమలధిఁ గాంచి
తనపాదములు సము - ద్ధతి జోడుగూర్చి
కరములు వీచి యు - త్కంఠతో నెగసె!
కరువలిపట్టి యా - కాశమార్గమున
నెగిరిన యంతలో - నిట్టట్టు గదలు
నగముపై నున్న కి - న్నర మిథునములు
అదరిపాటున వ్యోమ - యానంబులెక్కి
కదలె హేతువు మదిఁ - గనలేక జడిసి!
పెట్టెలు పెట్టుక - పెను త్రాచులెల్ల
చుట్టలు చుట్టుక - సుడిగొని పడియె!
అడఁగిపోవుచుఁ గొండ - యడలఁ గన్నీటి
వడువున దొనలలో - వారి వెల్లుబ్బె!
కొండ యెంతయు గుల - గులలైన డొల్ల
గండోపలంబును - గవులెల్లఁ జదియ
పదియోజనంబుల - పఱపును మూఁడు
పదుల యోజనముల - పాటి యున్నతియుఁ
గలిగిన యమ్మహా - గ్రావంబు ధరణి
దొలుచుక యదినేల - తో సరిగాఁగఁ
ద్రొక్కి వాయుజుఁడు చే - తులు పొడవెత్తి
చక్కఁగాఁ జూపులు - చనిన వేగమున

కారండవాళిగాఁ - గమలబాంధవుఁడు
కైరవశ్రేణిగాఁ - గైరవహితుఁడు
శ్రవణపుష్యములు హం - సములుగా జలద
నివహంబు నాచుగా, - నెలకొన్న కుజుఁడు
మకరిగా, దీవిగా - మఘవగజంబు
ప్రకటవైఖరిఁ బున - ర్వసువు మీనముగఁ
గొక్కెరగా స్వాతి - కొదమ తెమ్మెరల
పెక్కువల్ కరడుల - పెనకువఁగాఁగ
వెన్నెలవారిగా - విబుధగంధర్వ
కిన్నరుల్ వికచపం - కేరుహంబులుగఁ
గలిగిన గగన సా - గరము సాగరము
తులగాఁగఁ దావోడ - దూఁటినయట్లు
వచ్చి పయోధి యా - వలి గట్టునందు
ఱిచ్చలువడి కను - ఱెప్పలు మూయ
నేమఱి తనరాక - కెదురులు చూచు
సోమరులగు కపి - స్తోమముఁ గాంచి
దర్పించి సింహనా - దము సేయ నట్టి
యార్పు వీనులు సోఁక - "నల్ల దేవచ్చె
కరువలిపట్టి రా - ఘవుదేవిఁ జూచి
మఱలివచ్చెను లేక - మఱియొకచైన
యిట్టి సుమాళంబు - నిలయెల్లనిండు
నట్టహాసంబు సే - యఁడు సీతఁజూచె"

—: సముద్రతీరమున హనుమంతుని రాక కెదురుచూచుచున్న వానరులాతని రాకకు సంతోషించుట ; సీతవృత్తాంతము నెఱుకపఱచుట :—

నని యొళసీళ్లు తీ - యని ఫలంబులును
దనువుట్ట తేనియల్ - తనకామతించి

యున్నచో మిన్నుల - నుండి పక్షులు
చన్నయప్పుడు గ్రాలు - శైలమోయనఁగ
నామహేంద్రమహీధ్ర - రాగ్రంబునందు
నేమియు నలియక - నెఱుఁగక వ్రాలి
యంగదజాంబవ - దాదులు వచ్చి
సంగడి నిలిచి "కే - సరితనూజాత !
వచ్చితివే ?" యన్న - "వైదేహిఁ గంటి
వచ్చితి మఱలి రా - వణు నింటిలోనఁ
దలజడఁగట్టి సం - తాపంబుతోడ
వలువ మిక్కిలి మాని - వనములోపలను
తనచుట్టు దనుజకాం - తలు బెదరింప
ననదయై యున్నచో - నాయమ్మఁ జేరి
మ్రొక్కి యూరటఁ జేసి - ముద్రిక యిచ్చి
యక్కమలాక్షి పో - మ్మని పంపుటయును
నతికృశత్వమున పా - ష్యమి నాఁడు చదువు
నతని విద్యయుఁ బోలు - నాసీతఁ బాసి
వచ్చితి "నని కొన్ని - వార్తలఁ బూస

—: సీతవార్తకై వానరులు సంతోషము వెలిబుచ్చుట :—

గ్రుచ్చిన గతిఁ దెల్పఁ - గోతులందఱును
గంతులు వేయుచు - కరములు చఱచి
పంతమ్ములాడుచు - పరువులెత్తుచును
తోఁకలార్పుచుఁ జెట్ల - తుదికొమ్మలెక్కి
యూఁకించి దాఁటుచు - నురక నవ్వుచును
కిలకిలా రవముతోఁ - గెలనికిఁ జేరి

పలుమారు హనుమంతు - పై నివురుచును
గాఁగలింపుచు సీత - కథ విందమనుచు
మూఁగుచు నినుమాఱు - ముమ్మాఱుగాఁగ
యడిగిన మాటలే - యడుగుచు "నింక
విడిచె దుఃఖము రఘు - వీరుఁ"డటంచు
"పావని! మమ్మెల్ల - బ్రదికించినట్టి
దేవుఁడ వీవ"ని - దీవనలిచ్చి
పొగడుచు నుండు న - ప్పుడు తనచుట్టు
నగచరులుండ బృం - దారకుల్ గొలువ
నున్నయింద్రునిఁబోలు - యొప్పినవాలి
గన్నబిడ్డఁడు వేడు - కల నోలలాడి
యాకొండదరి నుండు - హనుమంతుఁ జూచి
వాకొని యాజాంబ - వంతుఁ డిట్లనియె

—: జాంబవంతునితో హనుమంతుఁడు తన వృత్తాంతమెల్ల సవిస్తరముగా వినిపించుట :—

"మాయన్న! పవనకు - మార! మాయెదుర
తోయధిపై మింటి - త్రోవగా నరుగు
నినుఁ గనుఁగొంటి మిం- తియెకాని యవలి
పని నీవు మాకుఁ దె - ల్పక యేఱుపడదు
లంకాపురమున ని - లాసుత యెట్టి
యంకిలి నున్నది - యా యమ్మతోడ?
నేమంటివీవు ని - న్నేమని పనిచె?
రామసౌమిత్రుల - రవికుమారకునిఁ
జూచి యేమంద, మె - చ్చో నున్నదనుచు

సూచింపవలయు ! ర - క్షోనాయకుండు
నేరీతివాఁడు ? వాఁ - డేకొద్ది మనల
పోరాడఁ గలఁడు ? తె - ల్పుము కన్న తెఱఁగు.
అందఱు నందుపై - నాలోచనంబుఁ
గంద మారాఘవా - గ్రణిఁ జేరఁబోవ"
అనునంత జాంబవ - దంగదముఖులఁ
గని హనుమంతుఁడు - గ్రమ్మఱఁ బలికె.
వినుఁడేను జేసిన - వృత్తాంతమెల్ల
వినుపింతు నానుపూ - ర్వగ" నని తాను
జలధిపైఁ జనుటయు - జలరాశి వనుప
వలిమలపట్టి ది - వంబరికట్టి
మైనాకుఁడను కొండ - మాఱొడ్డి నిలువఁ
దాను భేదించినఁ - దనుఁ జూచి యతఁడు
"మీతండ్రి చెలికాఁడ - మిహికాచలేంద్ర
జాతుఁడఁ దన్నుఁ బ - క్షంబులతోడఁ
బక్షంబుతోడూఁత - బవనుఁ డిచ్చోట
రక్షించి యునిచె నిం - ద్రభయంబుఁ దీర్చి !
అందుకునై నీకు - నాతిథ్యమేను
కందమూలము లిత్తుఁ - గైకొను"మనిన
వలదనిపో నగ్ర - వనధిపై సురస
యల నాగమాత త - న్నడికట్టుటయును,
ఏరాము పనిపూని - యేఁగెద నిపుడు
కారాదు మరలి యా - కలిఁ దీర్తు నీకు
ననుపు మీవని" తదీ - యాస్యంబుదూరి
చనుటయు నవ్వలి - ఛాయఁ బైఛాయఁ

బోవుచో దనచాయఁ - బోనీక పట్టి
కావరంబున సింహి - కానాము దనుజి
మ్రింగెదనని నోరు - మిక్కిలి తెరవఁ
జంగున దానియా - స్యంబులో దుమికి
యుదరంబుఁ జించి య - త్యుద్ధతిచేత
గుదిగొన్న దాని ప్రే - గులు వట్టి యీడ్చి
కొనిపోవుటయు లంక - కును జేర లంక
యనునది వాకిలి - యరికట్టి కోపఁ
జొరనీకయుండ ర - క్షోవీథి యెడమ
కరమునఁ గొట్టినఁ - గంపించి లంక
దీవించి పొమ్మని - తెరువిచ్చుటయును
దావచ్చి నగరమం - తయుఁ జుట్టి చూచి
జానకిఁ గానక - సాలాగ్రమెక్కి
గానుపించిన యశో - కవనంబు నందు
సీతను గనుచోట - శింశుపాచ్ఛాయ
శీతాంశుఁబాసి వ - చ్చిన చిత్ర యనఁగ
నలకువతోడ వే - నలి జడగట్ట
నలయుచుఁ గనుగంట - నశ్రులురాల
మైలవస్త్రము గట్టి - మహినుండఁ జూచి
యాలేమ సీతయా - నని గాచియున్న
దనుజకాంతలఁ జూచి - తాఁ జెట్టుమీఁద
ఘనమైన శాఖపైఁ - గదలకుండుటయు
నావేళ రావణుఁ - డటు వచ్చి రాము
దేవేరితో సమ్మ - తింపు మటంచు
బెదరించుటయు సీత - పెడచెవిఁబెట్టి

యదరక దుర్భాష - లాడి దూషింప
నలిగి చంపంగఁ బోవ - నరికట్టి వానిఁ
దొలఁగ మండోదరి - ద్రోచిన నతఁడు
గడుపడి చనుటయుఁ - గదిమి రక్కసులు
చెడుమాట లాడుచోఁ - జేరి యాత్రిజట
కల గన్న తెఱఁగును - గడకు వారేఁగఁ
దలఁపులో నిదిమంచి - తరియంచుఁ దాను
మాటలాడుటయు న - మ్మని మహీసుతకుఁ
దేట పడంగ ము - ద్రిక నిచ్చుటయును
గుఱుతులుగాఁ దన - కు వచించి సీత
శిరము మానిక మిచ్చి - శ్రీకరంబుగను
దీవించుటయు రాము - దేవేరి వనుప
నావనంబెల్ల ను - గ్గాడి కూల్చుటయుఁ
బైకొని యప్పుడే - బదివేలుదైత్యు
లేకవారంబుపై - నెదిరించి పోరఁ
బోరిఁగొనుటయు మంత్రి - పుత్రులేడ్వురను
జరిమివైచుటయు రా - క్షస నాయకుండు
దళవాయులను మహో - ద్ధతి నైదువురను
గలనికిఁ బనిచిన - గమి చంపుటయును
నాజినెదుర్చు న - క్షాసురవధము
చేఁ జేత నయ్యింద్ర - జిత్తుని చేత
బ్రహ్మాస్త్రమునఁ గట్టు - వడుటయుఁ దాను
బ్రహ్మమంత్రము జపిం - పఁగ నొవ్వి లేక
కట్టులఁ బడ దశ - కంఠుకొల్వునకుఁ
బట్టు కేఁగుటయును - బంక్తికంధరుఁడు

తాను గోపించి ప్ర - ధానులఁ జూచి
వానరుఁ డీఁతఁడె - వ్వరివాఁడటన్న
నే దాశరథిబంట - నినసూనుఁడనుప
వైదేహిఁ జూడంగ - వచ్చితి ననుట
తానన్న మాటలు - దానికి నలిగి
దానవేంద్రుఁడు వీని - దండింపుమనుటఁ
దగవుగాదనుచు నా - తరి విభీషణుఁడు
తగు నాజ్ఞసేయ హి - తంబు పల్కుటయుఁ
దోఁకఁ గాలిచి పార - ద్రోలుఁ డటన్న
నాఁక సేసిన వార - లాముదంబులను
చీరలు ముంచి తె - చ్చి మదీయవాల
దారుణలయ కాల - దండాచలమునఁ
జుట్టి ముట్టించిన - చో నెఱమంట
లుట్టినప్పుడ లేచి - యొడలు పెంచుటయుఁ
బాశవల్లరులెల్లఁ - బరిసి పోవుటయు
దాశరథిశ్రేష్ఠు - దయచేత సీత
పరమపాతివ్రత్య - పటిమచేఁ దోఁక
చుఱుకు పుట్టక దాఁటు - చును లంకయెల్లఁ
గాలుచుటయు జన - కతనూజయున్న
మేలు కన్నులఁ జూచి - మింటికి నెగసి
వచ్చుటయును దెల్ప - వానరులెల్ల
నచ్చెరవున నమ్మ - హామహుఁ జూచి
వినుతింప నంతయు - విని యంగదుండు
వనచరుల్ విన జాంబ - వంతున కనియె
" పోఁమెద లంకకి - ప్పుడె దశాననుని

మాయింతు దానవ - మండలితోడ
లంకాపురంబు నే - లను గూల్చి దనుజ
పంకజాక్షులఁ జెఱ - పట్టి తెప్పించి
యమ్మవారినిఁ బుష్ప - కారూఢఁ జేసి
కొమ్మని రామున - కును సమర్పింతు !
ఇన్నాళ్లు మితిమీఱి - యిప్పుడు సీత
యున్నది యనిపల్క - నుచితమే మనకు ?
పోవుదునే ? ” యన్న - భుజబలశాలి
నావాలితనయు మే - నరచేత నిమిరి
జాంబవంతుఁడు కార్య - సంవేది యనున
యంబుతోఁ దగు విన - యమున నిట్లనియె.
“ ఈవు రాజవు మమ్ము - నిందఱం గరుణఁ
బ్రోవజాలుదు వతి - భుజశౌర్యనిధివి !
ఆడినయంత నే - యఁగ సమర్థుఁడవు
నేఁడు మాబోఁటులు - నిను లంకకనిచి
యిచట నూరకయుందు - మే రాముఁడున్న
యచటికిఁ జని మన - హనుమంతుచేత
విన్నపం బొనరించి - వేగఁ దోతెచ్చి
మున్నీరు గడచి రా - ముని సమక్షమున
రావణాదుల మీఁద - రణభూమిలోనఁ
గావలసినయట్లు - గనుపించుకొన్న
నదిమాటవాసి గా - కందఱుఁ గలిగి
యిదియేఁటిమాట నీ - కెట్లుఁ బోవచ్చు ?
వలదన్న యా జాంబ - వంతుని మాటఁ
దలఁచియుందఱు ప్రమో - దము నొందునంత

—: వానరులు హనుమంతునితోఁగూడి సీత వృత్తాంత
మును రామునకు నివేదింప నరుగుట :—

నంగదు నానతి - నగచరులెల్లఁ
నింగికి నెగసి ము - న్నీరు దాఁటుటకుఁ
బందలై యందఱు - ప్రాల్మారు వారి
కెందుండి వచ్చెనే - యీజవంబనఁగ
నొక్కరి మీఱఁగ - నొక్కరుత్తరపు
దిక్కుగా శైలన - దీ మహాటవులు
గనుఁగొంచు గరుడవే - గంబుల వచ్చి
జనకజ వెదకఁగఁ - జనునాట నుండి 4650
హితమైన యాహార - మెఱుఁగరు గాన
క్షితిమీఁద నున్న సు - గ్రీవుని నగరి
వల్లభులకు మనో - వర్తికిఁ జెల్లు

—: దారిలో మధువనమునందలి సమస్త ఫలములను
గ్రహించుట :—

వల్లభంబగు మధు - వనము నీక్షించి
"కంటిమిరా! నేఁడు - కన్నుల మిట్ట
పంట! యిందుల తీయ - ఫలము.లు గ్రోల
నాగ్రహించిన నేమి? - యామీఁద మనల
సుగ్రీవుఁ డేమి చే - సుక పోయెనేమి!"
అని తేనెపెరమీఁద - నాఁడు మక్షికల
యనువున నందఱు - నందులోఁ జొచ్చి 4660
పనటులకై వడిఁ - బనసల నున్న
తనువైన ఫలములు - తనివోక మెసవి

తియ్యమామిడిపండ్లు - తీయనివేడ్క
బయ్యాడి యామెత - పారణల్ చేసి
గుళపానకము చవుల్ - కుఱుచఁగావించు
నెలనీళ్లు మేనుల - యెళపారఁద్రావి
పెరతేనియలు కుండ - బెట్టు తేనియలు
కురుజు తేనియలును - కొమ్మ తేనియలు
బుట్ట తేనియలును - బొదల తేనియలు
జుట్టు తేంటులఁ బీల్చు - జుంటి తేనియలు
బడులుబ్బ గుత్తుక - బంటిగాఁ బట్టి
తరువుల నీడలన్ - దగ విశ్రమించి
యొకకొమ్మపైనుండి - యొకకొమ్మ కెగిరి
యొకచెట్టు వడ నూఁచి - యొకచెట్టు ద్రోచి
సారువుల్ గోరాడి - సారణుల్ గ్రొచ్చి
పేరెముల్ వారుచుఁ - బెనఁగు లాడుచును
తీగె యుయ్యేలల ని - ద్రించి పూఁదేనె
వాఁగులలో శ్రమ - వారిఁబోనీఁది
యాడుచుఁ బాడుచు - నరకట్టు లేక
చూడనైనను రాక - సుగ్రీవునాజ్ఞ
వాయువు చొరరాని - వనములోఁ గపులు
వాయునందను ప్రభా - వమున మెలంగ

—: వనపాలకుఁడగు దధిముఖుఁడు వానరుల
నాజ్ఞపెట్టుట :—

మధువనమంతయు - మథియింపఁ జూచి
దధిముఖుఁడను భాను - తనయుని మామ

వనపాలకులతోడ - వచ్చి "యోరోరి!
వనచరాధములార! - వలదు వెల్వడుఁడు
పొండని తిట్టుచుఁ - బొడుచుచు "నింక
నుండిన నాజ్ఞ సే - యుదు నొకనొకని!
మీకు సుగ్రీవుని - మీఁదాన!" యనిన
నాకపులందఱు - హనుమంతుఁ జూడ 4690
నంగదుఁ డెంత లే - దని దధిముఖునిఁ
జెంగిపోవఁగనాడి - సెలవిచ్చుటయును
గోఁతులు కొల్లయై - కొమ్మలువిఱిచి
యేతముల్ బడఁద్రోచి - యిట్టట్టుతమకు
నడ్డముల్ వచ్చిన - యా సేవకుల
దుడ్డుచు మొకములు - దోఁగ నీడ్చుచును
హనుమంతుఁ డెసపోయ - నాదధిముఖుని
వెనుకముందఱచేసి - వెనుకలు చూపి
"పోరోరి!" యనుచును - "బోయి సుగ్రీవుఁ
దేరోరి!" యనుచును - దేకున్న సీమ 4700
కోఁతుల కెల్లను - గొడుకవైనావు!
కోఁతలఁ బడకుము - కొనచెవులింక
జను" మంచు నట్టహా - సములు బొబ్బలును
వినువీథి నిండఁగా - వింపుచుఁ గపులు
వనమెల్లఁ జెఱచిన - వనపాలురెల్లఁ
దనవెంటఁ గూడిరా - దధిముఖుఁ డలిగి

—: వానరులు తనమాటలను వినకపోవుటచేత దధిముఖుండు సుగ్రీవునితో వనముపాడుచేసిన వృత్తాంతముఁ దెలుపుట :—

"కానిందు మీకు నం - గదుఁడిచ్చు సలిగె
పూనికదా వాయు - పుత్రునిఁ గూడి

యింత చేసితిరి మి - మ్మీడ్చి తెప్పించి
యింతింత కండగా - నిందఱిఁ బట్టి
కోయించకున్నచోఁ - గులములోఁ జేట
వేయగా మీపేరఁ - బిలువుఁడు తన్ను!"
అనికొమ్మ దాఁటుచు - "నంగద! యింత
వనమెల్లఁ జెఱిపించు - వాఁడవు నీవు
జాంబవంతుఁడు సుమీ - సాక్షిగా నిమ్ము
చింబోతు బిగువుచేఁ - జెడఁ గోరినావు
చూడుమంచు" ను బోయి - సుగ్రీవుఁ జేరి
యేడువు మొగముతో - నిలఁ జాగిమ్రొక్కి
తలవాఁచి నిలిచిన - దధిముఖుఁజూచి
"తలఁకకు" మని భాను - తనయుఁ డిట్లనియె
"ఎవ్వరేమనిరి! నీ - కేల యీచింత?
యెవ్వారిచే భీతి - నిటకుఁ జేరితివి?
పలుకు మీవ" న వీపు - పై పెల్లు చూపి
ములుగుచు నల దధి - ముఖుఁడిట్టులనియె
"వాలిపుత్రుఁడు నీదు - వనమెల్లఁ జెఱిచి
గాలిపట్టియుఁ దాను - కవులపై గొలిపి
మోటువారుకొని మి - మ్ముల నాడరాని
మాటలాడఁగ మేన - మామనేనైన
పాపంబుచే వారి - భానునందనుని
తోఁపులో నుండ 'వ - ద్దు తొలంగుఁ' డనిన
నీకు దిక్కైనవా - నికిఁబోయి చెప్పి
తోకొని రమ్మని - తోఁకలఁ గొట్టి
మెడవట్టి నూఁకింప - మీతోడవచ్చి

నుడివితి వింక నెం - దుకు నీవు తనకు
నీమణియముచాలు - నిఁకమీఁద నీదు
సీమనుండఁగ రాదు - సిగ్గెల్లఁ బోయె
నేమైన దన కేమి - యీ యపకీర్తి
నీమీఁద వచ్చు మ - న్నించితి వేని !',
అనవిని "యేమేమి !" - యనుఁడు లక్ష్మణున
కినకుమారకుఁడు తా - నిట్లని పలికె
"అంగదజాంబవ - దాదులౌ కీశ
పుంగవుల్ చొచ్చియి - ప్పుడు మధువనము
చూఱవట్టిరి యటం - చును వారిమీఁద
దూఱు చెప్పెడుగాని - తోఁచ దీయనకు
నంతియె చాలు మే - లయ్యెను ! జాంబ
వంతుఁడు పెద్ద మా - వాయునందనుఁడు
బుద్ధిమంతుఁడు వాలి - పుత్త్రుఁడు సుగుణ
వృద్ధుఁడు గావున - వీరల యుద్ది
వారెల్ల వచ్చినా - వనమెల్ల నేఁడు
చూఱలువట్టి రం - చును బల్కినపుడె
బ్రదికితి మాఋక్ష - రజుఁడు వాలియును
తుది యేను నొక్కరీ - తుల నాజ్ఞనడుప
మేర మీఱినవారు - మేదిని లేరు !
వీరిటు సేయుటల్ - వేడుకయయ్యె !
సీతను జూచివ - చ్చెను హనుమంతుఁ
డాతఁడుండఁగ నసా - ధ్యంబులు గలవె ?
చేసిన దుడుకులు - సేయనిమ్మందు

వాసిపోవదు నీకు - వలవదీ చింత
నినుఁ జేసినదిగాదు - నీకుఁబనేమి ?
ననుఁజేసినదిగాన - నానిమిత్తముగ
దాళుకో పొమ్మ" ని - దధిముఖుఁ బలికి

—: సుగ్రీవుఁడు దధిముఖుండు చెప్పినది విని యందలి యథార్థము గ్రహించి యావానరులను తనవద్దకుఁ దోడ్కొని రమ్మనుట :—

వేళంబె వానర - వీరులు నిటకు
రమ్మంటి మనుమన్న - రామలక్ష్మణులు
నెమ్మనంబుల గల్గు - నెగులెల్లఁ దీఱి
యాసమీర కుమారు - నగ్గించు కతన
నాస మీఱఁగ వారి - నట్ల రప్పింపు
మనిపల్క మువ్వురు - నాడు వాక్యములు
తనమదిలోని సం - తాపంబుఁ దీర్ప
గ్రక్కునఁ బోయి యం - గదుచెంత నిలిచి
మ్రొక్కి "యోయయ్య! రా-ముఁడు మిమ్ముఁబిలిచె
నెఱుఁగక యిప్పుడే - నేమి వల్కితినో
దొరలట్ల రాజపు - త్రులు సేవకులకు
మాకు నూరక యున్న - మాటలువచ్చు
నాకడ తమచిత్త - మని యెంచి యేను
మాఱు వల్కితి నది - మదిలోన మఱచి
యారాఘవులఁ జేరుఁ" - డనఁ దారకొడుకు
కపుల నందఱఁ జూచి - "కదలి పోవుదుమె ?

తపననందను సన్ని - ధానంబుఁ జేరఁ
దలపించుటయెకాని - తగుఁ దగరనుచుఁ
బలుక నేరుతునె నేఁ - బసి బిడ్డనగుట ?
ఒకమాట యాడితి - నోర్చికొనుండు
సకలంబు మీకెట్లు - సరిపోయె నదియె
సేయుఁడు మనము వ - చ్చినరాక వినియె
మాయయ్య దామ - సింపఁగ రాదు మనకు"
అనిపల్కుటయు నంగ - దాలాపనములు
వినిచేరి యాకపి - వీరు లిట్లనిరి

—: హనుమదాదులగు వానరులు సుగ్రీవుని వద్దకువచ్చుట :—

"రాజులెచ్చటనైన - రాణువవారి
యోజింప రాత్మప్ర - యోజనంబులను !
మదమత్తులై తమ - మదికెట్లు తోఁచు
నది సేతురు విధేయు - లగువారు లేరు !
రాజపుత్రుఁడవయ్యు - రక్షణీయులఁ బ్ర
యోజకులని యెంచి - యుపలాలనము స
నడిగితి వది నీమ - హానుభావతకుఁ
దొడగని తోడవిది - దోషంబు గాదు
యెటుల నీవానతి - యిచ్చితి మేము
నటుల సేయుదము మ - మ్మడుగ నేమిటికి !
విచ్చేయుఁ డేమిల్ల - వెనువెంటఁ గూడి
వచ్చెద" మనవుఁడు - వాలివాయుజులు

ండలు నెగసిన – మూఁకలతోడ
నందఱు పవమాన – హతి మింటఁ బఱచు
జలద మాలికలనఁ – జనువేళ నచటఁ

—: రాముఁడు సుగ్రీవునితో సీతవృత్తాంతము దెలియ లేదని చింతించుచు నడుగుట :—

గలఁగుచు రాముఁడ – ర్కజుఁ గాంచిపలికె
“ వచ్చియుండియు మన – వారు రారైరి
యిచ్చటి కేమిటి – కింత తామసము?
ఎట్టులున్నదియొ నీ – హృదయంబుఁ దెల్పు
మిట్ట” ని యనిన న – య్యినసూనుఁడనియె:

—: సుగ్రీవుఁడు రామునకుఁ గార్యసాఫల్యమగునని ధైర్యము చెప్పుట :—

“ గడువును మీఱి యీ – కపులెల్లవచ్చి
కపట భయమెఱుంగ – క సురాసురలు
దేఱి చూడఁగరాక – దేవరబంటు
తారా రుమా ముఖ్య – తరుణులకెల్ల
నేఱుపాటుగ నిచ్చు – నీమధువనము
చూఱవట్టిరి యన్న – చో మేలుగాదు !
పరమకల్యాణముల్ – ప్రాపించు మిమ్ము
నిరుపమ భుజసత్త్వ – నిధి వాయుసుతుఁడు
సీతను జూచివ – చ్చెను లేకయున్న
నీ తెంపు కపివీరు – లెట్లుసేయుదురు ?”
అనునంత లక్ష్మణుఁ – “డంతటివాఁడె

హనుమంతుఁ డనుపు వో - నందఱిలోనఁ
కౌఁగిలించుక రాము - కార్యమీడేర్చు
వ్రేఁగుమోపితి" వన - విని రఘూద్వహుఁడు
వాయుజుఁ డీపాటి - వాఁడని మెంచి
నాయుంగరంబిచ్చి - నాఁడు పంచితిని
యొనరి యున్నది నీదు - యోజన యనఁగ
వినువీథి నప్పుడె - వినవచ్చెఁ గవుల
కిలకిలాయిత విశం - కిత విరావంబు
పెళపెళ నురుములు - పెనుగొన్న యటుల
హనుమంతు నంగదు - నానగా మొదట
నునుచుక వానర - వ్యూహమంతయును
వచ్చినంతన తమ - వారల నెల్ల
మెచ్చి కన్గొనుచుండె - మిహిరనందనుఁడు

—: హనుమంతుఁడు సీతనుఁ జూచితినని శ్రీరామునితోఁ
జెప్పుట :—

" చూచితి సీత !" నం - చును రఘువీరుఁ
జూచి వాకొని వాయు - సూనుఁడు పలుక
మెచ్చి సుగ్రీవ సౌ - మిత్రులు వొగడి
రచ్చెరువున నుండ - నవనిజాప్రియుఁడు
కలగొని రామునిఁ - గాంచి వానరులు
" జలరాశి దాఁటెను - జానకిఁ జూచె
లంకఁ గాలిచె దైత్యు - లను వధియించె
యంకలిలేక కా - ర్యము నిర్వహించె!

ఈ హనుమంతుఁ డం - తింత గాదితని
సాహస కథ"లన్న - సంతోషమంది
పవనజుమోముఁ ద - ప్పక చూచి కరుణ
చివురొత్తఁ గ్రమ్మఱ - శ్రీరాముఁ డనియె.
"ఎందు నున్నది సీత ? - యెట్టి చందమునఁ
గుందియున్నది నల - కువ కెట్టులోర్చి ?
ఏమంటి వాయింతి - యేమని తనదు
సేమంబు నాతోడఁ - జెప్పి రమ్మనియె ?
గుఱుతు లెయ్యవి పేరు - కొను"మన్న మ్రొక్కి
కఱువలిపట్టి రా - ఘవున కిట్లనియె.

—: సీతయిచ్చిన శిరోమణిని శ్రీరామున కొసంగుట :—

"జలజాప్తవంశభా - స్కర! రామచంద్ర!
జలరాశి దాఁటి యేఁ - జనుచోట నడుమఁ
బెక్కు విఘ్నములు గ - ల్పిన నవి ద్రోచి
యుక్కుతో లంకకు - నొక్కఁడఁ జేరి
రేయెల్ల నమ్మవా - రినిఁ బురినెల్ల
చాయల వెదకి ద - శగ్రీవు నగరు
జూచి లేకునికి య - శోకవనంబుఁ
జూచి యందొకచోట - చుట్టు నున్నట్టి
దనుజకాంతలలోనఁ - దన నెఱివేణి
పెను జడగట్ట మీ - పేరు వాకొనుచుఁ
గన్నీరు గురియ నం - గము మైలవాఱఁ
జెన్నుచాలక మైల - చీరధరించి

తలవాంచి యున్న సీ - తాదేవిఁ జూచి
పలుకరింపఁగ శింశు - పావృక్షు మెక్కి
దాని మీఁదట నుండి - తావక చరిత
మేను వాకొనఁ దల - యెత్తి చూచుటయు
సమయంబు గాంచి యేఁ - జని చేరి మ్రొక్కి
రమణీమణికి నుంగ - రము చేతి కిచ్చి
యో యమ్మ మిముఁబాసి - ప్రాణముల్ దాల్ప
నే యుపాయము లేమి - యెఱిఁగి యూరార్చి
గుఱుతుగా నొకటిపే - ర్కొనుమన్నఁ గాకి
పరిభవించిన కథా - భాగంబు నుడివి
జేవురు బొట్టు దీ - ర్చిన నాటి తెఱఁగు
నావన సంచార - మపుడు వాక్రుచ్చి
తన శిరోమణి యిచ్చి - తను వీడుకొలుప
వనమెల్లఁ బెఱికి రా - వణ మంత్రిసుతులఁ
జంపి సైన్యేశ పం - చకము నడంచి
తెంపుఁ జూపిన యక్షుఁ - దెగటార్చి వెనక
నింద్రజిత్తునిచేత - నేఁ జిక్కి దాన
వేంద్రుని కొలువున - కేఁగి యేనతని
దూషింప విని యుల్క - తో రావణుండు
రోషంబుతోడ వి - రూపుఁ గావింపఁ
దోఁకఁ గాలిచి వీనిఁ - ద్రోలుఁడటన్న
నాఁక చేసుక దైత్యు - లట్లు సేయుటయు
లంకఁ గాలిచి మఱి - ల మహిజఁ జూచి
పంకజేక్షణ ! నీదు - పదములు గంటి !
నెలగాని యిటమీఁద - నేఁదాళననుచుఁ

బలికె జానకి లంక - పై విడియుటకు
జలరాశిఁ దాఁట యో - జన సేయుఁ”డనుచుఁ
బలికి భానుప్రభా - భాసురంబైన
సీత శిరోమణి - చే చాఁచి యొసఁగఁ
జేత నందుక రఘు - శ్రేష్ఠుఁ డుప్పొంగ!
అప్పుడు సన్నిధి - నవనిజఁ గాంచు
చొప్పునఁ దనివోక - చూచి హర్షించి
గళ్ళపాలిక నొత్తి - కన్నులఁ జేర్చి
యుల్లంబు చల్లగా - నురముపై నుంచి
“హా! సీత!”యని యేడ్చు - నన్న నీక్షించి
యాసుమిత్రాపుత్రుఁ - డడలుచు నుండ
“వసధిఁ గౌస్తుభముద్భ - వము నొందినట్లు
జనియించె నిది నీట - జనకభూపతికి
బృందారకేంద్రుఁ డ - ర్పించె యాగమున!
ఎందును వెలలేని - యీ మాణికంబు
నా పెండ్లినాఁడర - ణముగాఁగ నిచ్చెఁ
జేపట్టి పట్టియా - సీతకొప్పునకు
నీమణివరముఁ దా - నెప్పుడు సీత
సీమంతవీధికి - శృంగారకరము!
సీత ధరింపఁ జూ - చినవాఁడ నాదు
చేతఁ గైకొని ధరిం - చిన మనఁగలనె?
స్త్రీశిరోమణియైన - సీత వేనలిని
యీశిరోమణిఁ దాల్ప - యిఁకఁ జూతునొక్కొ!
ఏమయ్యెనో సీత - యెందు నున్నదియొ?
ఏమి సేయుదు నని - యేనుంటిగాక

యీమేర సీత చో - ప్పెఱిఁగిన వెనుక
నీమేనఁ బ్రాణము - లేఁటికి నుండు ?
దాళలేనిఁక నెట్లు - దమ్ముఁడా !"యనుచు
వ్రాలి సౌమిత్రిపై - వాతెఱ యెండ
" రక్షింపవే సుమి - త్రాపుత్ర ! నన్ను
రక్షింప సుగ్రీవ ! - రావే " యటంచు
మఱల రాముఁడు పవ - మాన బాలకునిఁ
గరుణారసము చిల్కఁ - గాఁ జూచి పలికె.
' అన్న ! వాయుకుమార ! - యాపన్నునన్ను
మన్నించి ప్రాణముల్ - మఱలింపు మీవు !
నన్ను నెత్తుకపోయి - నలినాక్షి సీత
యున్న వనంబులో - నునిచి రమ్మిపుడు !
ఏల చెప్పితి ' సీతఁ ' - నేఁ గంటిననుచు ?
తేలేవె మూపుపైఁ ? - దేవలెనన్నఁ
జూచియు డించి వ - చ్చునె నిన్నువంటి
ధీ చతురుండు నా - తెఱఁగెఱిఁగియును ?
ఏమి వల్కెను సీత ? - యెటులోర్చె దనుజ
భామలచేతి ని - ర్బంధంబులను ?
నీవేమి యంటివి ? - నిమిషమాత్రంబు
నీవలఁ దాళలే - నెగిరి పోఁజాల
నెట్టులున్నది సీత ? - యేమని మాట
పట్టులిచ్చితి వింకఁ - బ్రదుకునే నెలయు ?
తెలియఁ బల్కుము వెతఁ - దీఱె కొన్నాళ్లు
నిలువరించెద " నంచు - నిలుపోపలేక

కలఁగుచునున్న రా - ఘవు మోముఁజూచి
యలమటల్ దీఱఁగ - హనుమంతుఁడనియె.

—: హనుమంతుఁడు చెప్పిన సీత వృత్తాంతము విని
శ్రీరాముఁ డానందము నొందుట :—

"అయ్య! నేఁ బొడగన్న - యప్పుడే చిత్త
మియ్యక రావణుఁ - డే తప్పదనుచు
ననుఁ జూచి మదిలోన - నమ్మిక మిమ్ము
వినుతింపుమని రూప - వృత్తంబు లడిగె.
జనకజయాత్మకు - సరిపోవఁజెప్పి
వెనుక నిచ్చితిని మీ - వ్రేలి యుంగరము
నందుచే విశ్వాస - మంది నాతోడ
మందలించినయట్టి - మాటలు నాకు
బలుక నోరాడదు - పలవరింపుచును
విలపింప శ్రీరామ - విభునిఁ దెచ్చెదను
రావణుఁ దునిమింతు - రమణుని తోడ
దేవి! కూర్చెద నిన్ను - ధృతివదలకుము.
అనుచు బాసలు చేసి - యానవాలడుగఁ
దనదు చూడాగ్ర ర - త్నముఁ బ్రసాదించి,
తాను నిద్రించుట - తరువాత నిదుర
వూని మీరున్న య - ప్పుడు జయంతుండు
కాకియై తనదు వ - క్షము నఖాగ్రముల
రేకవారింప జా - ఱిన రక్తధార
మీ మూఁపుపై సోఁక - మేల్కాని యుందు

కేమి నెపంబన్న - నేర్పరించుటయు
నందుకు నలిగి బ్ర - హ్మాస్త్ర మేయుటయుఁ
గొండలంబునఁ గాకి - కూయుచుఁ బఱచి
యేలోకములకుఁ బో - యిన నభయంబు
పాలించు దేవతా - ప్రభువులు లేక
శరణుఁ జొచ్చినవానిఁ - జాల మన్నించి
కరుణాపరుండవై - కాచి పొమ్మనుట
వినిపించి నేఁటికి - "విపినంబులోన
ననఘాత్మ! నిలువు మా - యాసంబుఁ దీఱ
నే నల్పభాగ్య నా - క్కించుకఁ దాల్మి
పూనెద నీరేయి - యూరడిల్లెదను.
అన్న! రాఘవుఁ డెత్తు - నంటి వేరీతి
మున్నీరు దాఁటి త - మ్ముఁడు దాను వచ్చు
కరువలియును నీవు - గరుడుండుగాక
శరధి నన్యులు దాఁట - శక్తులు గారు
మీ రాజు కొలఁది యే - మియు నేనెఱుంగ
శ్రీరాము నన్నుఁ గూ - ర్చినపుణ్యమనుము!
చెనకినఁ గాకి ని - షీకంబువైచి
వనజాండమునను ది - వ్యశ్రేణికెల్ల
వెఱపు పుట్టించు నీ - విక్రమంబునకు
సురలెంత రావణా - సురుఁడెంత గలఁడు?
అట్టి నామీఁద ద - యారసంబొకఁడు
పట్టుక పోవుచో - పాటిరాదయ్యొ!

తనయదృష్టంబొ చే - తను గాక మీరు
కనిపించుకొనరొ యే - గతి నోర్తు ? ననుము
రామునిఁ దెత్తు వా - రాశిపై ననుట
నామది సరిపోదు - నమ్మించితేని.
నీవిట్లు రావేని - నిమిషంబులోనఁ
బోవు ప్రాణము లట్లు - బోకుండఁ జేసి
మఱలించినావు సే - మముఁ గాంచి పోయి
మఱలుము నాదు నె - మ్మది శాంతినొందె"!
ననుటయు మరల న - య్యవనిజ మొగముఁ
గనుఁగొని యేను రా - ఘవ ! యిట్టులంటి
" అమ్మ ! సుగ్రీవుని - యంతటివాఁడు
నమ్మించినాఁడు నీ - నాథుని మొదట
నతనిఁ గొల్చిన వాన - రానీకమునకు
నతివ ! యీ జలరాశి - యన నెంతగలదు !
వాలాయుధులు బల - వంతులు శౌర్య
శాలులు నాతోడ - సరివారు ఘనులు
కాంచనాచల నిభుల్ - గాని నాకన్నఁ
గొంచెపువానిఁ బే - ర్కొన నెందు లేఁడు.
మనసులో నెన్నుము - మర్కటేశ్వరులు
జనకజ యున్నట్టి - చందంబుఁ జూచి
రమ్మని పనుచు కా - ర్యము వూనివచ్చి
యొమ్మెలఁ బోయిన - నెంతురే నన్ను ?
అంతమాత్రపువాఁడ - నగచరులెల్లఁ
జెంతకు రాఁగొట్టి - చెప్పినయట్టి

పనుల మెఱంగెదు - పాటినానదకఁ
గనియెదు త్రేపె యీ - కపివీరవరుల
నెప్పుడు నేఁబోయి - యిచట నీవున్న
చొప్పు వచించిన - సుగ్రీవుఁడచటఁ
గాలూఁది నిలువఁడు - కపినాథులెల్ల
నేలిక దండు బో - యినఁ బోదమనుచు
దలఁపరు సెలవిమ్ము - దశకంఠుఁ డానె
పొలియింతు ననుచు ని - ప్పుడె వత్తురిటకు ! 5010
రామలక్ష్మణులెట్లు - రానేర్తు రనిన
నామూపులందుఁ ది - న్నఁగ నెక్కి కదలి
గగనమార్గమున ని - క్కడ వచ్చినిలిచి
మగువ ! రావణుఁ బట్టి - మర్దింపఁ గలరు.
శ్రవణపర్వంబగు - జ్యావల్లిమ్రోఁత
చెవిసోఁకు భీకర - సింహనాదములు
రామలక్ష్మణ కపి - వ్రాతంబువలన
భూమిజ ! నమ్ము నేఁ - బోయివచ్చెదను
నాసత్యమాన నీ - నాయకుఁ గూడి
యోసాధ్వి ! మీరల - యోధ్యాపురమునఁ 5020
బట్టాభిషిక్తులై - ప్రజలఁ బాలింప
నట్టి వేడుక చూచి - నప్పుడిచ్చోటఁ
బలికిన యట్టి నా - పలుకు లన్నియునుఁ
గలకంఠి ! నాఁడు తా - ర్కాణ సేయుదును "
అనునంతలో సీత - యనుమాన ముడిగి

తనలోన మీచెంతఁ - దానున్నయట్లు
యాయశోకవనంబె - యంతరంగమున
నాయయోధ్యాపురం - బనినంత కలిగి
నెమ్మదితో నోరు - నిండ దీవించి
పొమ్మన వచ్చితి - భూరి శౌర్యమున !
వీరవానరులతో - విచ్చేసి కలన
నారావణునిఁ ద్రుంపుఁ - డవనిజఁ దెండు."
అనిన సీతాదేవి - యచట నుండుటయు
మనసులో ననురాగ - మగ్నయౌటయును
వీనులు చల్లఁగా - విని రఘువీరుఁ
డానంద మగ్నాంత - రంగుఁడై యుండె.

—: కాండాంతగద్య :—

విలసిల్లెనని వేద - వేద్యుని పేర
నలమేలుమంగాంగ - నాధీశు పేర
నంచిత కరుణాక - టాక్షుని పేరఁ
గాంచనమణిమయా - కల్పుని పేర
వేదవేదాంతార్థ - వినతుని పేర
నాదిత్యకోటి ప్ర - భాంగుని పేరఁ
గంకణాంగదరత్న - కటకాఢ్యు పేర
వేంకటేశుని పేర - విశ్వాత్ము పేర
నంకితంబుగ వేంక - టాధీశ చరణ
పంకజసేవాను - భావమానసుఁడు
హరిదాసమణి కట్ట - హరిదాసరాజు

వరదరాజు నితాంత - వరదానశాలి
రచియించు వాల్మీకి - రామాయణంబుఁ
బ్రచురభక్తిని మదిఁ - బాటించి వినినఁ 5050
జదివిన వ్రాసిన - సభలఁ జేర్కొనిన
మదిఁ దలంచిన నెట్టి - మనుజులకైన
ధారుణిమీఁద సీ - తా రామచంద్ర
పారిజాతదయా - ప్రభావంబువలన
హయమేధ రాజసూ - యాదిమయాగ
నియతఫలంబులు - నిరతాన్నదాన
సుకృతంబు నిత్యయ - శోవైభవములు
సకలంక తీర్థయా - త్రాది పుణ్యములు
సత్యవ్రతపదంబు సకల సౌఖ్యములు
నిత్యమహాదాన - నిరుపమశ్రీలు 5060
కలికాల సంప్రాప్త - కలుషనాశనముఁ
గలుములు హరిభక్తి - గౌరవోన్నతులు
శత్రుజయంబును - స్వామిహితంబుఁ
బుత్రలాభంబును - భోగభాగ్యములు
ననుకూలదాంపత్య - మంగనాప్రియము
ధనధాన్య పశువస్తు - దాసీసమృద్ధి
మానసహితము ధ - ర్మప్రవర్తనము
నానందములు ఖేద - మందకుండుటయు
నలఘువివేకంబు - నతులగౌరవము
వలయు కార్యములు కై - వశములౌటయునుఁ 5070

పావనత్వము దీర్ఘ - పరమాయువులునుఁ
గైవల్యసుఖము ని - క్కముగాఁగఁ గలుగు!
ఎన్నాళ్లు రవిచంద్రు - లెన్నాళ్లు గిరులు
ఎన్నాళ్లు నిగమంబు - లెన్నాళ్లు విశ్వ
మున్నాళ్లు నీకథ - యలరు నాఘ్నంబు.
ఆదికావ్యంబు స - మస్తపూజ్యంబు
వేదసమానంబు - విశ్వసన్నుతము
శోభనకరమునౌ - సుందరకాండ
మీభూమిఁ బాపఘ్నమ్ము - మెరయించుఁగాత. 5079



కట్టా వరదరాజకృతమగు
ద్విపద రామాయణమున
సుందరకాండము
సమాప్తము.

శ్రీ రామచంద్రార్పణమస్తు

